ఓం

బ్రహ్మపుర

# వేగుంజుక్క గ్రంథమాల

13 వ మణి

యగు

# కోటీశ్వర తనయ

Millionaire's daughter

అను

అద్భుత వినోదక నవల.

ఇయ్యది

మ॥ రా॥ రా॥ తాతా కృష్ణమూర్తి బి. ఏ. గారు

రచియించిరి.

వేగుంజుక్క గ్రంథమండలిచే సంపాదితము.

మొదటి కూర్పు.

వేగుంజుక్క ముద్రాలయము,

బరంపురం.

**1922.**

Registered.] [Price Rs. 1-4-0

# వేగుంజుక్క గ్రంథమాల.

ఇదివరకు ప్రచురింపబడిన గ్రంథములు.

| | చందాదారులకు | ఇతరులకు |
|---|---|---|
| 1. ఉషఃకాలము | 0 14 0 | 1 8 0 |
| 2. వాంఛీవీడు | 1 0 0 | 1 4 0 |
| 3. ప్రేమమూర్తి | ప్రతులు లేవు. | |
| 4. సుహృల్లత | 0 12 0 | 1 4 0 |
| 5. పద్మినీపరిణయము | ప్రతులు లేవు. | |
| 6. విలాసార్జునము | 0 8 0 | 0 12 0 |
| 7. సగుణ (మొదటిభాగము) | 1 4 0 | 1 8 0 |
| 8. ,, (రెండవభాగము) | 0 10 0 | 0 12 0 |
| 9. ,, (మూడవభాగము) | 0 10 0 | 0 12 0 |
| 10. కొవ్వొత్తులు | ప్రతులు లేవు. | |
| 11. వేంకటరావు | 1 0 0 | 1 8 0 |
| 12. నేనే (వాంఛీవీడునకు రెండవభా॥) | 1 0 0 | 1 6 0 |
| 13. కోటీశు తనయ | 1 0 0 | 1 4 0 |

రాబోవు గ్రంథము:—కాలూరాయి.

ఫూల్ సాహెబు-జమీందారులను తన బుద్ధివిశేషము చే ధించిన అప్రతీపప్రతాపవంతు డనదగిన అరిందమ వంటి మహోద్ధత మేధాశాలినే, అరెస్టుచేయించి, పర్యాయమున 'జితోస్మి' యనిపించిన కాలూరాయి చరిత్ర వినవిన కౌతూహలమును, ఆలోచించినకొలందిని స్తంభీభూతత్వమును, చదువరులకు గల్గింపకమానవు. తినబోవుకూరకు మున్ముందు రుచులు దెలుపనేల.

VEGU-JUKKA OFFICE, BERHAMPORE.

**D. V. Krishnarao,** *Secretary.*

క్షణ మొతము లేక బయాస్కోపు చిత్రమువలె కాలచక్రము కన్న విపరీత వేగముతో హంతకునిచే జరుపబడిన భయానక దురంత కార్యములు చదువరుల గుండెలు కంపింపజేయును.

ఏకారణముచేతనో గాని గ్రంథకర్త యీ కథాకాలము గాని, యీకథ జరిగిన ప్రదేశము గాని, గ్రంథమందెచ్చట నైన చెప్పకుండుటయేగాక, మా యాంధ్రపాఠకులకు ఆంగ్లేయ కుటుంబ మర్యాదలును, సంఘ మర్యాదలును గ్రంథమందచ్చటచ్చట గనుపరచియే యున్నారు. మఱియు నీ కథయంతయు నేడు దినములలో జరిగిన విషయముగాని వ్రాసియున్నారు. కావున కథావిభజనమును, నేడు దినములకును దినచర్యావిభజనమును మా పాఠకులదే. ఇప్పటికి దెలుగున వ్రాయబడిన అపరాధపరిశోధక నవలలలో నేదియు దీనివలె క్రొత్తత్రోవల ద్రొక్కినవి కావు.

గ్రంథమునం దచ్చటచ్చట చిన్నమార్పులు చేయుమని మేము కోరగా గ్రంథకర్తగారు యేలకోగాని చేయలేదు. ఆ కారణముచే మేము వ్రేలిడుటకే నవకాశము చిక్కలేదు.

అపరాధ పరిశోధక నవలలలో జూడదగినవి: కథాసందర్భము, కథావిధానము, పాత్రోచితమగు భాషయు, శైలియు, పాత్రముల స్వభావసమ్మేళనమును మాత్రమే. పాత్రౌచిత్యము, గ్రంథప్రాశస్త్యము మొదలగు సర్వవిషయములును మా పాఠకులనే స్వతంత్రముగ దెలిసికొనగోరుచున్నాము.

సుమారు మరి మూడు మాసములలో "కాలుంగాయి" తో మీ దర్శనము మరల సేయ నేటికి సెలవు గైకొందుము.

ఇట్లు,
సంపాదకుడు.

జూలై, 1922.

# PREFACE.

The present Novel is my first venture in serious telugu composition done with what success my readers alone can judge.

Of late I have been reading a deal of sensational fiction, especially the writings of Edgar Allan Poe, Arthur B. Reeve, Conan Doyle, Maurice Le Blanc, William Le Cruix and others of note. The bold idea to write a really good and interesting detective novel in Telugu, first struck me some three years ago, when for the first time I read Mr. Reeve's skillful story "The Exploits of Elaine or the Clutching Hand." My readers can easily note that to some extent my "Kotisu Tanaya" runs on similar lines with Mr. Reeve's novel. But I make bold to say my story is more or less original. It is therefore entitled, I fear, to many limitations.

No one is better aware than myself how great is my indebtedness to the foreign writers of detective fiction. In fact some of the strange and *outer* incidents mentioned in my work are reminiscent of the writings of those ingenious Western Story-Tellers.

It is my belief that there are no detective novels worth the name in Telugu literature. Perhaps Indian life does not afford much scope for the development of good detective fiction.

Everyone knows that criminals in India are no such diabolical or pathological geniuses as are readily believed to be found in the West. Indian life, thank God!, is not much tinctured with European or American civilization. I am not very sorry for the absence of a Sherlock Holmes or Arsene Lupin in our society, but I am really glad there are no Clutching Hands or Zigomars in India. I cannot imagine how some of our Telugu writers are emboldened to weave strange stories of mystery and crime about the common life of Bengal.

Mine is for very obvious reasons no Indian story. It is American or English or a mixture o both if you like. My scenes and characters accordingly are foreign.

The reader will forgive me if in this wor' I can offer him no more than an interesting pl and dramatic characterization. If the tim sequence of the plot is carefully followed, the reader will easily find that the duration of the action of the story is exactly a week.

I shall be thankful to my readers for any suggestions for improvement in my next edition and shall gladly welcome all honest criticism.

BERHAMPORE,<br>February, 1922. } T. KRISTNA MURTI, B. A.

TO

*My late lamented brother*

# *T. S. Rama Sastri,*

*" Perhaps a frail memorial, but sincere ;*
*Not scorn'd in Heaven, though little noticed here."*

# వేగుంజుక్క – గ్రంథమాల.

బరంపురం (గంజాం)

వాడేవీడు 1912 సంవత్సరమునను, నేనే 1918 సంవత్సరమునను ప్రచురింపబడినవి. ఈ రెండు గ్రంథముల తరువాయి యునగు "కాలూరాయి" అనుగ్రంథము సెప్టెంబరు తరువాత వెలువడగలదు. కాలూరాయి ప్రచురింపబడిన తరువాత మూడు మాసములకు వాడేవీడు, నేనే, కాలూరాయి యను నా మూడు గ్రంథములను గూర్చియు సుమారు 1923 సం॥ జనవరి నెలలో నొక బహుమానపరీక్ష జరుపబడును.

ప్రథమ బహుమానము రూ. 200 లు.
ద్వితీయ ,, ,, 100 లు.

ఎప్పుడైనను పరీక్షలకు ప్రత్యేకస్థల మేర్పాటుకాజాలదు. ఎవరి యింట వారు గూరుచుండి వారివారి యుపకరణముల (కలం, కాగితము, సిరా మొదలగువాని)తోనే జవాబులువ్రాసి పంపవలెను.

"కోటీశు తనయ" బహుమాన పరీక్షా నియమములే యీ పరీక్షకును వర్తించగలవు. బహుమానములును, తేదీలును మాత్రమే భేదించుచుండును.

"కాలూరాయి" అను గ్రంథము ఈ గ్రంథాలయము నుండి తెప్పించుకొని ఆ గ్రంథముపైనుండు సంఖ్యను దెలుపుచు పరీక్షకు దరఖాస్తు చేయుట జరుగవలెను. ఒకే నెంబరు అనగా ఒకేగ్రంథముతో నిరువురుగాని ముప్వురుగాని ఏక కుటుంబమువారుగాని ఏకసంఘము వారుగాని, మరెట్టి సంబంధము గలవారుగాని పరీక్షకు దరఖాస్తు చేయజాలరు.

డి. వి. కృష్ణా రావు, సెక్రిటరీ.

ఘుడు దృఢకాయుఁడై, చూచువారికి రమారమి నలువదియేండ్లు వయసుగలవానివలెఁ గన్పట్టును. రాత్రి యగుటచే, వెన్నెల యున్నను, చెట్లనీడలుగుట నున్న వాని యాకారము పరీక్షించి చెప్పుటకు సాధ్యము గాదు. వాఁ డొక గులాబి మొక్కపై తన రెండు చేతులను సుమా రొక పదినిముసములదనుక నుంచి, పిమ్మట దీసి వేసెను. పిదప వాఁ డా పూఁదోట నెల్ల యెడల బరికించి, కొన్ని పుష్పముల గోసికొని, వెంటనే యాస్థలము వీడి చనెను.

* * * * * *

నాఁడు తెల్లతెల్లవారు సమయమున, వచ్చియు రాని మెలఁకువతో నేదో కలఁ గని యుంటచే గాఁబోలు, 'లాలీ' సెజ్జపై శయనించినదై, కన్నులు విప్పక, తనలోఁ దా మెల్లఁగ నవ్వుకొనుచుండెను. ఇంతలో గదిలోనున్న గడియారము టంగు టంగున మ్రోగ దొడఁగ, లాలీ యా ధ్వనికి మేల్కాంచి కన్నులు విచ్చెను. మంచమునుండి లేచి, యథాక్రమమున తన గదలో నొకచో దగుల్పబడి యుండిన యద్దములో మోము జూచుకొని, వస్త్రముల నవరించుకొని నాతఁడు దర్పణము చెంతకేగి నిలచెను.

వాని శయనాగారము విశాలమై, పరిశుభ్రమై యుండెను. గదిలోనున్న మంచమున కొకింత దవ్వున నొక పెద్ద మేజాబల్లయు, నద్దాని వెనుక నొక యినుప ఖజానా పెట్టెయు నుండెను. గోడ కమర్చబడియున్న యద్దములో జూచిన నా యినుప పెట్టె కూడ కొంత భాగము కనబడును.

అరువది డెబ్బది యేండ్లకు పైబడు వయస్సు కలిగియు లాలీ మిగుల బలాఢ్యుడై యుండెను. మెరుపు దీపము వెలుఁగున యద్దములో తన ప్రతిబింబమును జూచుకొనుచు నిలచిన.

తని నవ్వును చూడగలుగు వారికి, లాలీ యవ్వనములో నున్న ప్పుడు మిక్కిలి బలిష్ఠుడై సౌందర్యమూర్తి యనదగు రూపు రేఖా విలాసములు గలిగియుండెనని తోచకమానదు. దర్పణ మున తన ముఖబింబము గమనించుకొనుచుండిన లాలీ కన్నుల కేమి గోచరించెనో కాని, ధైర్యము గలవాడయ్యు, నాతడు తటాలున రెండడుగులు అద్దముననుండి వెనుకకు వచ్చె. యూ రక నేమియు తోచని వానివలె నిలచెను. వాని మోమున భయాశ్చర్య చిహ్నములు విశదమగుచుండెను. కొంతతడ వట్లు నిలచి, మెల్లగా వెనుకకు దిరిగి, లాలీ చప్పుడు జేయక తన మేజా సొరుగులోనున్న పిస్తోలును దీసి, యెక్కుబెట్టి, నేల పై గురిచూచి, కొట్ట సిద్ధపడెను.

“...ఈ పాము గదిలోని కెట్లు రాగలిగినదో కదా? నా యింట నెన్నడును సర్పమనునది కానరాలేదే!...సరియే.— అద్దములో చూచుట మేలైనది. లేనిచో నన్నిది కఱచి యుండును.” అని తనలో ననుకొనుచు, నా వృద్ధుడు తన ఖజానా పెట్టెకు సమీపమున జుట్టుకొని, కదలక మెదలక యుండిన విషసర్పముపైపు దృష్టి నిగిడ్చి చూచుచుండెను. లేశ మాత్రమైనను సవ్వడి వినవచ్చినచో, సర్పము వెనుదిరిగి తన పై బడునేమోయని, లాలీ తన యూపిరిగూడ బిగపట్టి, పిస్తో లుతో నా పామును కాల్చెను. గుండు ప్రేలినవెంటనే గదినిండ పొగ గ్రమ్మెను. అద్దములో నొక పెద్దమెఱుపు కానవచ్చెను. గదిలో పుట్టిన ధ్వనికి గృహములో నున్నవా రందరును త్రుళ్లి పడి లేచిరి.

“ఏమిది!—తుపాకిధ్వనియెక్కడ?” అని, నిద్దురలేచిన

'మేరీ' దుస్తుల సవరించుకొని, తన గదిలోనుండి వెలుపలి కేతెంచెను. ఆమె సుమారు పదియేండ్ల జవ్వని. లాలీగారి యేక పుత్రిక. ఆమెను బాల్యము గడుపక పూర్వమే తల్లి మృతినొందుటచే, లాలీ గారు ముద్దుకూతు నతి గారాబముతో పెంచుచుండెను.

గుండు పేలిన "ఢాం" మ్మను శబ్దము వినినతోడనే మేరీ బిరబిర నిజజనకుని గదికి వచ్చి, తలుపు దట్టబోయెను. ఇంతలో తోటమాలియగు 'టామీ' వచ్చి మేరీపై నామె కెదురుపడెను. వాడంత మేరీ నుద్దేశించి, "అమ్మా, నేటితోటలో మంచి పువ్వు లేవియు లేవు. గులాబీలలో పెద్దదేదియు పూయలేదు." అని పల్కి, తాగోసి తెచ్చిన సుమముల నామెకు జూపెను. పుష్పములన్ని పరికించి జూచి, యా సుందరి కొంచెము పెద్దదై యున్న యొక చక్కని గులాబీ నందుకొని, పదిలముగ నా పూవును తన వక్షస్థలమున దగిల్చుకొనుచు, "టామీ, పువ్వుల మాటకేమిగాని, నీవేదైన శబ్దము వింటివా?" అని యడిగెను.

వా డామె పల్కుల వినిపించుకొనకయే వెనుదిరిగి చనసాగెను. మేరీ చూచి, "టామీ...టామీ!—అబ్బా వీని కెంత చెముడు!" అని తనలో ననుకొనుచు, నింతలో వాడు వెను దిరిగి చూడ, "సరియే, పొమ్ము—నీ పని నీవుచూచుకొనుము" అని పల్కి, యామె తన జనకుని గది తలుపు దట్టసాగెను. ఎన్నిసారు లామె గంట మ్రోగించినను, లోనుండి జవాబు రాకుండెను.

"ఏమిది?" అని యాశ్చర్యపడుచు మేరీ మరల మరల పిలుచుచుండెను. కానిక ర్యము లేకుండెను. అంత మేరీ భయపడి

మేడహాలులోనికి జని, 'అలారము' గంటను మ్రోగించెను. తోడనే యా ధ్వనికి తత్తరపడి గృహమున నున్న వారందరును మేడ మీదకు వచ్చిరి.

తలుపు నెందరెన్నిసారులు తట్టినను, లాలీగారిని పిలిచినను, యరచినను, లోనుండి యెట్టి జవాబును రాకుండెను. అంతకంతకు మెరీ దిగులు పడసాగెను. జనకుని కెట్టి యాపదయైన సమకూరెనా యని యామె మనసున తత్తరపడ దొడగెను.

అందరును గూడి, కవాటము బ్రద్దలుచేసిరి. తలుపు దెరువబడగనే మెరీ తటాలున లోప్రవేశించెను, ఆమె కన్నుల కేమి యగుపడెనో కాని, హాహా యను బలు కెవ్వున నరచుచు సొమ్మసిలి, నేలబడి స్మృతి దప్పెను. అటనున్న వారందరును నిశ్చేష్టులై నిలువబడిరి. గదివద్ద మూగిన వారిలో ధైర్యవంతుడొకడు లోనికి బ్రవేశించి యంతయు బరీక్షించెను. నేలబడి యున్న పిస్తోలు గొనిచూడ, దానిపై 'లాలీ' యను రెండక్షరములు స్పష్టముగ జెక్కబడి యుండెను.

"ఏమీ!—తనకు దానే కొట్టుకొనెనా? కారణ మేమై యుండును?" అనుచు నందరు నాశ్చర్యపడుచుండిరి. లాలీగారి ప్రైవేటు సెక్రెటరీ (అనగా యెల్లప్పుడును యజమానుని హుజూరున నుండెడువాడు) పోలీసు ఠాణాకు టెలిఫోను లో వర్తమానము నంపెను. 'లాలీమందిరము'న నెట్టియో కలవరము పుట్టినదను వార్త పురమెల్లను శీఘ్రముగ వ్యాపించెను. మేడచుట్టును పెక్కండ్రు గుమిగూడి పరిపరివిధముల మాటలాడుకొనుచుండిరి. ఆత్మహత్యయని కొందరును, అకస్మిక మర

చున్నారు ?" అని ప్రశ్నించెను.

"ఇనస్పెక్టరు వచ్చి తనిఖీ చేయుచున్నాడు." అని రాస్ కడు వినయవిధేయతలతో బదులు పల్కెను. మేరీ కొంతవరకేమియు మాటాడక యూరుకొని, నిట్టూర్పుతో లేచి సోఫాపై గూర్చుని, తనచెంత నిలచియున్న రాస్ నుద్దేశించి, మోము పైకెత్తి వానివైపు నిదానించి చూచుచు, "అయ్యా, ఇనస్పెక్టరు తప్ప ఇం కెవరైన వచ్చియున్నారా ?" అని యడిగెను.

"ముగ్గురు జవానులు కూడ వచ్చియున్నారు"

"ఇనస్పెక్టరనగా 'మేయో' గారే కదా ?"

"అవును; ఆయన చాల తెలివైనవాడు."

"నే నెరుగుదును. ఆయనతో నంతగా పరిచయము లేకున్నను, మేయో గూర్చి నా జనకుడు చెప్పగా వినియుంటిని. కాని—" అని యేమో యనబోయి, మేరీ మరల యూరకుండెను. "అయ్యా, నా తండ్రి యెటు మరణించెనో యూహించగలరా?"

"ఆ విషయమై నాకు, తలయు తోకయు నందకున్నవి. మనసు స్థిమితము లేనప్పుడు బుద్ధి యేమియును పాలుపోదు. మరల నీ జన్మములో నా కట్టి యజమానుడు లభింపడు. కన్నకొడుకు కన్న నెక్కువగా జూచుచుండిన లార్డుగారిని నే నెట్లు మరువగలను ? ఆయనకు మరణ మేగతి సంభవించినదో కూడ తెలియకున్నదే ? ఈ వార్త తెలియవచ్చినదాదిగా నా కేమో పిచ్చి యెత్తినట్లున్నది" అని దీనస్వరముతో రాస్, కన్నులు నీరుగ్రమ్మ, బలికెను.

"నా పితృమాత్రము జనకుని మరణము ఆత్మహత్యవలనో

చను. ఆయన తన్ను దా జంపుకొనునంతటి మూర్ఖుడు కాడు. ఎవరో శత్రువు లాయనను చంపియుండవలెను.” అనుచు మేరీ యాలోచించుచున్నదానివలె శిరము వంచి, పల్కెను.

‘రా’ సెముష్యు మారుపలుకక యూరకుండెను. పిదప మేరీ వాని నుద్దేశించి, “నిరూపణ నెవ్వైన నియమించినచో బాగుగ నుండునేమో?......సరి, యెందుకైనను మంచిది. రోలో, నిటకు రమ్మని వర్తమాన మంపుము” అని పలికి, యొక విలాసము నాయనకు జెప్పి, గదవిడి చనుమనెను.

రాస్ సెలవు దీసికొని, కచేరీ చావడిలోనికి జని యొక తంతి వ్రాసి యంపెను.

*　　　　*　　　　*　　　　*　　　　*

‘మేయో’ గృహమున నున్న దాసదాసీజనములనెల్ల ప్రశ్నించి, యొక్కొక్కరు నుడివిన దంతయు వ్రాసికొనెను, లాంతరు పడియున్న గదిలోని కెవ్వరిని పోనీయరాదని ఆజ్ఞాపించి, యిరువురు పోలీసు జవానులను ద్వారము చెంత కావలి యుంచెను. మేరీ యేమి చెప్పగలదో కనుగొందమని, మేయో చావడిలో ప్రవేశించి, రాస్‌ను కలిసికొనెను.

“అయ్యా, మీ యజమానురాలితో నేను కొన్ని సంగతులు మాట్లాడవలసియున్నది. ఆమెకు నా మనవి దెలియ జేయుదురా?”

“అందు కభ్యంతరవేమి? కాని యామె పాప మిట్టి యవస్థలో నేమి చెప్పగలదు? తండ్రి మరణము జూచి, యధైర్యపడి, యామె శరీరమున నస్వస్థత జెంది యున్నది. శోక

మున వచ్చు బడలికచే నామె మంచముపై సొమ్మసిలియున్న ది. ఐనను, రండు—ఆమె దరికేగి మాటలాడుదము" అని పలికి, ఇన్స్పెక్టరును తోడ్కొని, రాస్, మేరీయున్న గదికి బోవుచుండెను. ఇంతలో నొక సేవకుడు వారి వెనుకగ వచ్చి, సలాము చేసి రాస్ కొక తంతి నందిచ్చి, చేవ్రాలు చేసికొని యేగెను. అందుకొని, కవరు విప్పి, చదువుకొని, రాస్ నిర్ఘాంతపడి నిలువబడెను. ఆవైఖరి గనిపెట్టి మేయో, "సంగతి యేమి?" అని యడిగెను. మారుపలుకక, రాస్ వానికా తంతి నొసగెను. తనలో జదువుకొని, యేమియు దెలిసికొనలేక మేయో, "మిత్రమా, దీని యర్థమేమి?" అని ప్రశ్నించెను.

"రోలోను రమ్మని కబురంపవలసినదని మేరీ నాకాజ్ఞాపించెను. వెంటనే వానికొక తంతి నే నంపితిని. ఇప్పుడిది వచ్చినది. అంతకన్న కము మీకెంత తెలియునో, నాకును, అంతే తెలియును."

"ఎంతసేపటికి క్రింద నీవు రోలోకు తంతి నిస్తివి?"

"సుమారు ఇరువది నిముసముల క్రిందట."

"వింతగనున్నదే—మేరీతో మాట్లాడుచున్నప్పుడు నీవు గాక వేరెవరైన గదిలో నుండిరా?"

"ఎవరును లేరనియే తలంచెదను." అని రాస్ పలికెను.

"నాకేమియు స్పష్టము కాకున్నది. ఈ తంతి నంపినవానికి రోలోను రప్పించుచున్న వార్త యెట్లు తెలియవచ్చెను?" అని మేయో దీర్ఘాలోచనతో నడిగెను.

"నేనును, ఆ విషయమును గూర్చియే యాలోచించుచున్నాను."

ఇటు వారిరువురును మాట్లాడుకొనుచు, మేరీ యున్న గది జేరిరి. లోనికి జన సెలవు నంది, వారిద్దరును గదిలో ప్రవేశించిరి. బడలికతో మేరీ సెజ్జనుండి యొత్తిగిలి, బలహీనతతో నుంటచే లేవలేనందుకు క్షమాపణ జెప్పి, వారితో నిట్లు సంభాషింపదొడగెను :—

“అయ్యా, మీచేతనున్న యాకాగితము నాకొఱకేనా?” అని యామె మేయో పట్టుకొనియున్న తంతిని గాంచి ఆతురమున నడిగెను.

“ఇది రాస్ పేరను వచ్చిన యొక తంతి. కాని—” అని మేయో యూరకుండెను.

“తంతి నామెకుజూపుడు. అందువలన నష్టమేమి ?” అని రాస్ పలికెను.

“ఆమెకు భీతి వొడమునేమో యని జంకుచున్నాను.” మేరీ చెయి జాచ, మేయో యామె కా కాగితమును నొసంగెను. అందుకొని యామె తనలో నిట్లు చదువుకొనెను :—

“రోలో కుశలము సంపకుము. వాడే వచ్చిన, నీచావు కూడ సిద్ధము”.

బాలిక యగుటచే తొలుత మేరీ యీ వాక్యముల జదివి దిగులందెనే గాని, మరల ధైర్యము దెచ్చుకొని, యినస్పెక్టరు నుద్దేశించి, “అయ్యా, దీని యర్థమేమి ?” అని యడిగెను.

“ఏమియును లేదనియే నా యభిప్రాయము. రోలో వచ్చినపిదప యాలోచించెదము”.

ఇంతలో నొక మోటారుబండి వచ్చి యానందమందిరము వాకిట నిలచిన ట్లాచోకీ యయ్యెను. అందుండి సుమారు

ముప్పది యేండ్ల పురుషుడొకడు దిగి, తొందరగా లోనికివచ్చె
ను. మేడమీదకు వచ్చి యాపురుషుడు మెట్లవద్ద నిలచియున్న
యొక సేవకుని పిలచి, యేమో ప్రశ్నించి, వాడు లాలీ పడి
యున్న గదివైపు చేయితో సంజ్ఞచేయ, నాతడు గదివద్ద కే
గెను. కావలియున్న పోలీసువారివలన గొన్ని సంగతులు తెలిసి
కొని, "మేరీయెక్కడ?" అని యడిగి, మేరీ గదిలో నాత
డున్నట్లు కనుగొని, వెంటనే యట కేగెను. గదిలోనున్న వా
రింతట సంతోషముతో నా నిరూపకు నెదుర్కొనిరి. మేరీ మి
క్కిలి కష్టముతో లేచి కూర్చొని, చిరునగవుతో వాని చేతికి
తా బట్టుకొనియున్న తంతె నొసంగెను. తనలో జదువుకొనుచు మె
ల్లగ నవ్వి, రోలో యూరకుండెను.

"మేరీ – సుస్తీగా నున్నట్లగుపడుచున్నావేమి?" అని
రోలో యభిమానదృష్టితో నామెను చూచుచు, ప్రశ్నించెను.

"ఏమో నాకును తెలియదు; కాని శరీరములో చాల
యాయాసముగా నున్నది" అనుచు నాసుందరి తనహస్తమును
చాపెను. ఆమె మంచమునకు ప్రక్కనే వేయబడియున్న
సోఫా కుర్చీపై గూర్చొనియున్న రోలో హస్తము నందుకొని
నాడి పరీక్షించెను. తోడనే వాని ముఖము వైవర్ణ్యతనందెను.

రోలో యొక గొప్ప సాహసుడేగాక, మంచి వైద్యుడు
ను, రసాయనశాస్త్రమున నసమాన పాండిత్యము గలవాడును!
పూర్వము తాను డాక్టరు పరీక్షకు చదువుకొనుచుండిన దినము
లలో నాయన, యప్పుడప్పుడు లాలీగారి మందిరమునకు వచ్చు
చు పోవుచు నుండెడివాడు. అప్పటి మేరీరోలోల యన్యోన్య
మైత్రి యనేదినే యభివృద్ధియై, పిదప వారి "స్నేహము"

"ప్రేమము"గా పరిణమించెను. లాలీ యొకప్పుడు తన ముద్దు కూతును రోలో కిచ్చి పెండ్లి యొనర్చిన బాగుగ నుండునని యనుకొనుచుండెడివాడు. విద్యార్థిగా నున్నప్పుడు రోలో లాలీ వద్ద పలయు ద్రవ్యసహాయము నందుచుండెడివాడు. రోలో తండ్రి లాలీగారి ప్రాణమిత్రుడు. ఆ కారణమున రోలోపై మేరీ జనకుని కభిమానము మెండుగానుండెను. ఇప్పుడు రోలో నిరూపకులలో నగ్రగణ్యుడై, డాక్టర్లలో నెల్ల నిపుణుడై, దినే దినే ధన మార్జించుచు, కీర్తి నందుచు, నందరిచే నెన్నకొనబడుచు, తన కింకొరి ద్రవ్యసహాయ మవసరము లేకున్నను, పూర్వము లాలీ తన కొనర్చిన మేలును మరువక, పెరుగుచుండు తన తొలి యనురాగమును వీడక, యెప్పటికంటెను చనవుతో నా బాలికయెడ వర్తించుచుండెను.

సుందరి చేయిగాని నాడి పరీక్షింప వానికేమితట్టెనో కాని, కొంతదనుక దీర్ఘాలోచనలోబడి శిరమువంచి యూరకుండెను. ఇంతలో పరిచారిక యొకతె గదిలో బ్రవేశించి, యతని నుద్దేశించి, "అమ్మా, ఔషధము పుచ్చుకొనుటకు వేళయైనది" అని పలికెను.

"ఔషధము నెవ రొసగిరి?" అని రోలో దాసి నడిగెను.

"ఎవరో, ఆ డాక్టరును నే నెరుగను. ఆసుపత్రికి కబురంప నాయన వచ్చి మందిచ్చెను. తండ్రి మృతకళేబరము జూచి నా యజమానురాలు స్మృతి తప్పి మూర్ఛిల్లెను. భయపడి నేనే యాసుపత్రికి టెలిఫోను నిచ్చితిని. బాగుగ దెలివి వచ్చిన పిమ్మట నీ యౌషధము నీయవలసినదని, డాక్టరు నా చేతికి రెండు పొట్లముల నిచ్చెను" అని పలికి యా పరిచారిక మందు

పొట్లములు దెచ్చి, రోలోకిచ్చెను.

అందుకొని రోలో, యందుండు గుండలను పరీక్షించి వాసన చూచెను. కొంచెము గుండను చేతి వ్రేలితో నద్ది, నాలుకపై నుంచి, చవిజూచెను. తోడనే మరల సున్నితముగ నైచి, ఆ పొట్లములను భద్రముగ గట్టి తన జేబులో నుంచుకొనెను.

"రోలో, ఒక పొట్లము నిప్పుడిమ్ము. సాయంకాలము రెండవది పుచ్చుకొందును" అని మేరీ యనెను. "వలదు—. ఆ మందు తీసికొనవలదు. ఇంతవర కేమైనా నందు సేవించితివా?" అని రోలో యడిగెను. "నాకు తెలివివచ్చిన దాదిగ నేమియు సేవించలేదు. మూర్ఛావస్థలో నేమి యొసగిరో నాకు తెలియదు."

తన కెదురుగ గూర్చొనియున్న రాస్ వైపు దిరిగి రోలో యంత, "ఆ డాక్టరెవరైయుండునో తెలియునా?" అని ప్రశ్నించెను.

"తెలియదు. డాక్టరు వచ్చునప్పటికి నే నింక నిచ్చటికి వచ్చియుండలేదు" అని సెక్రెటరి పల్కెను.

"సరియే. అయిన టెలిఫోనులో ఆసుపత్రి యధికారులను కనుగొనుము. ఇచ్చటికి వారెవనినంపిరో, వానినే మరల నొక్కసారి రమ్మను మని ప్రార్థింపుము" అని రోలో యన, రాస్ లేచి తన ఆఫీసులోనికి జని టెలిఫోను యంత్రమువద్ద నిలచెను.

అంత కొంచెము తలనొప్పిగా నున్నదని క్షమాపణ జెప్పుకొని, మేరీ మరల పరుపుపై నొరిగెను. అప్పుడామె పడుక నకు ప్రక్కనుగ దగుల్చబడియున్న గులాబీ పుష్పము పీడి కిం

రాలేదు. వెంటనే రోలో కొంచెము వంగి యాపుష్పమునందు కొని వాసనచూచెను. అంత వాని కేదో యనుమానము బొడకట్టుటచే గాబోలు, పుష్పమును మరల ముక్కుదరి నుంచుకొనెను. మేరియా యది కనిపెట్టి, "మిత్రమా, పుష్పము నేల పదేపదే శోధించి వాసన చూచుచున్నావు?" అని యనెను.

"తెల్పవలసినదేమియు. దీనిలో గొప్ప విశేష మున్నట్లున్నది" అని బదులుపలికి, రోలో గులాబీపై దృష్టి నిగిడ్చి, నిదానించుచుండెను.

అప్పుడు లాస్ బిఃబిర గదిలోనికి వచ్చి, తొందరగా నిట్లు పలికెను: "ఇంతయు నాశ్చర్యముగా నున్నదే! దాసీ 'మిల్లీ' ఆసుపత్రికి కబురంపుట మాత్రము వాస్తవము. ఆపిమ్మట కథ యింతయును కల్ల!"

"లాస్. నీయుద్దేశము నా కేమియు బోధ పడుట లేదు. అంతయు విస్తరించి చెప్పుము," అని రోలో యనెను.

"అయ్యా, అటులైన వినుము. ఆసుపత్రి యధికారులు నిపుణుడగు డాక్టరు నొకరి బంప నియమించియుండిరట. కాని వైద్యుని బంపుటలో నొక యరగంట యాలస్య మవసరమైయుండెను. ఆసుపత్రినుండి డాక్టరు బయలుదేర సిద్ధముగ నుండుతరి, 'లారీ హౌంటము'నుండి మరల టెలిఫోనులో నిట్లు వినవచ్చెనట! 'వైద్య సేవకుని బంపనక్కర లేదు. మాయింటి డాక్టరు వచ్చియున్నాడు.'"

"ఏమి, కెన్నెడునియా?" అని రోలో యడిగెను.

"కెన్నీ రాలేదు—ఆవచ్చినవానిని నే నెరుగనన్నాడట" అని లాస్ పల్కెను.

"సరియే, ఇందులో చాల మోసమున్నది. కానిమ్ము. మించిన దేమియులేదు" అని యని, రోలో యినస్పెక్టరుపైపు దిరిగి, "నీతోవచ్చిన జవాను నొకని నిటకు నిలుపుము," అని పల్కెను.

పోలీసువా డొకడు వచ్చి తన యెదుట నిలచియుండ, రోలో యొక కాగితముపై నేమో వ్రాసి వాని చేతి కిచ్చి, "ఈ యుత్తరమును గొని నా సెక్రెటరీకి నరుగుము. అట నా యుంగరము జూనియరు చేర్చి యుండును. వాడు నీ కొక సంచి నిచ్చును. పట్టుకొని త్వరలో రమ్ము. వాకిట నా మోటా రుండును. అందుపై నెక్కి చనుము—త్వరపడుము" అని చెప్పి వాని నంపెను.

* * * * *

నాటి యుదయము తెలతెలవేగు నత్తరి యొకానొక పురుషుడు రాత్రి యంతయు నెటనో కాలము గడపి, కొంచెము గ్రుడ్డిచీకటి యుండగనే నిజమందిరము జేరి తలుపు దట్టెను. లోనుండి సుమా రిరువది యైదేండ్లవయసు గల స్త్రీ యొకతె వచ్చి, కవాటము దెరచి, యా పురుషుని జూచునంత కడు నాతురముతో "ఏమైనది?" అని ప్రశ్నించెను. ఆపురుషు డంత మందహాసముతో నామెను చూచుచు, కార్యసిద్ధి యైనట్లు నర్థము వచ్చు రీతిని తల పంకించి, లో బ్రవేశించెను.

"రోజా, రమ్ము. గదిలో గూర్చొని సంగతి యంతయు విస్తరముగ జెప్పెదను." అనుచు వాడు లోనుండి తలుపు గడియవేసి, సుందరి చేయి బట్టుకొని గదిలోనికి దోడ్కొని యేగెను.

ఆలుమగ లిరువు రంత, సేవకు లెవ్వరును సమీపమున లే కుంట జూచుకొని, రహస్యప్రదేశమున నున్న యా గదిలో నొక పరుపుపై గూర్చుండి, మాటలాడుకొన జొచ్చిరి.

"నాథా, ఆ పుష్పమునే యామె ధరించునని నిర్ధారణ యేమి?" అని యా యువతి తన భర్తయగు యా పురుషుని భుజముపై జేయి నుంచి మోమునట్టి దీపము వెలుగున వానిని నిదానించుచు, నడిగెను.

స్త్రీ యగుటచే నిట్టి తెలివిమాలిన ప్రశ్న నడుగుచున్న దని యూహించెనో, లేక నిజముగ సూక్ష్మబుద్ధితో నన్న ప్రశ్నించుచున్నదని తనలో దా ముదమందియో, ఫ్రాంకు పకపక నవ్వి, సుందరిని పట్టి తనవైపు లాగి, కడు మోహముతో నామె చెక్కిలి ముద్దాడి, "రోజా, నీ కెయ్యనుమాన మెట్లు పుట్టినది?" అని పరిహాసించుచు, "ఆ పూవునే యామె ధరించు నటుల జేసితిని," అని సమాధానము చెప్పెను.

అట్టి జవాబుతో రోజా సంతుష్టి నొందక "నా కేమియు దెలియుటలేదు" అని పల్కెను.

"ఏమి? ఆ పుష్పము దప్ప తోటలో నింకేటి మేటి రో జాలు? పెద్ద మొగ్గల నెల్ల దుంచివైచితిని. నే నుంచిన గులా బీయే యుదయమునకు వికసించు పూవులలో నెల్ల పెద్దదిగా నుండును. సహజముగ నామె చిన్నచిన్న పూవుల దీయక, తా నంత పెద్దవిగ నున్న సుమముల నెంచును. కావున తప్పక నే నుంచిన పూవునే యామె ధరించునని నాకు నమ్మకమున్నది." అని ఫ్రాంకీ పల్కెను.

"పోనిమ్ము, నీ పనినట్లే యగు నని కోరికము. కాని,

మ్మట నాతడు మేరీ కేసో యథావిధము నొసగ. నామె
మును గా వెంటనే యిదుం గా, శయనించెను.
దువు?, లాలీమరణమునుగూర్చి రాస్, మేయో, రోలోలు ము
పను కొంతదనుక చర్చించుకొని, మృతకళేబరము పడియు
కాని గదిని చూడబోయిరి.

“మేయో, ఎక్కడివస్తువు లక్కడనే యుంచితి వనుకొం
అది ను?” అని రోలో యనెను.

అందుకు మేయో ‘ఔ’ నని తలనూప ‘మంచి’ దని రోలో తన చేతి ‘కెమేరా’ తో గదిలో రెండుమూడు ఛాయా పటముల దీసికొని, గది నాలుగు వైపుల శోధించి చూచుచుండెను.

సుమా రొక గంటదనుక నా గది చూచిన వెనుక, ముగ్గురును వెలుపలకు వచ్చిరి. రోలో యేదో యోచించుచున్నవానివలె నిలచెను. రాస్ నిరూపకుని వైపు నిదానించి చూచుచుండెను అంతట యిన్స్పెక్టరు పత్తేదారు నుద్దేశించి. “రోలో, నీ యుద్దేశ మేమి? లాలీ మరణ మెట్లు సమకూరె ననుదువు?” అని మెల్లగ ప్రశ్నించెను.

మొగమెత్తి మేయోవైపు జూచి, మెల్లగ నిట్లు “మిత్రుమా, ఇప్పుడే నే నేమి చెప్పగలను? నీకన్న నే నధికముగ వచ్చితిని. గృహములో నున్న సంగతులని నీవు ప్రశ్నించి, వారి సమాధానముల వ్రాసికొంటివి. నీకన్న నధికము నా కెట్లు తెలియగలదు? ఐనను అనిగింపుకొన్నను తెల్పెదను. లాలీ మరణము హత్యయట్లగుపడుచున్నది! అ ద్రోహించుటకు కారణము లెవ్వియని యిప్పుడే యూహింపగరాదు. తరువాత వా స్తరము

గలసి యాలోచించుకొందము.'' అని రోలో బదులు చెప్పి, యూరకుండెను.

"అమ్మా, ఈ కేసులో మిమ్ములనే ముఖ్యముగ నియమించవలయునని నా యజమానురాలి యుద్దేశము. ఆమె తరఫున నేనే మిమ్ము ప్రార్థించుచున్నాను. ఏమందురు?" అని రాస్ రోలోతో ననెను.

"రాస్, నీ పలుకుల కెంతయు ముదమందు చున్నాను. మేరీ కూడ నాతో ఈ కేసువిషయమై ముచ్చటించినది. నా యావచ్ఛక్తిని వినియోగించి, మేయో సహాయమువలన మేరీ యాజ్ఞ చెల్లించెదనని నమ్ముచున్నాను" అని రోలో సెక్రెటరీ నుద్దేశించి యనుచు, మేయోవైపు చూచి చిరునవ్వు నవ్వె

* * * * *

సాయంత్రము మేరీ తనగదిలో సోఫాకుర్చీపై నొత్తిగిలి కూర్చొని, యప్పుడే వచ్చిన "టపా" జూచుకొనుచుండెను. పత్రికలు, పుస్తకములు, కేటలాగులు, మొదలు గాగల వన్నిటి నొక ప్రక్కకు నుంచివేసి, తనపేర నున్న యుత్తరముల నన్నిటిని పట్టుకొని, ఒకదానివెనుక నింకొకటి విప్పి చదువుకొనుచుండెను.

నాటి యుదయము రోలో యొసగిన యావదపరిభావమున గాఢముగ విచారించి, నవీనశక్తితో యామె సెజ్జనుండి లేచెను. శరీరమున నున్న చీకాకు నశించుటయేగాక, యెప్పటివలె మేరీ సంపూర్ణ యారోగ్యమున నున్న బాలికవలె నగుపడుచుండెను. జనకుని మరణమువలన గలిగిన శోకాగ్ని హృదయము

వేషించుచుంటచే, నా కన్యాలలామ నెమ్మోమించుక వాడి యుండెను. మంచి యౌషధము నొసగి, తన కెంతేని ధైర్యము నిచ్చుచు, లాలీ మరణపుకేసులో తన యావచ్ఛక్తిని వినియోగించి పనిచేసెదనని వాగ్దానము జేసి, యేగిన నిరూపకుని తలచుకొను నప్పుడెల్ల మేరీ హృదయపూర్వకముగ లోలోన వాని కెన్నియో కృతజ్ఞతావందనము లాచరించుచుండెను.

తనపేర వచ్చిన లేఖలలో నొక పెద్ద 'కవ' రామె కంటబడ, నదానిందీసి, విప్పిచూచెను. పైపులో వ్రాయబడియున్న యా యుత్తరమును చదువ, నామె ముఖ కళలు మారజొచ్చెను. సహజముగ విశాలములగు నేత్రములు మరింత పెద్ద వికాజొచ్చెను. పెదవు లదరదొడగెను. శరీర మంతట నొక విధమగు కంప ముదయించెను. అనుమానము, క్రోధము, భయము—అన్నియు గూడి యామె యూహాలు గలవర పెట్టదొడగెను. ఆమె చేత బట్టుకొని యున్న యుత్తరములో నిట్లు వ్రాయబడియుండెను :—

"మేరీ,

నే నిట్లు వ్రాసినందుకు అన్యథా తలచవల దని ప్రార్థించుచున్నాను. ఉదయము నే జేసిన వాగ్దానముల మరచి పొమ్ము. నీకు ధైర్యము చెప్పుటకై నే నట్లు నుడివి యుంటిని. సుఖదుఃఖములలో నెల్ల నీకు నే దోడ్పడువాడనే; కాని, యీ సారిమాత్రము నా సహాయము నిష్ప్రయోజన మని యెంచుము. నిరూపకవృత్తిలో నున్నందుకు నీకు నే దోడ్పడవలసిన ధర్మము నే నెరుగుదును. కాని వేరు కేసులో మాట నిచ్చి యున్నాను; జయమును బడయుదు నను యాశయు నున్నది.

లాలీ మరణపుకేసు చాల యపాయకరమైనది. కలత్తోకలంచని చిత్రమైనకేసు. లాలీగారిని వధింపనెంచిన హంతకు డెవడో చాల ఘటికునివలె నున్నాడు. నా కిప్పుడే వానివద్దనుండి యొక జాబు వచ్చినది. సంగతులన్నియు విచారించిచూడ, నే నీకేసులో పని చేయరా దని తోచుచున్నది. లేచేని చాల ముప్పులు వచ్చును. మన యుభయులకును కీడు మూడును. నీ కిప్పుడు సహాయముచేయ సిద్ధపడినచో, నాచావు నిశ్చయము.

ఇట్లు,

నీ కృతపరిచయుడు,

రోలో."

# క్రోటీశుతనయ

## రెండవ ప్రకరణము

---

### మేరీహరణము

"భావనాకల్పిత భావిసౌఖ్యము వర్తమానసౌఖ్యముకంటె నత్యంత హృద్యమము కదా!"

—మనోహారి.

"ఇది నిజమగునా? ఈలేఖ నిక్కముగ రోలోను వ్రాసెనా? లేక—" అని పరిపరి విధముల దనలో నేమేమో యాలోచించుచు, మేరి నాటిరేయి సుమారు ఎనిమిది గంటల సమయమున తన మేజావద్ద నున్న సోఫాకుర్చీపై గూర్చొని యుండెను. గదిలో నున్న మెరుపుదీప మత్యంత ప్రకాశముగ వెలుగుచుండ, నాకాంతిని నల్లని దుస్తుల ధరించి, సోఫాపై నొకప్రక్కకు వ్రాలి యురచేయి శిరస్సున నానుకొన్న, యాలోచనాసమన్వితయై, కదలక మెదలక గూర్చునియున్న యామె [illegible] నిరుపమాన సొగసుందనము గల శిలాప్రతిమ వలె నగుపడుచుండెను. నిజజనకుని యాకస్మికమరణవార్తచే [illegible] దుఃఖాంబునిధి మునిగి, చేతనున్న యుత్తరమామె హృదయతాపమును ద్విగుణింపజేసెను. వెలిదమ్మి నెమ్మోముతో, తమ సహజకాంతుల బాసిన చెక్కిళ్లతో, కళావిహీనమై బాష్పపూరితములగు నేత్రములు, నాతో కన్యాలలామ హృద

యము తత్తరబడ, భావనలు చలింప, గుండియలు దడదడ గొట్టుకొన, నేమియు దోచనిదాని వలె యూరక కొంతతడ వట్లే కూర్చుని, యిదివర కప్పుడే పలుమార్లు పఠించిన యా కమ్మను మరల జదువదొడగెను.

“ఏమి? వేరుపను లున్నవా? అందుచే నా తండ్రి కేసులో పనిచేయ జాలడా? తా నందుకు బూనుకొనినచో దన చావు నిశ్చయమా?......ఔను, తప్పించుకొనుట కిట్టే గదా వ్రాయవలయు? ఐన, తొలుదొల్త నాతో నట్టి బింకము లేల పలుకవలెను? సప్తసముద్రముల దాటి యేగినను, హంతకు బట్టి శిక్షించెదనని యనెనే! “ఇప్పుడు కా కింకెప్పుడు నా సహాయము వలయు?”నని, తానే బల్కెనే!......లేక, రోలోగాక అన్యులెవ్వరైన నీజాబు వ్రాసితిరా? అట్లు వ్రాయుటకు పైవారి కగత్యమేమి?......” అని మేరి యనేకవిధముల తనలో దా నప్పించుకొనుచు, కలతజెందిన హృదయముతో నాందోళనలో గొట్టాడుచుండెను.

సంతకము రోలోదే నా యని యామె యనుమానింప నక్కరలేదు. వాని దస్తూరి మేరికి బాగుగ దెలియును. అయినను, సుందరి తన మేజాసొరగునుండి తన కదివరకు రోలో వ్రాసియుండిన పూర్వపుజాబుల గొన్నింటిని తీసి, సంతకములను శోధించెను. వానిలో నాబాలిక కెట్టి భేదమును గానరాకుండెను. తుదకు, రోలోయే తన కా లేఖను వ్రాసె ననుటకు సందియము లేదని నిశ్చయించుకొని, యా కమ్మ నటు బడవేసి, మేరి దీర్ఘమగు వేడినిట్టూర్పు విడచి, కొంచె మాలోచించి, యెందుకైన మంచిదని తలచి కాబోలు, టెలిఫోను యంత్ర

ము దరి కేగి, నిరూపకుని పిలచెను. తిరుగ వానినుండి గంట వినవచ్చెను. అంత నామె వానితో నిట్లు ప్రసంగించెను :

"రోలో:...ఆఁ... అవును...నేనే—మేరీని. ఈ యుత్తరమును నీవే వ్రాసితివా?...ఏమి?...ఆఁ...రోలో..." ఆ పిమ్మట మరి జబాబు లేకుండెను. మేరీ మరలమరల పిలచెను. ఎవ్వరును పలుకలేదు. పదేపదే గంటకొట్టి చూచెను. కాని మారుగంట రాలేదు.

*　　*　　*　　*　　*

రోలో తన లేబొరేటరీలో గూర్చుని, మేయోతో సంభాషించుచుండెను. టేబిలుపై ననేక ద్రావకములతో నింపిన సీసాలును, వివిధరంగుల మార్గ్గములును, కొన్ని పనిముట్లును, వింత యంత్రములును, ఒక చిన్న తోలుసంచియు, గులాబి పుష్ప మొకటియు, కాగితపుపొట్లములు రెండును—ఇంక నెన్నియో వస్తువులును, ఉండెను. నాటి సాయంత్రము రోలో పోలీసుఠాణాకు వర్తమానము నంప, మేయో వెంటనే పని ముగించుకొని, లేబొరేటరీకి వచ్చెను. పిమ్మట వా రిరువురును చాలసేపటి దనుక, లాలీగారి విచిత్రపుమరణకేసు గూర్చియే మాట్లాడుకొనిరి.

"మేయో, ఆపుష్పముజూచితివా? గులాబిపుష్పమని టామీ యొసగ, మేరీ యనుమానించక తన వక్షస్థలమున దానిని తగిలించుకొనెను. కావుననే యామె కా శిరోవేదన వచ్చెను!" అని రోలో తన సహచరునితో ననెను.

"మిత్రమా, నీభావము నా కేమియు తెలియకున్నది.

పువ్వు పుచ్చుకొనుటకు మేరీ యనుమానించవలెనేల? టామీ కదా యామె కాసుమము గోసి తెచ్చెను?” అని యినస్పెక్టరు మారు పలికెను.

“నిజమేకాని, యిందులో టామీకూడా గొంతవఱకు దోషిగా నున్నాడనియే నా యనుమానము. కాని నీవు వానిని ప్రశ్నించినప్పుడు, తా నేపాపము నెఱుగనని ప్రమాణము చేసి చెప్పినాడు. పువ్వు చెట్టునకే పూచియున్న ట్లుండెనట! స్వయముగ దానే కోసి తెచ్చినట్లును పలుకుచున్నాడు. నిజమేమై యుండవచ్చును. వాని కేమియు దెలియకపోయియుండవచ్చును కూడను. కాని యదిచూడ కాగితపు పువ్వము!” అనుచు నినుంపకు దాపూవును తీసి, యందుండి యొక రేకును త్రుంచి, మేయోకు చూపెను.

“అయిన నా పూవులోని యోషధియే యట్టి విషవాయువుల వెలిబుచ్చెనందువా?”

అందు కభ్యంతరమేమి? ఆగాలి బీల్చుచుండుట వలననే యామె కావ్యాధి వచ్చెను. మఱియు, పూవు గుండెలపై గ్రుచ్చబడియుంటచే, ముక్కుకు తిన్నగ నుండుటయే కాక, చాల సమీపముందు కూడ నుండెను. విషవాయువువలన వచ్చు వ్యాధి కాకుండినచో నే నొసగిన యౌషధము నిష్ప్రయోజనము కావలసినది. కాని విరుగుడు మందు పనిచేసినది.”

“టామీ చెప్పినదే వాస్తవమైనచో, పువ్వు చెట్టుననే కదా యుండవలయు? ఇట్టి సుమము చెట్టున బుట్టు నెట్లు?” అని మేయో యడిగెను.

“శత్రువు లెవరో చెట్టున కాపూవును తగిలించి యుండవ

చ్చును. అది తెలియక తోటమాలి పూవు లన్నిటితో బాటు దానిని గూడ గోసియుండవచ్చును. నే నందువిషయమై చింతించుటలేదు. కాని శత్రువు తోటలో నెట్లు ప్రవేశించెనో యని యాలోచించుచున్నాను. అడుగుల జాడ లగుపడునేమో యని వెదకి చూచితిని. పచ్చగడ్డి కురుచగ నంతటను మొలచియుంటచే, నట్టిజాడలు విశదముగ గానరాలేదు. 'మాగ్నిఫైయింగ్ గ్లాస్'తో జూడగలిగిన, జాడలు అన్యుల పాదముల జాడలవలె లేవు. కొలతలో నవి మన టామీ జోడు జాడల వలెనే యున్నవి. వాని బూట్సు శోధించి చూడ, కొలతలు సరిపడినవి."

"[illegible]మైన టామీయే యిట్టిపని జేసియుండునా? నే నది [illegible]వలేను. టామీ చేయజాలడనియే నే ననుకొందును. [illegible] శత్రు వెవడో టామీకి తెలిసియుండవచ్చును. టా[illegible] వశపఱచుకొని వాడు పూదోటకు వచ్చియుండును. అ[illegible]కు పిడస్సనము లున్నవి" అనుచు రోలో ఓ బిలు[illegible] పొట్లము[illegible] నొక దాని నందుకొని విప్పెను. "మేమో, యీగుండ చూచితివా? డాక్టరుగా వచ్చి మందు నొసగిన వాడు నిజముగా అనుభవజ్ఞ వైద్యుడుకాడు. వా డెవడో శత్రువే యై యుండవలెను. ఏలననిన, యీ గుండపరీక్షించి చూచితిని. ఇది రోగము కుదుర్చుటకు మందుకాదు. ఘనమైన విషము. లోనికి బుచ్చుకొనినచో మరణము కలుగును. ఆర్సెనిక్ ఆక్సైడ్."

[illegible] పలుకుచు యిన్స్పెక్టరున కత్యంతాశ్చర్యము గొలిపెను. ఇంక నేమేమి వినవలసి వచ్చునో యని మేమో

మిక్కిలి యాతురముతో వినుచుండెను. మందుపొట్లపు వింత చెప్పి, రోలో యూరకొని తన మిత్రునివైపు చూచెను.

"రోలో— పుష్పము, పొట్లములును, ఒక్కని మహిమ యనియే నీ యుద్దేశమా?" అని మేరీ ప్రశ్నించెను.

"నా కటులనే తోచుచున్నది. కాని రాస్ గూర్చి నీ వేమైన నాలోచించితివా?" అని రోలో కనుబొమలు పైకెత్తి మెల్లగ బల్కెను.

"తక్కిన వారిని ప్రశ్నించినటులే వానిని గూడ ప్రశ్నల నడిగితిని. వాని స్థితియు మెంటు సమముగనే యున్నది. కాని యొక్క యంశమున మాత్రము నా కేమియు బోధపడలేదు. నీకై వర్తమాన మంపవలెనని మేరీ వానికి జెప్పినపుడు గది లో నింకెవ్వరును లేకుండిరి. నిన్నే రప్పింపనున్నదని వెంటనే శత్రువు కెట్లు తెలిసెను? పోనీ, సెక్రెటరీయే కిటికీలో జేరి యున్నాడేమో యని యనుకొనుటకు గూడ వీలులేదు. ఏమనగ, నిజముగా రాస్ దోషితరుడునే యున్నచో, మేరీ యుద్దేశ పుప్రకారము వెంటనే నీకేల కబురంపును? నీకు తంతి పంపిన పిమ్మట నా రెండవ టెలిగ్రాము వచ్చినది. అదియు మరియు, రాస్ పేరనే యది వచ్చెను. బహుశః సెక్రెటరీ నీకు వర్తమాన మంపుట యెటులో దెలిసికొని, శత్రువు రాస్ నే [illegible] నా తంతి నంపెనేమో?—"

"సరియే, వానిగూర్చి వెనుకనుండి యాలోచింపవచ్చును. రాస్ దోషియని నే నెంచలేను" అని రోలో పలికెను.

"రాస్ చాల యోగ్యుడనియు, దయాపరుడనియు, కష్టములు సాగినవాడనియు గూడ నా యుద్దేశము" అని

మేయో యనుచు, జేబునుండి యొక చుట్ట దీసి, ముట్టించి, యగ్గిపుల్ల నార్పక యే పరధ్యానముతో దాని నట బడవేసెను. టేబిలుమీద నున్న మందుపొట్లముపై నాపుల్ల పడ, నిప్పియుండుటచే నాపొట్లము నిప్పంటుకొనెను. అదిచూచి, రోలో యార్ప జేయి చాచెనేకాని, మరల నేలకో యట్లుచేయక, మండుచున్న యా కాగితమువైపు దృష్టి నిగిడ్చి చూడసాగెను. అది తగులబడుట పూర్తియైన పిదప, రోలో, మేయోవైపు టిరిగి "చూచితివా?" అని యడిగెను.

"ఏమిటి? గుండ తగులబడదే?" అనుచు మేయో చుట్ట దీసి, చేతబట్టుకొని, కనుబొమలు పైకెత్తి, నిరూపకునివైపు జూచెను.

రోలో చిరునవ్వు నవ్వి, "అదికాదు నే ననినది—చూడుము" అనుచు, యటనున్న రెండవ పొట్లము దీసి, యందులోని గుండ నింకొక పొట్లము గట్టి, యా కాగితమును బాగుగ ముడిచి, తుడిచి, దానినొక చిన్న దీపము దరి వెచ్చజేసెను. కొంతసేపటికా కాగితముపై నీలిపచ్చని రంగులో స్ఫుటముగ ఈ క్రింది యక్షరము లగుపడెను.

"రోలో, యీ కేసు వదలుము—లేకున్న, చచ్చెదవు."

ఇన్స్పెక్టరు నిర్ఘాంతపడి చూచుచుండెను. దీపము కొడనుండి కాగితము దీసివేసి, రోలో తన నోటినూపిరి నందుపై బ్రసరింపజేయ, కాగితముపై నున్న యక్షరము లన్నియు శూన్యాక్షరము లయ్యెను.

"కోబాల్ట్ సాల్ట్ కదా?" అని మేయో యనెను.

"అవును. ఆపదార్థము కోబాల్ట్ క్లోరైడ్" అనుచు

మంచిది—నీటిలో గలిపి సిరావలె నుపయోగించుచుందురు. మన ద్రోహి యెవడో సామాన్యునివలె నగుపడడు" అని రోలాంబకులు పల్కెను.

పిమ్మట మిత్రు లిరువురును క్షణముదనుక నేమియు మాటాడక యూరకుండిరి. అంత నిరూపకుడు మరల నిట్లు చెప్పసాగెను: "ఈ పనులన్నియు గూడ నెవడో యొకడే చేయుచున్నాడు. లాలీని చంపినవాడు కూడ వాడే యని తోచుచున్నది. కాని యావృద్ధ నీకూ్రరు డెట్టి మాయోపాయమున మడియించెనో తెలియకున్నది. లాలీ హత్య జేయబడెననియే నా నమ్మకము. ఆత్మహత్య యని నే ననుకొనను. మృతకళేబరమును పరిశీలించి చూడ, నాకు లాలీ తన 'రివాల్వరు'తో దానేకొట్టుకొని మరణించిన ట్లగుపడదు. శరీరమున గాయము లెవ్వియు గానరావు. తన్నుదా గొట్టుకొనినను, ఇంకొకరిచే గొట్టబడినను, శరీరమున గుండుదెబ్బ కనబడక పోదు. పిస్తోలుతో నింకెవరినైన లాలీ గొట్టియుండవలెను. గదిలో నొక తోటా ఖజానా పెట్టెకు సమీపమున బడియున్నది. లాలీ కొట్టిన దెబ్బ తప్పియుండవలెను. లేకున్న నట్టి తోటా నేలపై బడియుండనేల? ఒక శరీరమునకు తగిలి, దూసికొని వచ్చినట్లగుపడదు...కాని, గది నల్దిక్కులను పరీక్షించి చూడ, లోని కెవ్వరును వచ్చియుండుట యసాధ్యముగా దోచుచున్నది. లోన గడియ యుండెను. అన్యులు లోనికి జన నలవిలేదు. ఉదయమునరికి కూడ గదితలుపు బిగించియే యుండెనట!"

"విషము తిని లాలీ మరణించెనేమో? ప్రాణకళేబరమున పోస్టు-మార్టమునకై బంప, శాస్త్రపరీక్ష యొనరి. విషప్రయోగ

ముననే చచ్చెను కాని, విషము భుజించ లే దనిరి. అది వీలగునా?" అని మేయో యడిగెను.

"కా కేమి? విషప్రయోగము, అనేక విధముల జేయవచ్చును—నోటిలోనుండి మింగవచ్చును.—ముక్కుతో బీల్చవచ్చును—శరీరము పొడిచి రక్తములోనికి యెక్కించవచ్చును. కాని లాలీ మరణము విషప్రయోగము వలననే జరిగినను, ఆత్మహత్య యని చెప్పుట కవకాశములేదు. లేకున్న నా మాయపూవున కర్థములేదు; మాయవైద్యుని రాకకు నిమిత్తములేదు. ఈమందుపొట్లపు కాగితములపై నిట్లు వ్రాసియుండుటయు బోధపడదు...అదికాక, గదలో నింక మరికొన్ని నిదర్శనములగుపడుచున్నవి. ఇనుప పెట్టె కొంతభాగము కరగియున్నది. అది పిస్తోలువలనగాని, విషమువలన గాని జరిగియుండదు. ఒకవేళ—" అని యింక నేమో యనబోవుచున్న సమయమున, టేబిలుపై నొక ప్రక్క కమర్పబడియున్న టెలిఫోనుయంత్రము టంగుటంగున మోగ నారంభించెను. వెంటనే రోలో లేచి, యంత్రము దరి కేగి, మారుగంట నిచ్చి, చెవియొగ్గి వినెను. తన్ను బిలచినది మేరీ యని తెలియగనే, రోలో యా బాలిక యేమి చెప్పునో యని యాతురతతో వినుచుండెను.

మేయో కుర్చీనుండి లేచి, యేమియు జేయ పని లేకుంటచే, టేబిలుపైనున్న వస్తువు లన్నిటిని చూచుచుండెను. అటనున్న పువ్వును, గుండలును, విషవస్తువు లని పోల్చికొనుటకు నిరూపకు డెట్టి పరీక్షల జేసియుండునో యని యాలోచించుచు, మేయో టేబిలుపై నున్న యొక విచిత్ర యంత్రమును శోధించుచుండెను. ఇంత, ప్రమాదవశమున మేయో చేయి

తగిలి, యొక పకీతునాళిక టేబిలుపై దిరుగబడెను. ఆ గొట్టము వెచ్చజేయబడిన 'ఆక్వారిజియా' తో నింపబడి, భద్రముగ నొకచో నుంచబడెను. తిరుగద్రోయబడి, గాజుబుడ్డి బద్దలగు టచే, నం దుండు ద్రావకము టేబిలుపై బడి, యచ్చటనే యున్న టెలిఫోను తీగెలపై దృళ్ల, నవి కరిగి వెంటనే తెగిపోయెను.

"హలో...ఆం.....అవును, నేనే—మేరీని......నీవే యా యు —..." అను మాటలు రోలోకు వినవచ్చిన పిమ్మట తీగెలు తెగుటచే, మరి యామె యేమి పల్కినదియు వినరాకుండెను. రోలో వెనుదిరిగి చూచునంతో, మేయో చేసి న ప్రమాదము కన్నులకు ప్రత్యక్షము కాగా, వెంటనే యాతడు 'సిసీవరు' నటు బెట్టి, చిరునవ్వుతో మేయో నుద్దేశించి, "చేతులపై బోసికొంటివా యేమి?" అనుచు, వాని హస్తములు బరీక్షించెను. ఇన్‌స్పెక్టరు కేమియు హాని కలుగకుంటచే సంతసించి, "పాప మా యబల యేమి చెప్పనెంచెనో కదా? ఏదియు విపత్తు వాటిల్లి యుండదుకదా?" అని మెల్లగ రోలో తనలో ననుకొనుచు, మేయో నుద్దేశించి, "నే నిప్పు డామెను చూడబోవలెను. రేపు మరల గలసికొందము" అని పలికెను.

ఠాణాకు బోవ మేయోకు గూడ వేళ యైనది. అందుచే నిరువురును లేచి, బయులుదేర నాయత్తపడిరి. నిరూపకు డంత తొందరగా టేబిలుపై బడ్డ ద్రావకము నొక గుడ్డతో దుడిచి, టెలిఫోను తీగెల నతుకకయే, వడివడి యొక నల్లని సర్జి కోటు దొడుగుకొని, "రమ్ము" అనుచు మేయోకు సాజ్ఞ చేసెను. పుస్తకము, పాట్లములను పదిలముగ నొక సంచిలో నుంచి,

చేత బట్టుకొని, తలుపులను మూసి, తాళము బిగించి, రోలో వాకిట నున్న నౌఖరు నుద్దేశించి "పెర్సీ, ఇటురమ్ము" అని కొంచెము బిగ్గరగ ననెను. తోడనే పెర్సీ, యజమానుని వద్దకు వచ్చి నిలచెను.

"ఓయీ, ఈ తాళముచెవి దీసికొని యుంచుము. ఇప్పటికే రాత్రి యైనది. ఒక గంట దనుక నాకొఱ కిచ్చటనే వేచి యుండుము. ఈలోపున నేను రాకున్నచో, నీవు తాళము బట్టుకొని నీయింటికి బొమ్ము. ఉదయమున వేగము రావలెను" అని రోలో సేవకునితో జెప్పెను.

పిమ్మట రోలో, మోటారు సైకిలుపై నెక్కి, దీపము వెలిగించి, ఇన్‌స్పెక్టరును తనప్రక్క యాసనముపై గూర్చుండుమని, యతి త్వరగా వాహనమును పోనిచ్చుచు 'లాలీమందిర' ముఖుడై యరిగెను.

*  *  *

గంట మ్రోగించి, యెన్నిసార్లు పిలచినను, రోలో తన ప్రశ్నకు బదులు పలుక కుంటచే, 'రిసీవరు'ను వదలి, మేకి తన సోఫాకుర్చీ జేరి, "నిజముగ నీ లేఖను తానే లిఖించకునఁ చో, రోలో నాతో ధైర్యముగ 'లే' దని యేల చెప్పకుండును? తా వ్రాసిన జాబుకు దానే సిగ్గుపడి, నాప్రశ్నకు జబాబు కూడ నీయలేకున్నాడు" అని మనమున ననుకొనుచు, నిరూపకుని చేతకు మిగుల వగచి, కలలో గూడ నాత డిట్లు చేయునని యూహించని యీ ముగ్ధ కిప్పుడు వానిపై బట్టరాని కోపము రా, నేమియు దోచక గూర్చుండియుండెను.

స్త్రీ యగుటచే నబలత్వమున వచ్చు దుఃఖము నాపుకొన జాలక, మేరీ తన ముఖచంద్రుని కరకమలముల నిడుకొని, పొంగి పొరలి వచ్చుచున్న శోకప్రవాహమున నీదులాడుచు, నయనముల బాష్పవర్షము గురియుచున్న ట్లేడువ దొడగెను. తన కా బాలికయం దుండు పూర్వపు యనురాగము నింతలో మరువ గలిగిన రోలో నిప్పు డామె యే మనవలయును? తాను విద్యార్థిగ నున్న దినములలో లాలీ తన కొనర్చిన మేలున కిదియా యాతడు చూపవలసిన కృతజ్ఞత? మేరీ వెక్కివెక్కి, హృదయము వ్రక్క లగునా యనునట్లు కొంతతడ వేడ్చియేడ్చి, తత్కారణమున వచ్చు బడలికను చమ్మటలు గ్రమ్మ, సొమ్మసిలి కన్నులు మూయ, నామెకు వెంటనే చైతన్యము దప్పి, నిద్ర వచ్చెను.

కొంతసేపైన పిదప, పరిచారిక యొకతె వచ్చి తలుపు దోసి, యజమానురాలు నిద్రించుచుంటం గని, మరల తలుపును మూయుచుండెను. ఇంతలో నొక పురుషుడు వచ్చి మేడ మెట్లపై నుండియే దాసిని చూచి, "జూలియా, మేరీ యెక్కడ?" అని ప్రశ్నించెను.

"గదిలో శయనించియున్నది. భోజనమునకు లెమ్మనుట కిప్పుడే యామె వద్ద కేగితిని. కాని, నిద్రించుచుంటచే లేపలేదు" అని జూలియా పల్కెను.

"నన్నేలకో టెలిఫోనులో పిలచియుండెను. అగత్యమగు పని యుండెనేమో? నే వచ్చితి నని, యామెకు దెల్పుదువా?" అని రోలో యనెను.

అంత నా స్త్రీ గది జొచ్చి, నిద్రించుచున్న సుందరిని

మెల్లగ మేల్కొలిపి రోలో పంపిన వర్తమానము దెలియజేసెను. వచ్చియురాని మెలకువను, తన దాసి యేమనుచున్నదియు వినకపూర్వమే, "రమ్మనుము" అని మేరీ నుడివెను.

తోడనే రోలోను తోడ్కొని జూలియా గదిలోనికి వచ్చి, సోఫాకు సమీపమున నొక కుర్చీ వేసి, గదినుండి వెలుపలకు వచ్చెను. మేరీ లేచి కూర్చొని, నిరూపకునివైపు మొగమెత్తి చూచెను.

"మేరీ, యేడ్చుచుంటివా? ధైర్యము వహించవలెనుకాని తక్కిన యాడువారి వలె నీవును జేలవగుట తగునా? తండ్రి మరణము కన్న దుఃఖకరమగు కష్టము వేఱ లేదని నే నెరుగుదును. కాని—" అని యేమో యోదార్పు మాటలాడుచు, రోలో కుర్చీపై గూర్చునెను.

మేరీ యేమియు బదులు పలుకలేదు. ఇరువురును కొంతదనుక నట్లే యేమియు మాటాడక యూరకుండిరి. ఒకరి మొగమింకొకరు చూచుచుండుట దప్ప, వేరేమియు జేయకుండిరి. కడకు మేరీ, నిరూపకునుండి ముఖము ద్రిప్పి, "నా తండ్రి కేసులో పని చేయలేనని యనినవాడవు మరల నిచటికి రాత్రి వేళ రా బనియేమి?" అని మెల్లగ ననెను. అప్పు డామె స్వరమున దీనశోకకోపతాపములు పెనగుకొనుచుండెను. సుందరి పలుకుల కేమియు నర్థము జేసికొనలేక, రోలో నిర్ఘాంతపడి ౘూచుచుండెను.

రోలో బదులు పలుకకుండనే, మేరీ యొత్తిగిలి, తన మేజాపై నున్న యుత్తరమును తీసి, రోలోపై బడవేసెను. దవ్వాని తనపై నంత నిర్లక్ష్యభావముతో విసరిన యా కమ్మ నం

దుకొని, రోలో యుత్తరమును తనలో జదువుకొనెను. లేఖ పఠించుచున్నంత సేపును కూడ, మేరీ వానిపై దృష్టి నిగిడ్చి నిదానించుచుండెను. జాబు చదివిన పిమ్మట, నిరూపకుడు తన లో మెల్లగ నవ్వుకొని, మేరీవైపు జూచి, "ఈ యుత్తర మెప్పుడు వచ్చినది?" అని ప్రశ్నించెను.

"నీకే తెలియవలెను" అని కొంచెము తీక్ష్ణముగ మేరీ బదులుచెప్పెను.

"మేరీ, నీ విట్టి చేల వని నే ననుకొనలేదు. నీ కెందు కీ యనుమానము? నే నీ లేఖను వ్రాయలేదు. నేనే వ్రాసితినని నమ్మి, నాపై గినుక వహించితివా? లేనిపోని మోసములకు బాల్పడకుము. ఈజాబు నమ్మి, కలవర పడితివా? ఒకనాడును నే నిట్టి లేఖను లిఖియింతు ననియే యెంచెదవా? కష్టసమయ మున నీకు నే దోడ్పడనా? నీ యాజ్ఞ ననుసరించి నడచుట నాకు విధాయకము కాదా? మీ సహాయము నందకున్నచో నే నెన్నటికైన ప్రయోజకుడ యుందునా? నీ జనకుడు నా కొనర్చిన మేలునకు నే నేమి ప్రతిఫలము నీయగలను? ఇన్నినా ళ్ళనుండియు మన మైకమత్యముతో మెసలుచున్నము, నా నైజ ము నెరుగలేక పోతివా? న న్నొక విశ్వాసఘాతకునిగా నెంచి తివా?......పోనిమ్ము, ఇకనైన నా మాటల బాటింపుము," అనుచు రోలో యా బాలిక కొక యుపన్యాసము జెప్ప నారం భించెను.

"నీ వీ జాబును వ్రాయనే లే దందువా? ఐన నెవరు వ్రాసి రనెదవు? సంతకము కూడ నీది కా దందువా?"

"ఎవరు వ్రాసిరో ముందు కనుగొనగలను. చేవ్రాలు

నా సంతకము వలెనే యగుపడును, కాని నాదికాదు. వ్రాసిన వా డెవడో నేర్పరియే, కాని వాని నెట్లులైన బట్టి శిక్షించెద నని నమ్మకము. నామాట విశ్వసింపుము” అని నిరూపకుడు సమాధానము చెప్పెను.

“అట్లులైనచో టెలిఫోనులో ని న్నడిగినప్పు డేల నాతో స్పష్టముగ నట్లు చెప్పకుంటివి?” అని మేరీ మొగమెత్తి వానిని నిదానించుచు బ్రశ్నించెను.

రోలో యంతట సంగతి గ్రహించి, సుందరి కెందుకు త న్నపై గోపము వచ్చెనో దెలిసికొని, లేబొరేటరీలో జరిగిన దం తయు సమగ్రముగ విన్నవించెను.

“మేరీ, నీప్రశ్నకు జబా బీయకుండు నంతటి మూర్ఖుడ నని యెంచితివా! జరిగిన దంతయు నిప్పుడు తెలిసినదా? మేమో యా దావకమును తిరుగబోయుట యింత జేసినది” అనుచు నాతడు జరిగిన ప్రమాదమున కెంతయు వగచుచు, బ ల్కెను. పిమ్మట నాతడు, తా గనిపెట్టినవింత లన్నియు నామె తో జెప్పుచు, పుర్రెను, పొట్లములను, విప్పి చూపించుచుండెను.

ఇంతలో గదిలో నున్న టెలిఫోను యంత్రము టంగు టంగున మోగుచు వినవచ్చెను. మేరీ లేచి, యంత్రమును స మీపించి, మారుగంట నిచ్చి, మాట్లాడ దొడగెను.

“నేను—మేరీనే...ఆఁ...ఎవరు?”

“మేరీ, నేను—రోలోని” అని యామెకు వినవచ్చెను. మేరీ యాశ్చర్యపడి, గదిలో నున్న నిరూపకునివైపు దృష్టి ని గిడ్చి చూచుచు, భయాశ్చర్యములతో గడగడ వణకుచుండిన శరీరమును స్వాధీనపరచుకొన నెత్నించుచుండెను.

* * * * *

రోలో మేయో లిరువురును కలిసి మోటారు సైకిలుపై నెక్కి యేగిన పిదప, ద్వారపాలకు డగు పెర్కీ, కునికిపాట్లతో లేబొరేటరీవద్ద గూర్చుని, యజమాను డెప్పుడువచ్చునా యని వేచియుండెను. వయసున నేబది యిరువది యేండ్లకు మించిన వాడు, యజమాను ననుసరించి, విశ్వాసముతో సేవ జేయుచుండిన యొక వృద్ధుడు సదా మహావాత నొప్పులచే బాధపడుచుండుటచే, బ్రతి దినమును వాడు రాత్రిపూట నొక పావు తులమునకు దక్కువకాని నల్లమందును తినుచుండును. ఆ కారణమున వానికి గునికిపాట్లధికము.

అట్లా వృద్ధుడు కునుకుచు గూర్చొనియుండ, నొక నల్లని కోటును ధరించి, మోటారు సైకిలుపై నెక్కి యొక పురుషుడు వచ్చి, పెర్కీని సమీపించి "తాళముచెవి నిమ్ము" అనుచు జేయి జాచెను. పెర్కీ కన్ను లెత్తి యా వచ్చిన వానిని చూచి, రోలో యని సంతసించి, యజమాను డంత త్వరలో మరలి వచ్చినందుల కాశ్చర్యపడి, తాళముచెవి నొసగెను. అందుకొని యాపురుషుడు తలుపుల దెఱచి, లోని కేగి, హాలులో నున్న సామగ్రిని శోధించి, టేబిలువద్ద కేగి, దాని సొరగుల బైకిలాగెను. అందులో వాని కొక యైదు బారుల 'రివాల్వరు' తుపాకి కానవచ్చెను. అందుపై 'రోలో' అను పేరు స్ఫుటముగ జెక్కబడి యుండెను. దాని నందుకొని యా పురుషుడు బాగుగ పరిశీలించి, యం దైదు తోటాలు దట్టింపబడి యుండుట జూచి, పదిలముగ వాటి నన్నిటిని వెలుపలి కూడదీసి, తన జేబులో నుంచుకొనెను. పిమ్మట వా డా రివాల్వరును యథా

స్థానమున నుంచివేసి, సొరుగు మూసెను. కాని యంతలో వాని కేదో యాలోచన దట్టుటచే గాబోలు, కొంచెము సేపేమో యాలోచించి, మరల టేబిలుసొరుగు దీసి, చేదుపాకి నందుకొని, నిదానించి దానిని చూచి, తల పంకించి. తనలో మెల్లగ నవ్వుకొనెను. ఆయుధమును మరల తోటాలతో దట్టించి, యప్పటికీతిని మరల సొరుగులో బెట్టెను.

పిమ్మట వాడు టేబిలు వద్దనే నిల్చుని, యన్నివైపుల జూచుచుండెను. అంత వాని దృష్టి టెలిఫోను యంత్రముపై బారెను. "ఏమిది? తీగెలు తెగియున్నవే?" అని తనలో మెల్లగ ననుకొని, జేబునుండి వాచీ దీసి చూచుకొని, మరల కొంత శ్రమతో క్రొత్త తీగెల నమర్చి, రిసీవరు నందుకొని, చెవియొద్ద నుంచుకొని యాలోచింపదొడగెను.

"వా రిరువురును పోలీసు ఠాణావైపు కదా పోవుచుండిరి? రోలో తిరిగి వచ్చుట కింక కొంత వ్యవధి యున్నది. ఈ లోపున నాపని ముగియుట కవకాశ మున్నది" అని యేమో గొణిగికొనుచు, తనకు దెలిసిన యొక నంబరు బిలచి గంట వాయించెను. మారుగంట వినవచ్చినపిదప, వాడు మాట్లాడ దొడగెను. మేరీయే వచ్చి తనతో మాట్లాడుచున్నదని తెలిసికొని, వాడంత తన సహజస్వరమును మార్చి, రోలో గొంతుకతో సంభాషింప దొడగెను.

"......ఆఁ...ఎవరు?" అని వినవచ్చిన ప్రశ్నకు వాడంత, "మేరీ, నేను—రోలోని" అని బదులు పల్కి, మాట్లాడసాగెను.

* * * * *

మేరీ, గదిలో నున్న నిరూపకునివైపు దీర్ఘముగ జూచుచుండ, నాతడు కారణము నెఱుగక, "మేరీ, ఏమది? ఆ మాట్లాడుచున్న దెవరు? ఏల భయపడిన ట్లగుపడుచున్నావు? అటులేల నావైపు జూచెదవు?" అని యడిగెను.

"అయ్యా, నా కేమియు దోచకున్నది. నీవు నిజముగ రోలోవే నైన యడల, నీ టెలిఫూనులో 'నేను, రోలోని' అని యనుచున్న వీ డెవ్వడో తెలియకున్నది. వీని స్వరము కూడ నీ గొంతుకనే పోలియున్నది—" అని యింకను మేరీ యేమో చెప్పుచున్న సమయమున రోలో కుర్చీనుండి లేచి యూరకొమ్మని మేరీకి సౌజ్ఞ జేసి, తన కోటు జేబులోనుండి యొక చిన్న కార్డు దీసి యామెకు గనపరచి, టెలిఫూను దరికేగి, మేరీ నిటు రమ్మని చెప్పి, తానే యంత్రము నందుకొనెను ఊహాలు పరిపరి విధముల బారుచుండ, నా బాలిక నిశ్చేష్టయై కొయ్యబారి, యంత్రమును వదలి, యొకింత యెడముగ నిల్చెను. రోలో తన కంఠస్వరమును మార్చి, మేరీ గొంతుకతో నిట్లు మాట్లాడెను :

"ఏమి?...ఆఁ...అవును....ఆఁ, నౌకరులా, ఎవరును లేరు, టామీ మాత్ర మింక నున్నాడు...అలాగే, యత్నించి చూచెదను...భద్రముగ నుంచెదను."

టెలిఫూను వదలి నిరూపకుడు మేరీని సమీపించి, "వాడేమనుచున్నాడో తెలియునా? 'నీ జనకుని గదిలోని కొన్ని కాగితములను భద్రపరచితివా?' అని యడుగుచున్నాడు. ఎవరైన సేవకు లున్నచో, వానిచేతి కవి యొక కట్టగట్టి యిచ్చి, శీఘ్రమే లేబొరేటరికి కంపుమనుచున్నాడు. ఈరాత్రి యాగి

తమును నీవొద్ద నున్నయెడల, చాల హాని కలుగవచ్చునని యను చున్నాడు” అని తెలుపుచు, చిరునవ్వు నవ్వె. “మేరీ, యీ క్షణమున నేనిక్కడ లేకుండినచో, యేమి యుపద్రవము వాటి ల్లియుండునో గ్రహించితివా?...మంచిది, వీనిపని బట్టించెదను. మేయోతో గలసి నేను వెలుపలికేతెంచగనే, వాడా ‘లే బూరేటరీ’ ప్రవేశించెను. పెర్సీ యొక్క రూనికిపాట్లపెద్దమ్మ. అం దుచే, వానిని చూచి, నేనే యనుకొని వాడు తాళముచెవినొ సగియుండును. ఆ దుర్మార్గు డెవడో నా కింకను దెలియకున్నది. కాని వాడు చాల యుక్తిపరుడని యనుకొనక తీరదు. తీగెలు తెగియుండియు, టెలిఫోను నుపయోగించక వదలలేదు. వాని తెలివితేటలు మెచ్చదగినవే కాని, యీసారి మాత్రము వాని తాత్రముతో వాడే యురి బోసికొనుచున్నాడు. ఇప్పుడు వా డెట్లు తప్పించుకొని పోవునో చూచెదను” అని పలుకుచు రోలో, మేరీతో నాలోచించి యామె జూపిన యొక గదిలో నికి జనెను.

కొన్ని నిముసములలో నాతడు తన దుస్తుల మార్చు కొని వచ్చి మేరీయెదుట నిల్చెను. తోటమాలి యగు టామీ వలె గూఢ వేషధారుడై వచ్చిన యాతని జూచి మేరీ నిర్ఘాం తపడెను.

“నీకు టామీ వేషము బాగుగ నమరినది. పోల్చుకొనుట కసాధ్యముగ నున్నది!” అని యామె నిరూపకుని వైపు తేరి పార జూచుచు బల్కెను.

“క్షణము క్రిందట నేను రోలోకానని నీ వనుమానించితి వి కదా!......నీ పోలిక యెట్లుదైనను, నా వేషము బా

గున్నదని మెచ్చుకొనినందుకు, నా కెంతయు సంతోషముగ నున్నది” అని రోలో మందహాసముతో ననెను.

మేరీ మారుపలుకక, కన్ను లెత్తి రోలోను చూచుచు, చిరునవ్వు నవ్వి యూరకుండెను.

“నే బోయివచ్చెద—సెల విమ్ము. టెలిఫూనులో ని న్నెవరు పిలచినను మోసపోకుము. జాగ్రత్త! ఆ దుర్మార్గుడు చాల కానివాడు. ఎట్టి పాపమునకైన వెను దీయన ట్లున్నాడు! వీడే నీ తండ్రిని చంపిన హంతకుడని నా కేలకో తోడకట్టు చున్నది” అని యామెతో ననుచు, రోలో బిరబిర మేడ దిగి, మేరీ మోటారు దెప్పించి, యందుపై నెక్కి, తా నెక్కివచ్చిన సైకిలును వదలి, శీఘ్రమే యానందమందిరము వీడి పోయెను.

* * * * *

రోలో వేస మూని, యా యువకుని స్వరముతో టెలి ఫూనులో మేరీతో సంభాషించుచున్నాడని, యనుకొనుచు, ‘బ్లాకీ’ వినవచ్చిన ప్రత్యుత్తరమున కమితానంద మందుచు, నిక నొక యిరువది నిముసములలో టామీ వచ్చి తా గోరిన కాగితముల నొసగునని యువ్విళ్లూరుచు, తనతో మాట్లాడినది నిరూపకుడని లేశమైన ననుమానించక, టెలిఫూన్‌ను వదలి, తోటమాలి యెప్పుడు వచ్చునా యని వేచియుండెను.

కొంతసేపటి కొక పెద్ద మోటారుబండి వచ్చి, లేబొరే టరీ వద్ద నిలచెను. అందుండి టామీ వేసమున నున్న రోలో దిగి, వాకిట నున్న పెక్కీని పలుకరించెను.

“పెక్కీ, నిమ్మళముగానున్నావా?...(సేవకునికిపాట్లు నీతో

కాని పోవు!)...నీ యజమాను డెక్కడ? మేరీ అమ్మ వానికి తొందరగా నొక కబురు చెప్ప నన్ను బంపినది."

"ఆఁ, ఏమనుచున్నావు? నీ వెవ్వరు? ఏదీ, ఇటు రమ్ము" అనుచు నా వృద్ధుడు వానిని దీపపు వెలుగున చూచి, తన యజమానుడే యట్లు తోటమాలీ వేషమున నున్నాడని పోల్చలేక, "ఓహో, టామీ, నీవా? వెళ్లుము—వెళ్ళుము; లోనికి వెళ్ళుము; నా యజమానుడు లోపలనే యున్నాడు." అని లోని కేగుటకు వాని కనుజ్ఞ నిచ్చి, మరల తన యథాపీఠమున గూర్చుని, కునుక నారంభించెను.

రోలో యూరు మాటాడక, యా వృద్ధుని యమాయికత్వమున కెంతయు మనమున చింతించి, తనలో దా మెల్లగ నవ్వుకొని, బహు జాగరూకతతో, లోబ్రవేశించెను. హాలులో నెట్టి మానవుని సవ్వడియు లే కుండెను. రోలో తన విశాల నేత్రములతో న ల్దిక్కులను శోధించి చూచెను. ఎవ్వరును కానరాకుండిరి. తనలో కొంచె మాలోచించుకొని, యా నిరూపకుడంత తన టేబిలువద్ద కేగి, సొరుగులోనుండి తన రైదు బారుల పిస్తోలును బయటకు దీసెను. ఆయుధమును పరిశోధించి, యందు తోటా లన్నియు నిమిడి యుంట గని సంతసించి, శత్రువు కంట నది పడలేదని లోలోన నుప్పొంగుచు, జేబులో నాయుధమును పదిలముగ జేర్చి, టేబిలువద్ద నిలచి, యందుపై నున్న గంటను గణగణ వాయించెను. గంట మ్రోగిన యుత్తరక్షణముననే, లోనుండి రోలోవలె ముస్తాబయిన బ్లాకీ హాలులోనికి వచ్చి, టామీవలె నగుపడుచున్న నిరూపకుని సమీపించుచుండెను. తోటమాలీవలె నున్న పురుషుని చూచి బ్లాకీ బహిరంగ సందపర

వచ్చుటై, నవ్వుచు కుశల ప్రశ్నల నడిగి, 'కాగితము లన్నియు తెచ్చితివా?' అని ప్రశ్నించెను.

రోలో యుంకను మారు పలుకక, బ్లాకీ వైపు సిడా నించి, చూచుచుండెను. అంత బ్లాకీ తన మనమున కొంచె మనుమానించి నిరూపకుని సమీపించి, వాని ముఖముపై ప్ర తీక్ష్ణముగ నొక క్షణము చూచి, వెంటనే జేబులోనుండి యొక రుమాలు దీసి తన ముక్కుమీదుగా మొగముపై గప్పుకొని, వెనుకకు ముడివేసెను. రోలో యది చూచి తనలో నవ్వుకొని, తన వద్దనున్న చేదుపాకిని పైకి దీసి, యెక్కుబెట్టి బ్లాకీ నుదుట నుంచెను.

"నీకు ప్రాణములపై నాశయున్నచో, చేతుల దించుము" అనుచు రోలో వానిపై గర్జించుచు బల్కెను. అత్తరుణమున రోలో ముఖచిహ్నము లెట్టివై యుండునని వ్రాయుట యసాధ్యము. కన్నుల నిప్పులు రాలుచుండెను. పెదవు లదరుచుండెను. నుదుట చిరి చమ్మట బట్టుచుండెను. ముఖమున నానందము—అసూయ—అనుమానము—వేగిరపాటు—అన్నియు గలసి తాండవ మాడుచుంటచే, వాని ముఖబింబము క్షణక్షణమున నొక నూతనాకృతి దాల్చుచుండెను.

తుద కింతటి యుక్తిపరుడగు బ్లాకీయును శత్రువు చేతిలో నింత సులభముగ జిక్కబడెనా? మరియేమున్నది! చేతుల జోడించి నిరూపకుని కాళ్ళపై బడకున్న, నిక నొక నిముసములో బ్లాకీ యేమి కానున్నాడు?

"నీ బుద్ధి కసాధ్యము లే"దని నుడివిన రోజా పలుకు [illegible] బ్లాకీకి జ్ఞప్తికి వచ్చెను. వ్యాఘ్రిము నోటి నుండి వై

నను యుక్తితో దప్పించుకొని జీవములతో వచ్చుట యంత కష్టతరమైనది కాదు కాని, యసమాన పరాక్రమ ధీ విశారదుడగు రోలో బారినుండి తప్పించుకొనుట దుర్ఘటము!

నిహాపకుడు తనలో దా ముదమందుచు, తునకు శత్రువును తనచే జిక్కజేసిన పరమేశ్వరున కెన్నియో కృతజ్ఞతావందనముల జేసి, లాలీ కేసులో దా పడుచున్న శ్రమ 'బూడిదలో బోసిన పన్నీరు' పగిది వృథా కాలేదని సంతసించి, ఇక తప్పక త న్నెన్నుకొనునని యంతరంగమ్మున నెంతయు నుప్పొంగి, తనకు శత్రువు స్వాధీనుడగుట కేమైన వెనుదీసినా, తుపాకితో వాని కాల్చుటకే మనోనిశ్చయము జేసికొని, యొక చేత నాయుధమును పట్టుకొని, రెండవ హస్తమును తన జేబులో దూర జేసి, యందుండి సంకెళ్లను తీసి, నేరస్తుని చేతుల బంధింప నుద్యుక్తుడాయెను. కాని, బ్లాకీ మాత్రము తన మనోనిశ్చలత్వమును వీడక, తన యుసురుల దీయనున్న యా నిహాపకుని గాంచి, యణుమాత్రము జంకక, రోలో యనిన తాటింపుమాటల కేమియు లక్ష్యము సేయక, వాని మోము జూచుచు చిరునవ్వు నవ్వుకొనుచుండెను. ఆ నైఖరి గని పెట్టి, భరింప నలవిగాక వచ్చుచుండిన కోపము కొంతవర కణగ ద్రొక్కుకొని, మరి పట్టజాలక, "ఒకే, కడసారి ప్రశ్న నడుగుచున్నాను. నీ ప్రాణములపై నీకు ప్రీతి యున్నయెడల, నిప్పుడే హస్తముల నొసగుము. లేదేని చచ్చుటకు నిశ్చయించుకొమ్ము. తప్పించుకొన యత్నించుటకు నీ కిప్పుడు సాధ్యము కాదు. ఈ పాటికి కప్పుడే పోలీసువారు కూడ వచ్చుచుందురు. నే నిచ్చటికి రాకపూర్వమే వారికి వర్తమాన మంపితిని. తడవు జేయక

చేతుల నొసగుము. తెలిసినదా?" అనుచు బ్లాకీపై మండిపడుచు, ననెను.

మారువలుకక బ్లాకీ, రోలోవైపు తేగాదిగ జూచుచునే యుండెను.

"నీజన్మ మీ ఘడియతో సరి" అనుచు రోలో పిస్తోలుతో బ్లాకీ నుదుట గాల్చెను.

'ఢాం'మ్మను పెద్ద శబ్దము వినవచ్చెనేకాని, బ్లాకీ చెక్కుచెదర కుండెను. ఆశ్చర్యపడి రోలో తుపాకిని మరల పేల్చెను—వరుసగ నాలుగు సార్లు పేల్చెను! బ్లాకీ శరీరముపై నొక్క గాయమైన పడలేదు. రోలో నిర్ఘాంతపడి చూచుచుండెను. "ఔరా! ఇంద్రజాలమువలె నున్నదే! పిస్తోలుతో గొట్టినను, వీనికి దెబ్బ తగులకున్నదే!" అనుచు నాతడు తనలో నచ్చెరు వందుచుండెను. వైరి పకపక నవ్వుచుంట గన నా 'డిటెక్టివు'నకు కోపము ద్విగుణమై బాధింపదొడగెను.

బ్లాకీ విరసముగా నవ్వి, రోలోను గేలిసేయుచు, "ఆయుధ మడ్డముగా దిరిగినది కదూ?" అని యని, తన జేబులో నుండి వేరొక రివాల్వరు దీసి, తల పంకించి, "కాలు కదిపితివా, చచ్చితి వనుకొనుము" అని పలికి, వాని చేతులోని సంకెళ్లను తా లాగికొని, నిరాయుధుడై యుండిన డిటెక్టివు హస్తములకు వానిని తగిలించెను. పిమ్మట వాడొక పెద్ద నలుచదరపు రుమాలును తీసి, బలవంతముగ నా గుడ్డను రోలో నోట గుక్కి, వాని నొక కుర్చీపై గూర్చుండబెట్టి, కాలు సేతుల గట్టి కుర్చీకి వానిని త్రాళ్లతో బంధించెను.

"రోలో, నన్నంత సునాయాసముగ స్వాధీనము జేసి

కొన నెంచితివా?" అను రీతిని తల పంకించి, బ్లాకీ, వెనుదిరిగి కుర్చీకి దూరముగ వచ్చుచుండెను.

ఇంతలో పోలీసువారు, లేబొరేటరీ సమీపించుచుండిరి. ఆ సవ్వడి గనిపెట్టి, బ్లాకీ వెంటనే టెలిఫోనుయంత్రము జేరి, తీగెల నన్నిటిని కత్తిరించి, రోలో వైపు చూచి చిరునవ్వు నవ్వెను. పిమ్మట వాడు హాలులోనుండి వెలుపలకు వచ్చి, తలుపులు మూసి, తాళము బిగించి, "పెర్సీ, తాళముచెవి యిదిగో—తీసికొనుము" అని వానిచేతి కిచ్చి, నీ విక బోవచ్చును—చాల రాత్రియైనది, పాపము" అని పల్కి, వాకిట మెట్లపై నిల్చునెను.

* * * * *

తోటమాలివలె వేస మూనుటకు దుస్తుల నవరించుకొని, 'దొంగ నిప్పుడే పట్టి తెచ్చెద' ననుభావముతో జనిన రోలో యెప్పుడు వచ్చునా యని మేరీ వేచియుండెను. నిరూపకుడు మోటారు నెక్కి చనిన పిమ్మట, యామె భోజనమునకు గూర్చుండెనే కాని, మనమున గొట్లాడుచుండిన యాందోళన, యామెగువ యాకలిని నశింపజేసెను. ఎంత మంచి పదార్థములు వడ్డించినను, ఆ సుందరి కవి రుచ్యములై యుండవయ్యెను. అట్లు మనమున నేమో యాలోచించుచు, మేరీ తినీ తినకుండు నట్లు కొద్దిగ భుజించి, మేడ నెక్కి తన గదిలో గూర్చుండెను. చీమ చిటుక్కు మనినను, ఆమె త్రుళ్లిపడిలేచి, నల్దిక్కుల బరికించుచుండెను.

రోలోపై నామెకు విశ్వాసము మెండు. ఆ నిరూపకు

ట్టి కేసులో నైన జయమును పడయునని యామె నమ్మక ము. వాని బుద్ధి కేదియు నసాధ్యము లేదని యామె యెంచు చుండెను. దొంగను పట్టి తెచ్చి, త న్నుప్పొంగ జేయునని మేరీ మనమున నూహించుకొని, త దు ద్దీపనమువలన గలుగు హర్షా బ్ధి నోలలాడుచుండెను.

మానవుని "యజ్ఞానచక్షువు"నకు దివ్యమగు దృష్టికల దు! మనమున నెన్నియో భావనలు సమకూడి, మనోవికార నిర్మితమగు భావిసౌఖ్యమునొక నిరుపమాన తేజోవంతమగు దివ్యసుందర విగ్రహముగ జేసి, మానవుని మనోఫలకమున దానిం బ్రతిఫలింపజేయుచుండెను. ఆకారణమున నల్పజ్ఞానియగు మానవుడొకప్పుడు, లోకములోనున్న సౌఖ్యములనెల్ల తనజన్మ ము నందే యారోపించుకొని, యట్టి భావనా కల్పిత సౌఖ్యాం బుధిన్మునిగి తేలుచు, భావిసౌఖ్యమున కుప్పొంగుచుండును. కాని "విధిపత్రిక పైనుజ్వలించుచున్న స్ఫురితాక్షరము" లేమిసూచిం చునో మానవదృష్టి కగోచరముగాన, మిన్నుగూలి యొకప్పుడు తన నెత్తిపై బడనున్న యంతటి ఘోరవిపత్తు వాటిల్లనున్నను, కనుగొననేరక వా డానందమున పరవశుడగును. అట్లే మేరీకూడ నేమేమో యాలోచించుకొనుచు, హృదయరంగమున నుద్భ వించుచుండిన యానందమ్మున మైమరచి, రానున్న యాపదను దెలిసికొన జాలక, రోలో యెప్పుడు వచ్చునా యని వేచియుండెను.

కొంతసేపటికి మోటారుచప్పుడు సమీపమున వినవచ్చె ను. పోలికబట్టి, మేరీ తన వాహనమే యదియని తెలిసికొ నటాలున లేచి నిలబడెను. 'లాలీమందిరము' వాకిట నామో

రు బండి వచ్చియుండఁగ, నందుండి కోలోవలె గూఢ వేషధారుడై యున్న బ్లాకీ దిగి, తొందరగా మేడమీదకువచ్చి, గది ద్వారము వద్దనిలచియున్న ముగ్ధ నుద్దేశించి, “వేగము—ఆలస్యముచేయక రమ్ము.” అని పలికెను.

కారణ మరయ నుద్దేశించెనే కాని, మేరీ మరల నేలాగో యట్లు చేయక, తనలోదానే సమాధానము గుదుర్చుకొని, గది లోనుండి యొక శాలువ దెచ్చుకొని, మారేమియు బలుకక, బ్లాకీవెంట నేగెను.

# కోటీశుతనయ

## మూడవ ప్రకరణము

---

### "బిల్లీ" హూటేలు.

By the Lord, thou sayest true, lad. And is not my hostess of the tavern a most sweet wench?"

"As the honey of Hybla,—"

*Shakespeare.*

ఇన్స్పెక్టరు కొందరు జవానులను వెంటబెట్టుకొని, వడి వడి లేబొరేటరీ జేరునప్పటికి, వానికి వాకిటనే నిరూపకుని వలె నగుపడుచుండిన బ్లాకీ యెదు రయ్యెను. అంత మేయో వాని నుద్దేశించి,

"ఏ మైనది? పట్టువడెనా? లేక—"

అని యింక యేమో యడుగబోవుచుండ, బ్లాకీ చేతితో వాని 'నూరుకొ'మ్మని సౌజ్ఞ జేసి, రహస్యముగ నేమో కొన్ని సంగతుల జెవ్రులో చెప్పెను. ఆశ్చర్యముతో విని మేయో,

"సరియే—అటులే చేయుదము. నీ యిష్టము" అనెను.

"తొందర వలదు—శత్రువు వెలుపలి కేతెంచకుండ జూచుచుండుడు. కొన్ని యేర్పాటుల జేసికొని, నే ఁదు నిము సములలో మిమ్ము గలిసికొందును. ఇచ్చోటు బాసి, చనవలదు."

అనుచు బ్లాకీ వాకిట నాగియున్న మేసీగారి మోటారు బండి నెక్కి, త్వరలో నా స్థలము వీడి యేగెను.

తమ్మిట్లు మోసబుచ్చి, చనిన బ్లాకేని నిజముగ నిరూపకుడే యని భావించి, వా డెప్పుడు మరలి వచ్చునా యని పోలీసువారు 'లేబొరేటరీ' వద్ద వేచియుండిరి.

"ఇంక నిచ్చట పని యున్నదా? నే నింక యింటికి బోవలదా?" అని పెర్సి మేయో నడిగెను.

"నీకు పని లేకున్న పొమ్ము — కాని రోలో తిరిగి వచ్చువరకు నుండుట మంచిది. ఐన యాలస్య మయినది. ఇం కొక పది నిముసములే కద" అన మేయో యనెను.

సుమారు గరగంటదనుక నందరు నచ్చట వేచియుండిరి. నిరూపకుడు మరలి రాలేదు. ఇప్పుడే వచ్చెద నని నుడివి యేగిన వాడింక రాకపోవుట కేమి కారణమో యని మేయో యోచింపదొడగెను. తన చెప్పులో వాడు భద్రమని పలుమరు వారించి యేగెను కావున, తలుపు దీసిన నేమి యుపాయము కలుగునో యని యిన్స్పెక్టరు జంకుచుండెను. ఇక, పోలీసు జవానుల కోపమునకు మేర లేకుండెను. కాలము మించిపోవుచున్నది. చాల రాత్రి కూడ నైనది. బహుశః వారిలో కొందరికి మిక్కుటముగ నిద్ర వచ్చుచుండె నేమో! చేయు పని లేక వాకిట గాచియుండుట వారికి మనస్కరించ లేదు. దొంగను పట్టవచ్చియు, వెలుపల నప్పారక నిరీక్షించుచుండుట, వారికి బోనులో నున్న యెలుకను చూచుచు నేమియు జేయలేని మార్జాలములకు వలె, సంతాపకరమై యుండెను. వారిలో వారు గుసగుస లాడుచుండిరి. అంత వారిలో నొకడు విసుకు

భరింపలేక, పెర్కిని సమీపించి, "నీ యజమానుడు తాళము చెవిని నీ కొనగలేదా?" అని ప్రశ్నించెను.

కునుకుచు గూర్చుని యుండిన యా వృద్ధుడు త్రుళ్ళిపడి లేచి, "ఏ మంటివి?—తాళము చెవియా? ఇదిగో చెవి" అనుచు నొక పొడవగు యినుప తాళము చెవి నా జవాను చేతి కందిచ్చెను.

అందుకొని యా భటుడంత మేయో నుద్దేశించి, "అయ్యా, తాళము చెవి నుంచివేసి యాయన యేగెను. 'నియమిత కాలములో రాజాల'డని యాయన కూడ భయపడెనేమో! తా ననిన కాలములోగా రాలే కున్నయెడ, తాళము దీయవలె నని యాతని యుద్దేశము కాబోలును" అని పల్కెను.

జవాను మాటలను విని, మేయో కొంతదనుక తనలో నాలోచించుకొని, "సరియే, తాళము దీయుము" అని యాజ్ఞాపించెను.

అట్టి జబాబు వచ్చునా లేదా యని నిరీక్షించుచుండిన యా పోలీసువారి కందఱకును, 'సరియే' అను మాట బ్రహ్మానందకరమై వినవచ్చెను. చెవిని పట్టుకొని యున్న భటుడంత వడివడి తలుపువద్ద కేగి, తాళము దీయ నుంకించెను. తొలుత, నా తాళము చెవి రంధ్రమున నిమడకుండెను. అది చూచి జవాను, తన యాతురతయే యట్టి యాలస్యముల నెలకొల్పునని బుద్ధి తెచ్చుకొని, "తొందర పడిన నే కార్యమును సాగదు గదా!" యని మనమున ననుకొని, జాగ్రత్తగా మరల తాళము దెరువ యత్నించెను. కాని యా చెవి, రంధ్రమున దూరకుండెను. వా డెంత నేర్పుతో ప్రయత్నించినను కార్యము లేక

పోయెను. విసుగుతో వా డంత నా చెవిని నేలపై బడవేసి, కోపముతో పెర్సీపై దిరుగబడెను.

"ఈచెవి కాదు, దీని చెవి నిమ్ము."

త న్నటు గదించి యడుగుచున్న పోలీసువానిని తెల్లబోయి చూచుచు, పెర్సీ కొంతతడ వూరకుండెను.

"ఏమి? ఆ చెవి సరిపడదా?"

"ఇది వే రొక తాళముది. ఒక తాళముచెవి, యింకొక తాళమున కెట్లు సరిపడును?" అనుచు పోలీసువాడు కన్నులెఱ్ఱ జేసి, కోపము బట్టలేక, పండ్లు పటపట గొఱుకుచుండెను.

క్రింద బడియున్న తాళముచెవి నందుకొని లేచి, పెర్సీ మిక్కిలి చికాకుతో జవానువైపు పెగాదిగ జూచి, తల యూచి, "కుదిరినది—పాగా జుట్టవేరక బుర్ర వంకర యనిన వానివలె నున్నావు. ఈచెవి దానిదే! నావద్ద మరి వేరు తాళముచెవు లెక్కడివి?" అనుచు స్వయముగ దానే యా చెవితో తాళము దీయ సిద్ధపడెను. కాని, వాని ప్రయత్నము సహితము నిష్ఫల మయ్యెను. బిక్కజచ్చి, నోట మాట రాక, పెర్సీ తెల్లబోయి చూడసాగెను. అవమానము, భయము, అమాయకత్వము, ఆశ్చర్యము, అన్నియు పెనగుకొని, వాని మోమున తాండవ మాడుచుండెను.

అంతయు గనిపెట్టుచుండిన యిన్స్పెక్టరు సంగతి గ్రహించి, "పెర్సీ, ఇటు రమ్ము—ఏదీ, తాళముచెవి చూపుము" అని వాని చేతిలోని చెవి నందుకొని చూచి, కొంత దనుక నూరకుని, తల పంకించి, "సరియే—ఇంక నెట్టి తడవు చేసి

నను ప్రమాదము రావచ్చును. అన్నా, ఎంత మోసము!" అనుచు వడి వడి తలుపువద్దకు వచ్చెను.

కోటు జేబులోనుండి తన రివాల్వరు దీసి, మేయో, తాళపు రంధ్రములో నద్దానిని పేల్చి, బద్దలు చేసెను. తలుపు దోసుకొని యందరును లోన బ్రవేశించిరి. కొందరు వెంటనే హాలులోని కేగి చూచిరి. మేయో తనతో వచ్చుచుండిన భటులను వెనుకకు నుండు డని స్వాజ్ఞ చేసెను. తోడనే సగము మంది ద్వారముకడ సమీపమునందే యాగిరి.

ఒక కుర్చీపై కాలు సేతులు కదియ గట్టబడి, నోట గుడ్డ యుండిన, పురుషు డొకడు పోలీసువారికి గోచరించెను. వానిని చూచి, దొంగ దొరికె నని వా రందరును ముద మందుచుండిరి. ఇన్స్పెక్టరు మాత్రము వేరుగ నూహించుచుండెను. వాని యాతురత యిట్టిదె యుండెనని చెప్ప సాధ్యము కాదు. బిరబిర నాత డా బంధితుడై యున్న పురుషుని వద్ద కేగి, వాని కట్లను తెంచి, నోట నున్న గుడ్డ నూడదీసి, కుర్చీనుండి వానిని లేవనెత్తెను.

"మిత్రమా, రోలో, నీ కిట్టి యవస్థ యెట్లు సమకూరెను?" అని యాశ్చర్యముతో మేయో ప్రశ్నించెను.

ఇన్స్పెక్టరుతో వచ్చిన పోలీసు పరివార మంతయు నొక్కసారి త్రుళ్లిపడిరి. వా రందరును క్షణముదనుక కలలో నున్నవారి వలె నేమియు నమ్మలే కుండిరి. నిజముగ నా పురుషుడు రోలో యేనా, అని వా రాశ్చర్యపడసాగిరి.

* * * * *

రాత్రి పదునొకండు గంటలు వినవచ్చెను. మనుష్యుల సంచారము తగ్గి, పట్టణమంతయు నిశ్శబ్దముగానుండెను. ఊరి బయట నున్న యొకానొక గృహము మాత్రము మెలకువతో నుండెను. క్రొత్తవారి కా యింటి సంగతి తెలియకున్నను, ఆ పట్టణములో నున్నవా రందరికిని కూడ, నది యొక భయంకరమగు స్థల మని యెఱుక. రాత్రిపూట నా మార్గమున చన నెవ్వరైన భయపడక మానరు. పోలీసువారు సహిత మా ప్రదేశమునకు బో వెరతురు.

గృహము చుట్టు నున్నతము లగు వృక్షములు, యిరకటముగా బెరగి, పట్టపగలే చీకటి గలుగ జేయునంత దట్టమగు 'జీబు' కలిగి యుండెను. ఆ చెట్లపై చిలుక గోరువంకలవంటి యుత్తమజాతి పిట్టలు వసించు నని నమ్మలేము. గ్రద్దలు, రాబందులు, మాలకాకులు, మొదలుగా గల పక్షులే, యా వృక్షములపై గూళ్లు కట్టుకొని యుండును. అట సదా గూబల కూతలే వినవచ్చుచుండును. గృహములోని గొల్లునకు తోడు, చీ రెడపిట్టల చింతకీలు రాత్రిపూట నెడతెరపి లేక చెవుల బడుచుండును. అట్టి భయంకర ప్రదేశమున నున్న యా గృహము మిక్కిలి పెద్దది యయ్యు, క్రిక్కిరిసి యిరకటముగా నుండును.

నాటి రాత్రి యొక పురుషుడు, తన శిరస్సుమీదుగా నొక యున్ని శాలువ గప్పుకొని, వడి వడి నడచుచు, మాటిమాటికి నిటు నటు నొకసారి పరికించుచు, రోడ్డు ప్రక్క నుండి వచ్చుచుండెను. సుమారు పదునొకండు గంటల సమయమునకు వాడు, ఊరిబయట నున్న యా చెట్ల యావరణలో

నున్న గృహమునకు వచ్చి లో బ్రివేశించెను. ఆ యింటి చావడిలో వ్రేలగట్టబడిన దీప మంత కాంతి గలదిగా నగుపడ కున్నను, వెలుగు రోడ్డుపై బడుచుండెను. చావడిలోనికి వచ్చి, యా పురుషుడు తన తలపై నున్న యున్ని వలువను తీసివేసి, యచ్చట నున్న వారిలో కొందరిని పలుకరించి, యొక కుర్చీపై గూర్చుని, యచ్చటనే యున్న యగ్నిహోత్రమునైపు తిరిగి, మంట గాచుకొనఁ జొచ్చెను.

అప్పు డొక స్థూలకాయు డగు పురుషుడు వచ్చి, కొత్తగా వచ్చి, నిప్పు గాచుకొనుచున్నవానిని పలకరించి, చిరునవ్వు నవ్వెను. అంత నా నూతన పురుషుడు స్థూలకాయు డగువాని నుద్దేశించి,

"బిల్లీ—నేను చలి లా నైనది. మంచులో తడిసి వచ్చితిని. వెచ్చపుట్టుటకేమి తెచ్చెదవో, నీయిష్టము. ఆకలికన్న దాహము మిక్కుటముగా నున్నది" అని యనుచు, మరల మంట గాచుకొనుచుగూర్చుండెను.

వాని యుద్దేశము కనుగొనగలిగి కాబోలు, బిల్లీ పక్కున నవ్వెను. పిమ్మట వాడు "సరియే" యని వెనుదిరిగెను. స్థూలకాయు డైనను, బిల్లీ పొడవరి యగుటచే నాలు గడుగులలో చావడి దాటి లోని కేగెను. కొంత సేపటికి వాడు తిరిగివచ్చి, కొన్ని తినుబడి వస్తువులను న్వయముగ దెచ్చి టేబిలుపై నుంచెను. వాని వెనుకనే యొక స్త్రీ వచ్చి, యొక పెద్ద గాజు గళాసుతో మత్తు కలిగించు కృత్రిమపానీయము దెచ్చి యుంచెను. ఆ యువతిని చూచి, నూతన పురుషుడు చిరునవ్వు నవ్వుచు, గళాసు నందుకొని "వట్టి" జేసెను. పిదప వాడు భో

సము ప్రారంభించి, పళ్లెరమున నున్న పదార్థముల నన్నిటిని తినివేసిన పిమ్మట, మూ రడిగి, మరల నిం కొక గళాసును తె మ్మని, విస్కీతో నింపి, వట్టి జేసి, తల పై కెత్తక భోజనము జేయుచుండెను.

అడిగిన వన్నియు దెచ్చి యొసగుచు, బిల్లీ యచ్చటనే నిల్చొని యుండి, యప్పు డప్పు డా నూతన పురుషుని ప్రశ్నించు చుండెను.

"టామీ— నే డింత యాలస్య మేల చేసితివి?"

ఆ క్రొత్తగా వచ్చిన పురుషుడు మితిమీార సారాం ధని వించుటచే నొంటిపై స్మారకము లేకనో, లేక, యూ స్థగ వల యుని పరిశ్న తన చెవుల బడునప్పుడు వాడు నములు లభించు దుముక్కల రుచివలననో, లేక మరి యే కారణముననో టామీ యెట్టి జబాబు నీయకుండెను. బిల్లీ మరల ప్రశ్నించెను. విం వొకసారి తల పై కెత్తి, మరలదించి, "ఊం" అని గుట్టుగా డ యూరకుండెను. అంతకన్న సబ బగు ప్రత్యుత్తర వినాయము వాని నాలుక స్వాధీనములో నుండెనో లేదో చెప్పలేము, కాని, శరీరము మాత్రము వాని యధీనమున లే కుండె నని తెలియవచ్చుచుండెను. తప్పతాగి యుంటచే, యొడ లంత యు చెమ్మటలు గ్రమ్మి, మనిషిని 'జూగించు' చుండెను. వా నికి వడ్డన సేయుచుండిన బిల్లీ యణుమాత్రమును వెనుదీయక, యడిగినంత సారాయి నిచ్చుచుండెను. వాని కది క్రొత్తకాదు. అచ్చటికి వచ్చినవా రందరును కూడ నట్లే మైమరచి, మధు పాన మొనరించుచుందురు. నాడు టామీ యాలస్యముగ వ చ్చెను కాని, లేకున్నచో నితరుల పంక్తినే కూర్చునియుండును

వచ్చినవా రందరును తమ యిచ్ఛకు వచ్చినంత, తిని, త్రాగి, యేదో యొక విధమున కాలయాపనము చేయుచుండిరి. కొందరు త్రాగుబోతులు స్మారకము దప్పి సెజ్జలపై నిటు నటు దొర్లుచుండిరి. కొందరు మాత్ర మింకను కొంచెము తెలివితో నున్నందున, నొకచో గూడి జూద మాడుచుండిరి. మరికొందరు కారణము లేకనే వారిలోవారు గొల్లు పెట్టి తగవు లాడుకొనుచుండిరి. ఒకచోట గొందరు పోగై, కెవ్వున యరచుచు, అసందర్భ చర్చలలో దిగి, బూతుపాటల బాడుచు, పకపక న వ్వుచు తిట్టుకొనుచు, దయ్యములవలె వికృత కేళీవినోదముల సల్పుచుండిరి. ఇంద్రుని చంద్రుని లక్ష్యము సేయక, నోటి దగువాట్లెల్ల వదరుచుండిన యా రాక్షసావతారములతో సరస మాడుచు, లజ్జాజ్ఞానములు లేని పలువురు యు తిని. కూడ నా మందిరమున, మగవారితో గలసిమెలసి, పాపకరము లగు నింద్యవినోదముల నోలలాడుచుండిరి. అంద రు మిక్కిలి ఘాటగు చుట్టలను కాల్చుచుండుటచే నింటి డ పొగ క్రిమ్మి దీపపు కాంతిని క్షీణింప జేయుచుండెను. భూలోక నరక మని వేరుగ నెచ్చటనైన నింతకన్న నసహ్యకరమగు ప్రదేశము కలదని యెంచువారి కీ స్థల మొక్కసారి మాత్రము చూపినచో, నట్టి యభిప్రాయమును వెంటనే మార్చుకొందురు. ఘోర పాతకముల కెల్ల పుట్టినిల్లై; "పాపి" యను రెండక్షరములు స్ఫుటముగ నుదుట బ్రహ్మచే వ్రాయబడిన యవతార పురుషులయాత్రాస్థలమై; లోకములో నుండు చెడ్డ వ్యసనము లన్నియును నమకూడి, యెడతెరపి లేక సదా పాలింపబడుచుండు భయంకర ప్రదేశమై, మర్యాద మప్పిదము

లను సవతిపో రట్ల నూహించు మానాభిమాన లజ్జావిహీనులగు యున్న స్త్రీల పాపకృత్యముల బ్రోత్సహించి, మరుగు పఱచు వ్యభిచారవ్యసన రక్షణస్థానమై; రేయింబవళ్లను తల క్రిందు సేయు జూదగాండ్రతోను, "మద్యపాయీ"లతోను, దోపిడి దొంగలతోను, వ్యభిచారిణులతోను, క్రిక్కిరిసి, యా గృహ మెప్పుడును కోలాహల మొనరించుచుండును.

బిల్లీ పరిపాలనము క్రింద నున్న యా గృహ మొక ధనికునిచే స్థాపింపబడిన హోటేలగుటచే, నచ్చట తరుచుగ వలయు భోజనపదార్థములును, పర దేశీయ సారాలును, లభించును. మర్యాదస్థు లెవరును బిల్లీ హోటేలునకు బోరు. టామీ మాత్రము సమయము చిక్కినపు డెల్ల, నిచ్చటికే వచ్చి విందొనరించుకొనుచుండును. అలవాటు ననుసరించియే నాడుకూడ వచ్చి, టామీ యెడ తెరుగక త్రాగుచు, విఘ్నేశ్వరోపాసనము గలవాని పగిది, మితిమీరి భుజించుచుండెను.

మత్స్యమాంసాదులతో వండిన పదార్థములు నా డెన్ని యుండినను, టామీ కన్నిటి కన్న రుచ్యమై యుండిన దొక చిక్కని పులుసు! వాడు పులుసు పదేపదే మా రడుగుచు, జుఱ్ఱుచుండెను. అట్లు వటుకము గుడుచుచుంటలో, ప్రమాదవశమున గొంతుకలో నేమి యడ్డుకొనెనో కాని, టామీ పొలబారి దగ్గ నారంభించెను. దాని నాపుకొనుటకై, యేదేని త్రాగుటయే మంచి సాధన మని యెంచి కాబోలు, వా డంత నొక గ్లాసుడు బ్రాందీ సోడాతో నింపి, యెత్తి త్రాగెను. పొలబారుట తగ్గుటకు మా రది యధికముకాగ, దగ్గు హెచ్చయ్యెను. అందుచే వానికి కడుపులో నేదో యొక వికారము

జనించెను. ఆ త్రిప్పువలన, వాడు తిని త్రాగిన దంతయు వమనము కాఁ జొచ్చెను.

ఆ తరుణమున వెలుపల నేదో మోటారుబండి వచ్చుచున్నట్లు శబ్దము వినవచ్చెను. చప్పుడు తన వీనుల సోకఁగనే టామీ నిదానించి యాలింపఁజొచ్చెను.

వాంతులతోఁగూడ, వాడు లోనికి పుచ్చుకొనిన దంతయు బయటకు రాఁగా, టామీ కొంచెము సేద దేరి, తెలివి దెచ్చుకొనెను. వమనములు కట్టినవి! పిదప వాడు బిల్లీ తనకొరకు లోనికి జని కొని తెచ్చిన యొక గ్లాసు నందుకొని, వాంతుల నాపుట కది మంచి మం దని గ్రహించి, యా ద్రావకము రుచ్యమై యుండకపోయినను, యెటులో కష్టపడి, లోనికి పుచ్చుకొనెను.

మోటారుబండి వచ్చి, యా హోటేలు వాకిటనే యాగినట్లు టామీకి పొడకట్టెను. అంత వా డదరిపడి లేచి నిలచెను.

“ఏ మిది?—ఇంత రాత్రివేళ నాయమ యెచ్చటి కేఁగ బయలుదేరినది?... లేక, బహుశః రోలో నై యుండునా? అతడే నై యుండవలెను. వానికి రేబవళ్లను విచక్షణ లేదు. —కాని బండి చప్పుడు మాత్రము నా యజమానురాలి మోటారుదివలె నున్నదే!.....అన్నా! నే నిక్కడి కేల వచ్చితిని? వా రిరువురిలో నెవరు నన్ను చూచినను, యే మనుకొనియెదరు? లోపలికి జని ‘దాగుందు’నా? అదియును ప్రమాదమే. మఱింత యనుమానమునకు కారణము!... లేక నా నీడ జూచి, నేనే బెదరు చున్నానా? వా రిచ్చటికి రా నిమిత్తమేమి? నేనే పొరబడుచున్నాను.”

ఇట్లు పరిపరి విధముల నేమో తనలో జర్చించుకొనుచు, టామీ భయ మందిన వాని వలె బిక్క జచ్చి, రెప్ప వాల్చక, ద్వారమువైపు చూచుచుండెను.

అంత, నోట నొక సువాసన గల సిగరెట్టు నుంచుకొని, యొక పురుషుడు మెల్లగ లోనికి వచ్చుచుండెను. వాని జూచు నంత, టామీ గడగడ వణకసాగెను. వాని మోము రక్తవిహీనమై, కన్నులు దృష్టిమాంద్యము లయ్యెను.

వా డంత, గద్గదస్వరముతో నావచ్చిన పురుషుని చూచి, "అయ్యా, క్షమింపుడు" అని దీనముగ వేడుకొనుచు, బలికెను.

ఆ పురుషుడు తనలో మెల్లగ నవ్వుకొని, టామీని నిదానించి చూచుచు, "నోరు మూయుము—నాతో నిటు రమ్ము" అనుచు వానిని దోడ్కొని, యా చావడి వీడి, చీకటిగా నుండు నొక నిర్జన స్థలమున కేగి, యిటు నటు నొకసారి పరికించి, సమీపమున నెవ్వరును లేరని నిశ్చయించుకొని, మెల్లగ వాడు టామీ చెవులో,

"టామీ, నన్ను రోలోగా భావించి భయపడితివా? నీ యజమానురాలి వలన కూడ నీ వేమియు భయ మందనక్కర లేదు. మేరీ నా చే జిక్కినది."

అనుచు వాని చెవిలో నేవో కొన్ని రహస్యముల జెప్పి, "గ్రహించితివా?" అని యడిగెను.

టామీ తల యూచ, నా పురుషు డంత తన జేబులో నుండి యొక చిన్న కార్డును తీసి, టామీని మరునాడు రమ్మని చెప్పుచు, ఆ కార్డుపై నొక యింటి విలాసమును వ్రాసి

కొసగెను. కార్డు దీసికొని, టామీ భద్రముగ తన జేబులో దాచెను. రోలో వలె గానవచ్చుచుండిన యా పురుషుడు టామీ చేతిలో నైదు బంగారు నాణెముల నుంచి, “జాగ్రత్త సుమీ—నీ యిష్టము” అని యనెను. పిమ్మట వాడు శీఘ్రమే యాస్థలము వీడి, వాకిట నిలచియుండిన మోటారుపై నెక్కెను.

* * * * *

దొంగ తుదకు తమ్ముగూడ మోసపుచ్చ గలిగినందుకు రోలో మేయో లిరువురును లోలోన నెంతయు నొచ్చుకొని, యా హంతకు నెట్లైన బట్టి శిక్షింపవలయు నని మనోనిశ్చయము జేసికొనిరి. రోలో సహజముగ చాల యుక్తిపరుడు—యోచన గలవాడు—తొందర పడి యే పనియును చేయడు. మేయో కొంచెము తొందరపాటు మనిషి. ఎప్పటి కేది తట్టిన, నది చేయును—గాని యాయన కూడ నిపుణుడే! ఇన్స్పెక్టరునకు అనుభవము మెండు. రోలో మాత్ర మింక చిన్నవాడు. ఐనను, వానికి లోకానుభవము లేకపోలేదు. అల్ప వయస్కుడయ్యు, రోలో బుద్ధివిశేషములలో నెంతయు వృద్ధుడే! నిరూపకుడుగా వచ్చినది మొదలాయన, యెన్నియో కఠిన కేసులలో తన వాకచక్యము జూపి, జయ మందుచుండెను. దొంగలను పట్టెను; హంతకుల శిక్షించెను; విచిత్రముల గనుగొన గలిగెను; నిరపరాధుల రక్షించెను. కాని బ్లాకీ వంటి శత్రువు నెన్నడును రోలో యెదుర్కొని యుండలేదు.

జవానులను పంపివేసి, పెన్నీ నింటికిఁ బోవుటకు సెలవొసగె

మిత్రు లిరువురును లేబొరేటరీలో గూర్చుని యుండిరి. మేయో యెన్నియో యుపాయముల నన్నుచు, దోషిని పట్టుకొనుటకు నన్నవలసిన యన్నివిధము లగు యుక్తులను నిరూపకునితో జెప్పుచు, వాని యభిప్రాయము నడుగుచుండెను. పది ప్రశ్నలకొక జబాబు నిచ్చుచు, రోలో శిరము వాల్చి, గూర్చునెను. వాని యూహాప్రవాహ మపారమై, యాందోళనాతరంగమ్ములచే గలవర మంది పొరలుచు, విస్మయాంధకారసాగరమ్మున సంతరించుచుండెను.

“రోలో—చేతుపాకి బట్టుకొని యుంటి వేమో? ఏల గొట్టకుంటివి?” అని మేయో నిరూపకు డడుగ, నాయన తల పైకెత్తి, ఇన్‌స్పెక్టరు వైపు తేరిజూచి, నిస్సత్త్వ నవ్వొ యూరకుండెను. అర్థము జేసికొనలేక, మేయో వానిని నిదానించుచు, చూచుచుండెను.

“మేయో, నా చేతిలో రివాల్వ రుండె నన్న మాట నిజమే కాని, అది పట్టి యలంకారార్థము పట్టుకొనునది యైనది—దానికి బదులు చేత నొక కఱ్ఱ యుండినచో గొంత లాభించి యుండు నేమో!” అని రోలో నింపాదిగ బల్కెను.

“ఏమి?—తుపాకి దట్టించి యుండలేదా?”

“లేకేమి? ఐదు బారులతో దట్టించి యుండెను.”

“నా కేమియు బోధపడకున్నది. నీ చేతిలోని యాయుధమును వాడు లాగుకొనెనా యేమి?” అని మేయో యాశ్చర్యముతో నడిగెను.

“లేదు.”

“ఐన నెందుకు పేల్చకుంటివి?”

"పేల్చిన దేమి? ఒకసారి గాదు—నాలుగు సార్లు పేల్చితిని" అని హోలో బదులు పలికెను.

"గురితప్పినా యేమి? లేక, దెబ్బతగిలినను, వాడు లక్ష్యము చేయకుండెనా?" అని యిన్స్పెక్టరు రెట్టింపు యాతురతతో బ్రశ్నించెను.

"గురి తప్పుటెట్లు? వాని నుదుట నెక్కు బెట్టి పిస్తోలు గాల్చితిని. గాయము తగులకుండెను. గుండు పేలిన శబ్దమునకు మాత్రము లోటు లేకుండెను."

"అదెట్లు వీలగును?"

"ఏమి?—మాయ తోటాల నెరుగవా? మీ పోలీసువారవి వాడరా? ఊరిలో నేదయిన దొమ్మి జరిగినప్పుడు మీరేమి చేయుదురు? అల్లరి సణప, దుపాకులు గొట్టరా? నిజముగ గుళ్లు దట్టించి పేల్చినచో, నిష్కారణముగ నెందరో చచ్చెదరుగదా! అందుచే నటుల నుత్త తోటాలను గొట్టెదరు. శబ్దము మాత్రముండును. హాని కలుగదు—ఏమందువు?" అని హోలో సమాధానము జెప్పసాగెను.

"అవును నవును. మాక్‌టార్జెట్సు కదూ!" అని మేయో తల నూపుచు ననెను.

"అవియే!—నా రివాల్వరు మాయ తోటాలతో దట్టింపబడెను."

"వాటితో నేల దట్టించి యుంచితివి?"

"లేదు, లేదు—నేను దట్టించుట కాదు. మంచి క్రొత్త తోటాలతోనే నా యాయుధమును దట్టించి, సిద్ధముచేసి, మామూలు రీతిని నా టేబిలు సొరుగులో నుంచితిని. బహుశః శత్రువు

ముందు హాలులో ప్రవేశించి, అన్నియు పరీక్షించి యుందును. టేబిలు సొరుగులో వాని కాపిస్తోలు కనుపించెను. తోడనే వాడు దానిని తీసి, చూచెను. అందు దట్టింప బడియున్న తోటాల నూడదీసి వాడు మాయ తోటాలతో మరల దట్టించి, యథాస్థానమున నుంచివేసెను. రివాల్వరు దీసి, తోటాలన్నియు సందమిడి యుండుట జూచి, యవి మాయ వని నే ననుమానించనైతిని;" అని రోలో సవిస్తరముగ నంతయు దెల్పుచుండిన సమయమున, వాని టెలిఫోను మ్రోగజొచ్చెను. లేచి యా నిరూపకు డంత రిసీవరు నందుకొని, చెవియొద్ద నుంచుకొని సంభాషింప దొడగెను.

"...ఎవరు?...జూలియా, ఆఁ, ఏమి?...ఆఁ... మేయోయా? నాతో వచ్చెనా? గంట గంటన్నర క్రిందటనా?... మోటారుపైనా?...[illegible]? లేదు. నే నామెకొరకు వచ్చి యుండలేదే!...నేనే పిల్చితినా? లేదు. ఏదో మోసము జరిగినది...సరియే, భయపడవద్దు. ఇప్పుడే కనుగొనియెదను."

అంతయు నాలించుచుండిన మేయో, సంగతి గ్రహించి, క్షణముదనుక మాత్రము జూలియా పల్కులను నమ్మలేక, మరల నట్టి తలంపు వదలుకొని, ఆమె యట్టి యనృతవాది కాదని యనుకొని, అంతయును విశ్వసించి, నిరూపకుని వైపు దిరిగి యేమియు ననలేక, యూరక చూచుచుండెను.

"మేయో,—యింక నెట్టి తడవును, చేయరాదు. ఘోరము జరిగినది! స్టేషను కేగి, జవానుల రక్షించి, నా దిక్కులకు బంపుము. నీవే స్వయముగ జూలియా వద్ద కేగి యన్నియు సవిస్తరముగ గనుగొనుము. నే నీలోపల సిద్ధమై

యుండును. త్వర పడుము. మేరీ యా దుర్మార్గుని వాత బడి నది."

అని తొందరతో ననుచు, రోలో దుస్తుల ధరించుకొని, మేరీ యన్వేషణార్థమై తనకు తోడు జేయ మేమోను శీఘ్రముగ దానికు బంపి, తానును త్వరపడు చుండెను.

మేమో యేగిన కొన్ని నిముసములకు "టాక్సీ కాబ్" పై వడిగావచ్చి, యొక పురుషుడు లేబొరేటరీ ప్రవేశించెను. వానిని చూచి రోలో తృళ్లిపడి, మరల తనలో నేమో సమాధానము జేసికొని, మెల్లగ నవ్వుచు,

"ఓ్ప్రిసీ నీవా? ఎవరో యనుకొంటిని. ఏమైన గనిపెట్టితివా? అటులైనచో, ఉదయము వరకు నాతో నేమియు జెప్పకుము. ఇప్పుడు చాలా తొందరపనిలో నున్నాను. మేరీ హరింపబడినది!" అని తీవ్రాలోచనతో బలికెను.

"ఆ సంగతి తెలియవచ్చెను. కావుననే, నే నిప్పు రాత్రివేళ నిచటికి వచ్చితిని."

"ఏమేమి? నీ కేసంగతి తెలియవచ్చిన దనుచున్నావు?" అని రోలో యాతురతతో నడిగెను.

"మేరీ శత్రువు వాతబడుట!"

ఆశ్చర్యముతో రోలో తన 'జూనియరు' ను నిదానించుచు, నొక యాసనమున గూర్చుని, "అయిన, నంతయు సవిస్తరముగ జెప్పుము. మేమో వచ్చులోపున నీ కథ ముగించవలెను" అని యనెను.

"పదిగంటలకు నే నచ్చటికి పోవుచుంటిని."

"ఓల్డ్ హారొటేలు కేనా?" అని రోలో ప్రశ్నించెను.

"అవును. కాని నే నెవరికో అడ్డై పోయి యుంటినో, ఆ మనిషి నాకు కానరాలేదు. చాలసేపు దనుక వెదకితిని. నిరాశ జేసుకొని, తుద కొక చోట నొంటరిగ గూర్చుంటిని" అని ట్రేసీ పూసగుచ్చినట్లు చెప్ప ప్రారంభించెను.

రోలో యంతయు వినుచుండెనే కాని, వాని ధ్యానము వేరుగ నుండెను. మాటి మాటికి నాయన తన జేబు వాచీ చూచుచుండెను.

"నన్నెవరు పలుకరించినను, మూగు చెప్పకుంటిని. త్రాగినవాని వలె జూచుచు నొంటిపై తెలివి లేనట్లు నటించితిని. సుమారు పదునొకండు గంటలకు టామీ వచ్చియుండెను."

"ఎవ రంటివి?—టామీయా?"

"అవును—లాలీగారి తోటమాలీ యగు టామీయే!"

"వా డేల వచ్చియుండెను—మేక్రి జాడ వానికి తెలిసి యుండెనా యేమి?" అని మరల రోలో యడిగెను.

"కాదు, వాడు వచ్చుట యూరకె గూర్చుటకే కాదు. తొలుత వానిని నే నేమియు ననుమానించలేదు. మధుపాన వ్యసనమే వాని నచ్చటి కీడ్చుకొని వచ్చెనని యనుకొంటిని—కాని క్రమ క్రమముగ గొన్ని సంగతులు వెల్లడియైనవి."

రోలో, చెవులు రిక్క బొడుచుకొని యాలించుచుండెను. ట్రేసీ చెప్పుచుండిన దంతయు వానికి మిక్కిలి యాశ్చర్యప్రదమై వినవచ్చెను.

"సుమా రర్ధరాత్రి యగునప్పటికి, మేక్రిగారి మోటారు బండి వచ్చి వాకిట నిలచెను."

"బిల్లీ హోటేలు కేనా?" అని రోలో త్వరపడి యడిగెను.

"అవును. అందుండి యొకడు దిగి లోనికివచ్చెను. వానిని పరీక్షించి చూచితిని. సుమారు రయి దడుగుల మనిషి. గురుతు లేమైన గనుగొనగలనేమో యని శోధించితిని. కాని నాకేమి యు నగుపడకుండెను. టోపి వాని నుదురును కప్పివేసెను. నా డొక సిగరెట్టును కాల్చుచుండెను. వెళ్లిపోవుచున్నప్పుడు వాడద్దానిని రోడ్డుపై బారవేయ నే నది సంపాదించితిని. వాడు లోనికి జని టాపులాని సమీపించెను. ఆ సమయము జూచి, పయికి వచ్చి నేను మోటారువద్ద కేగితిని."

"ఏల?—వారేమి సంభాషించు కొనిరో వినుట మాని మోటారువద్ద కేల పోతివి?" అని రోలో యడిగెను.

"ఆ మోటారుచప్పుడు, నాకు తెలిసిన బండియొక్క ధ్వని వలెనే తోలుత వినవచ్చినది. కాని యెవరి వాహనమై యుం డునో స్ఫురింపకుండెను. ఎందుకైనను మంచి దని బండివద్ద కేగితిని. చూడగనే యా మోటారు మేరీగారి దని విశదమయ్యె ను. అంత బండిలో నెవ రున్నారో యని చూడ గోరికపుట్టినది. తోడనే నా జేబు లాంతరుతో బండిలో చూచితిని. మొగము పై గుడ్డ కప్పబడి, యొక స్త్రీ యగుపడెను. మొదట, పోలిక బట్టలేక పోతిని. ఆమె గాఢముగ నిద్రించుచున్నటుల గానవ చ్చెను. మొగముపై నున్న గుడ్డను తీయ ధైర్యముజేసి, చేయి జాచితిని. ఇంతలో సమీపమున నడుగుల చప్పుడు వినవచ్చెను. నా చేతిలోని విద్యుద్దీపము నార్పివేసితిని."

"అయిన, మరి యా స్త్రీ యెవ్వరో చూడనేలేదా?" అని రోలో యాతురతతో ననెను.

"లేదు—తోడనే నే నా స్థలము వీడి, సమీపముననే

యున్న చెట్ల చాటునకు బోయి, దాగితిని. మోటారులో వచ్చి న పురుషుడును, టామీయును కలసి వచ్చుచుండిరి. వారిద్దరు ను, చీకటిగానున్న యొక యేకాంత స్థలమున కేగిరి. వారి వె నువెంటనే నేనును సవ్వడి జేయక యరిగితిని. మరుగున నిలచి, వారి సంభాషణ నంతయు నాలకించితిని. కొన్ని మాటలు మాత్రమునాకు స్పష్టముగ వినరా కుండెను. వారి మాటల బ ట్టి, మోటారులో నున్న యామెది లాలీగారి ప్రియ తనూజ యగు మేరీ యని గ్రహించితిని.”

“అయ్యో! పాప మాయబల యెట్టి చిక్కులలో జిక్కి యున్నది? కష్టము లెప్పుడును ఒంటరిగా రావు కదా?” అని రోలో తనలో మెల్లగా ననుకొనెను. వాని ముఖచిహ్నము లప్పు డీ తీరున నగుపడుచున్న వని వ్రాయుటకు సమయోచిత పదములు తోచ కున్నవి.

“ఏదో ఘోరము జరుగనున్న దని నాకు వెంటనే తట్టె ను. ఆలోచించి, మేరీ నెట్లైన గాపాడవలెనని నిశ్చయించితి ని. ఇంక నేమి జరుగునో చూచుటకు, పొంచియుండిన స్థలమున నా కాళ్లు నిలువకుండెను. ధ్యాస మన్యథా పోవుచుంటచే, వారి మాటలుకూడ నట్టుపైని స్పష్టముగ వినరా కుండెను. ఆ పురు షుడు టామీ కొరకొక చిన్న కాగితముపై నేమో వ్రాయుచుం డెను. పిమ్మట నేమిజరిగినదో కనిపెట్టకయే, నే నచ్చోటు వదలి, మోటారువద్ద కేగితిని. బండిలో మేరీ యొక్కతెయే యున్నదని తెలుసును. అందుచే, వెంటనే మోటారును నే నెక్కి స్వగృహాభి ముఖముగ బండి వదల నిశ్చయించితిని. లాలీ మందిరమునకు మరల మోటారును త్వరలో దోలగలనని యనుకొంటిని.

బండిపై నెక్కి, చక్రిముందరి గూర్చుంటిని. బండి నడుపుటకు సిద్ధపడితిని. కాని వాహనము కదలకుండెను. కారణమరయ, బండిదిగి ముందుకువచ్చి చూచితిని. చక్రములకు బ్రేక్ తాళము వేయబడియుండెను. ఆకారణమువలననే, బండి కదలకుండెనని తెలిసికొంటిని. అంత నేమిచేయుటకును క్షణము దనుక దోచకుండెను. మేకీని బండినుండితీసి, యెత్తి మోసుకొని, పరుగిడి, చెట్లచాటున కేగ నిశ్చయించితిని. అంతకు దప్ప, వేరొక రక్షణోపాయము నాకేమియు దట్టలేదు.

"ఇంతలో నా పొట్టిమనిషి రోడ్డు మీదకు వచ్చుచుండెను. శీఘ్రమే చెట్లమరుగునకు పరుగున బోయితిని. ఆ పురుషుడంత, బండి చక్రములకు వేయబడియున్న బ్రేక్ తాళము దీసి, మోటారు వదలెను......ఎట్లైన నేమి, మేకీని వాని బారినుండి రక్షింపలేకపోతిని. మోటారే దిక్కుకు బోయినదో చూచితిని. దాని గమ్యస్థాన మేదైయుండునో యని యాలోచించితిని. అంత టామీవద్ద కేగినచో తెలిసికొన వచ్చునని నాకొక యూహా తట్టెను.

"తోడనే మరల హోటేలు లోనికి బోయితిని. టామీ యప్పుడే జేబులోనుండి కొన్ని కాసులనుతీసి బిల్లీ కిచ్చుచుండెను. అందుకొనుటకు బిల్లీ చేయి జాపెనేకాని, వెనుదిరిగి చూచునంత వానికి నెల్లీ, తన వైపు వచ్చుచున్నట్లగుపడగ, చాపిన చేయి దీసివేసి, టామీ యొసగనున్న నాణెములను వలదని తల నూపుచు, చిరునవ్వు నవ్వి లోనికేగెను. ఆ వెంటనే టామీని సమీపించి, నేను వానిప్రక్కనే గూర్చుంటిని. కొంతసేపటికి వానితో కత్తుకలపగలిగితిని. వాడు నన్నేమియు ననుమానించ లేదు.

"వానికి విందు జేయ, నాకు చాల యభిలాష యున్నదని యంటిని. అప్పటికి టామీ నన్ను తన మిత్రవర్గములో జేర్చుకొనెను. తొలుత 'వల' దనెను కాని, మరల నా బలవంతము పైని నాతో నొక గళాసు త్రాగుటకు సమ్మతించెను. త్రాగుట ప్రారంభించిన వెనుక, వానిచే మితిమీర త్రాగించుట యంత కష్టతరమైన పనికాదు.

"టామీ ఒళ్లు దెలియక విస్కీ సేవింప మొదలు పెట్టెను. నన్ను కూడ నధికముగ త్రాగు మని నిర్బంధించెను. అడ్డు చెప్పక, నేనుకూడ గళాసు నందుకొని త్రాగినట్లుత్త జేయుచున్నట్లు నటించితిని. వాడు మాత్రము పరవశ మగుదనుక దాగుచునే యుండెను. అట్టి యవస్థలో వాని గుప్తమైన రహస్యములను వెలిబుచ్చునేమో యని కదపి చూచితిని. కాని ప్రయోజనము లేకపోయెను. కొంత సేపటికి టామీ తెలివి దప్పి నేల కొరిగెను. వాని నాపుచున్న వానివలె నటించి, టామీని పట్టుకొంటిని. అప్పుడు పదిలముగ వాని జేబుల తడిమి చూచితిని. ఒక చిన్న కార్డు లభించెను. అందుపై నేదో విలాసము వ్రాసియుంట చూచితిని. మోటారుపై వచ్చిన పురుషుడు టామీ కదివరకు యేదో వ్రాసి యొక కార్డు నిచ్చియుండెను. నా చేత జిక్కిన దదియే యయి యుండ నోపు నని తలచితిని. బహుశః మేరిని చేర్చవలసిన గమ్యస్థాన విలాస మదియై యుండు నని నా కేలొకో స్ఫురించినది. అంతనిక నచ్చట కాలయాపన మొనర్చుట శ్రేయస్కరము కాదని, వెంటనే మీ వదకు పరుగిడుచు వచ్చి, త్రోవలో నీ 'టాక్సీ' నతి కష్టముపై నందుకొని, బండివానికి బాగుగ నద్దె

యిచ్చెదనని యాసపెట్టి, యొప్పించి, సాధ్యమగునంత త్వరలోర మీాసన్నిధికి వచ్చితిని."

ట్రెసీ పల్కులనతి జాగ్రత్తతో నాలించి, రోలో కొంతదనుక నేమియుననక, జూనియరు వైపే జూచుచు, నూరకుని, పిమ్మట

"సరియే—మంచిది. నేనూరక యనుమానించుటలేదని రూఢియైనది. ఇంక వానిపని బట్టించెదను. బిల్లీ హోటేలుకు నిప్పంపుట మేలే యైనది. నీ వచ్చటి కేసనిపై బోయియుంటివో, యాకార్యము నెరవేరకున్నను, కొన్ని యగత్యమగు సంగతులను కనుగొంటివి. నాకందుకు చాల యానందముగానున్నది. నీవు దెల్పిన యంశముల నాధారముగా గొన్ని, మేమిప్పుడు నిక్షేపింపగలము. టామీావద్ద నీవు సంపాదించిన కార్డును నాచేతికిమ్ము. నీవిప్పుడు వెంటనే పోలీసు ఠాణాకు జని, మేయోను కలసికొనుము. కొంతమంది భటులను కూడ తోడ్కొని త్వరలో రమ్ము. ఈ కార్డుమీాది విలాసమును' చూచితివి కదా, జ్ఞాపక ముంచుకొనుము...నే నిప్పుడె బయలుదేరుచున్నాను. ఇక వెళ్లుము" అని పల్కెను.

---

# కోటీశుతనయ

## నాలుగవ ప్రకరణము

## సాహసము!

---

"దురదృష్టాదికం నాత్రప్రతిబద్ధం ప్రకల్ప్యతాం,
ప్రియస్యవస్తుప్రో లాభే దురదృష్టం నసిధ్యతి."

మోటారులో నెక్కిన కొంత సేపటివఱకు తనతో బండిలో నున్నవాఁడు నిరూపకుఁడే యని భావించుచు, మేరీ యేమియు బ్రశ్నల నడుగలేదు. కొన్ని నిముసములు పదంపడి, యాబాలిక వాని నేమో యడిగెను. బ్లాకీ ప్రత్యుత్తర మొసగలేదు. బండి నతి త్వరగా బోనిచ్చుచుండెను. మేరీ మరల ప్రశ్నించెను. వాఁ డొక్కసారి యామె వైపు జూచి యూరకుండెను. తన మాటలు వానికి స్పష్టముగ వినవచ్చుట లేదేమో యనుకొని మేరీ గట్టిగ నేమో బల్కెను. బ్లాకీ యెప్పటికిని బదులు పలుకకుండెను.

అంతకంతకును, బ్లాకీ నడవడిక యనుమానాస్పద మయ్యెను. సహజముగ మేరీ భయపడదొడగెను. మేరీ యెట్లో ధైర్యము దెచ్చుకొని, రూఢిగ గనుగొనుటకై బ్లాకీని సమీపించి, వాని ముఖమువైపు నిదానించి చూడసాగెను. అంత నామె దిగులు స్థిరపడెను!

పెడనవ్వు మోము నలంకరింప, నా పాపి యంతట దన టోపి నూడదీసి, యామె వైపు దిరిగెను. కెవ్వున యఱచి,

మేరీ తటాలున వెనుక కొత్తిగిలి, బిక్కచచ్చి చూచుచుండెను. శరీరమున నామె కొక విధమగు కంప ముదయించి, ముచ్చెమ్మటలు గ్రమ్మెను. వీధులలో నింకను జన సంచారము తగ్గనందున, నొకవేళ నాబాలిక కేక లిడి యఱచినచో, నలుగురును పోగై, బండి నాపుదురేమో యని భీతిల్లి, యట్టి తరుణమున పోలీసువారి చేతులలో బడిన హాని సంభవించు నని యెంచి, బ్లాకీ వెంటనే యామె నోటి మీదుగా నొక గుడ్డ యదిమి కట్టెను. భయాశ్చర్యములచే గలవరమందిన డెందముగల యా సుందరి, దుర్మార్గుడగు బ్లాకీ తనపై దిరుగబడి యామెను బంధింప నున్నాడని యెఱిగి, వాడు తన్ను సమీపించగనే, పాప మొక్కసారి తృళ్లిపడి, కెవ్వున యరచి, స్మృతి దప్పి ప్రక్క కొరిగెను.

మోటారును త్వరగా పోనిచ్చుచు, బ్లాకీ యమితకాలము లోనే పట్టణము దాటి, యూరి బయట నున్న 'బిల్లీ' హోటేలు దరి గొంత సేపు వాహనము నాపి, మరల బోనిచ్చెను. 'కీడెంచి మేలెంచు' దీర్ఘాలోచనా పరుడగు బ్లాకీ, మోటారు పోవుచున్నంత సేపున్ను, పరి పరి విధముల నాలోచించుకొనుచు, లోలోను తలచుకున్నపుడెల్ల కొంచెము భయపడుచు, 'మేరీ హరణము' వానికి వెంటనే కాకున్న కొంతసేపటికైన దెలియవచ్చునని మనో నిశ్చయము జేసుకొని, మోసము జరిగినదని తెలిసికొనిన యుత్తరక్షణముననే యాయన తన్ను వెంట దరుమునని యనుకొని, యట్టి యవసరమున వానికి మోటారు చక్రముల జాడలే గురుతు లని భావించి, మోటారే దిక్కుకు బోయినదో రోలో కెఱుక లేకుండ జేయవలెనని తలంచి

యే మేమో పన్నాగముల బన్నుచుండెను. రోలో తప్ప, నింకే నిరూపకుడు తన్నెదుర్కొనినను, బ్లాకీ యణుమాత్రము లక్ష్యము చేయకుండును!

'సందుగొందుల' బడి మోటా రతి త్వరగా పోవుచుండెను. అప్పు డప్పుడు బండి కొంత దూరము ముందుకు నడచి, మరల నా దారినే వెనుకకు వచ్చుచుండెను. చంద్రాస్తమాన మగు నప్పటికి బండి పోయి పోయి, యొకా నొక పాడు గృహమును సమీపించుచుండెను. అప్పటి కింకను వేగుఁజుక్క పొడమకుండుటచే, నంధకారము గ్రమ్ముకొనియుండెను. మోటా రొక వారధిమీదుగా పోవుచుండెను. వంతెనపై కొన్ని గజముల దూరమైన నింక బండి పోవకమునుపే, మోటా రాగి మరి కదలకుండెను. కారణ మరయు నుద్దేశముతో బ్లాకీ బండి దిగెను. వా డట్లు వాహనము బరీక్షించుచుండ, దూరమున నేదో శబ్దము వినవచ్చుచుండెను. చెవులు రిక్క బెట్టి, బ్లాకీ విన జొచ్చెను. ఆ మార్గముననే యేదో మోటారుసైకిలు వచ్చుచున్నట్లు వానికి పొడగట్టెను. సైకిలు చప్పుడు వినవచ్చుచున్న వైపు బ్లాకీ నిదానించి చూచుచుండెను. చీకటిగా నున్నందున వానికేమియు గోచరింపకుండెను; కాని, కొన్ని నిముసముల తరువాత నా దిక్కున బ్లాకీ కేదో వెలుగు కానవచ్చెను. అది సైకిలు దీప మని వెంటనే వాడు గ్రహించెను.

* * * * *

ట్రిసీ సెలవు దీసికొని యేగిన పిమ్మట, దనలో చాలసేపేమో యాలోచించుకొని, రోలో లేచి దుస్తుల సవరించుకొని, జేత నొక సంచి బట్టుకొని, లేబొరేటరీనుండి వెలుపలికి వచ్చె

వాకిట నిలచెను. అప్పుడు వాని హృదయమున నిట్టి భావనలు పెనగుకొనుచుండెనని తెలిసికొనుట దుస్సాధ్యము. దురాత్ముడగు బ్లాకీ సుందరి నెందుకై బలాత్కారముగ గొంపోయెనో, వా డామెనెట్టి యిడుమలగుఱుపునో, ముందిక నేమికానున్నదో, వానికి లేశమును బోడకట్టకుండెను. నిరపరాధి యగు మేరీపై నింత ద్వేష మాకూ్రరున కేల కలుగవలెనో రోలో గ్రహింపలేకున్నను, వాడేదో విపరీతకార్యముల దలపెట్టియే మున్నుందు లాలీగారిని కడతేర్చి, యటుపై నీదుండగముల జేయుచున్నాడని, రోలో యనుకొనెను. ట్రేసీని "బిల్లీ హొటేలు"న కంపుట చాల పనికివచ్చెను. మొదటినుండియు తానెవరిపై యనుమానము నెలకొల్పెనో, యా టామీ నేటికి నిర్దోషికాడని స్పష్టమయ్యెను. కావున, దొలుత వానిని పట్టుకొనిన కొంత లాభ ముండునని రోలో యెంచెను. ఇంకను టామీకి మాత్రము నిరూపకుడు తన్ను వెన్నాడు చున్నాడను సందియమైనను కలుగలేదు. రోలోయది గ్రహించి, తనలో మెల్లగ నవ్వుకొని, తలపంకించి, 'రేపు వీనిపని బట్టించెదను.' అనుకొని మరునాడు 'వారంటు' దీసికొనివచ్చి, టామీని పట్టుకొన నిశ్చయించి, ప్రస్తుతము మేరీకి వాటిల్లిన యాపద దల్చుకొన గుండె ఝల్లుమన, 'తక్కిన వాటికేమిగాని, ముందీమెను రక్షించుట యావశ్యక'మని తలచి, పోలీసువారింకను రాకమును పే బయలుదేరి, తనమోటారు సైకిలు మేరీ యింట విడచివచ్చి నందున, శత్రు వెక్కి వచ్చి లేబొరేటరీ వాకిట వదలివేసిన మోటారుసైకిలు పై నెక్కి, ట్రిపీ యొసగిన కార్డు నొకసారి జేబులోనుండి తీసి చూచి, తడవుసేయక బండివదలెను.

*  *  *  *  *  *

వాహన మే కారణమున నాగెనో యని బ్లాకీ మోటారు దిగి 'ఎంజన్' శోధించి చూడ, పెట్రోలు సరిపోయెనని తెలియవచ్చెను. చేయునది లేక, బ్లాకీ యూరక నిల్చుండెను. దూరమున నగుపడుచున్న సైకిలుదీపము గాంచునంత, వాడదరిపడెను! ఆ వచ్చుచున్న దెవ్వడై యుండనోపు నని వాడొకింత సెపాలోచించి, యొకవేళ నా వచ్చినవాడు తనకు శత్రువైనచో నేమిచేయవచ్చునని తలపోయు చుండెను. ఎట్టియాలోచనయు దోచకుండుటచే, జేబులోనుండి వాడొక సిగరెట్టునుతీసి, ముట్టించి, నోటనుంచుకొని, సైకిలుదీపము వైపే దృష్టినుంచి, మోటారు తలుపుపై తనకుడిచేయి నానుకొని, నిలబడెను. మోటారుసైకి లతి త్వరగావచ్చుచు, బ్లాకీయున్న స్థలమును సమీపించుచుండెను. కొన్ని నిముసములలో నది దగ్గరకు వచ్చి, వంతెనపై, బ్లాకీనుండి సుమారు నలువది, యేబది గజముల దూరమున, నాగెను.

అందుండి యొక పురుషుడు దిగి, మెల్లగా బ్లాకీ వైపు వచ్చుచుండెను. వాని సైకిలులాంతరు కాంతిని చూచి, బ్లాకీ యాపురుషుని నిరూపకుడని పోల్చికొనెను. క్షణముదనుక బ్లాకీ కేమియు బాలుపోకుండెను. పిమ్మట వానికేదో దివ్యమగు ఆలోచన తట్టుటచే గాబోలు, తనలో మెల్లగ నవ్వుకొని, మోటారులోనున్న స్త్రీరత్నమువైపొకసారిచూచి, యామె మొగము పైనున్న గుడ్డను తీసివేసి, యటనే నిల్చియుండెను. నిముస నిముసమునకును రోలో తనకు దగ్గర దగ్గరగా వచ్చుచుంటచే, బ్లాకీ యింక దడవుచేసిన నేమి యుపద్రవము వచ్చునో యని,

నిద్రావస్థనున్న బాలికను వెంటనే బండినుండి తన రెండుచేతు లపై నెత్తుకొని, వంతెనపై నిలచియుండెను.

ఇంకను చీకటియుంటచే, నిరూపకుని కేమియును, స్పష్ట ముగ గానరాకుండెను. మోటారునిలచియుండుటయు, సమీావ మున నడుగులచప్పుడు వినవచ్చుటయు జూడ, నిరూపకుని యను మానము ద్విగుణమయ్యెను. అంత నతడు జేబులోనుండి తన లాంతరుదీసి, ప్రకాశమానమైన యా విద్యుద్దీపమును బ్లాకీయు న్నవైపు దిప్పెను. ఆకాంతిని, బ్లాకీహస్తములలో నొక దివ్య సుందర విగ్రహముబోలు స్త్రీరత్నముమూర్ఛనంది, పడియుంట వానికి గోచరించెను. తోడనే రోలోహృదయపీఠమున నేదో దిగులుజనించెను. ఆకూరుని కరములలో స్మృతిలేక జిక్కియు న్న జవ్వనిని వా డేమి చేయనున్నాడో రోలో యూహించ లేకుండెను. బ్లాకీముఖచిహ్నముల బరీక్షింప, నా నిరూపకుని ధైర్యము సన్నగిల్లెను.

అట్టి తరుణమున, రోలో యవస్థలోనున్న యెట్టి ధీరచి త్తునికైనను, మనోనిశ్చలత్వము తగ్గుననికాని, వీడుననికాని, నుడివినచో నాశ్చర్యములేదు. మెరుపుదీపము వెలుగున గాన వచ్చిన యానారీమణిని, తన మనోహారిణిగ బోల్చికొని, యా రామామణికి వాటిల్లిన ముప్పు దప్పింప నేదియు నుపాయము దోపక, ధైర్యవిహీనుడై నిలచిన రోలో కష్టము మనస్థితము చాలకుండెననిన, వింతలేదు!

క్షణముదనుక నిశ్చేష్టుడైనిల్చుని, చలించియున్న భా వలు మరల శీఘ్రముగ గుమిగూడి యేదేని యాలోచనను స్ఫురింప జేయకుంటచే, రోలో దైవముపై భారము నునిచి.

‘కానున్నది కాకమాన’దనుకొని తలచి, పరుగున వచ్చి బ్లాకీపై బడ నుద్దేశించెను.

బ్లాకీ యంతట, నిరూపకుడు సాహసించనున్న కార్యమును గ్రహించి, పండ్లు పటపట కొఱుకుచు, రోలో నుద్దేశించి,

“తొందరపడకుము—ముందు కొకడుగైనను వచ్చితివేని, మేరీ చచ్చునని నమ్ముము” అనిపలికెను.

శత్రువు పలుకుల నలక్ష్యము చేయుచు, రోలో పిస్తోలు దీసి, చేత బట్టుకొని, నవీన క్రోధావేశుడై, యున్మాదుని వలె గ్రిందుమీదు గమనించక, బ్లాకీపై బడ వచ్చుచుండెను. బ్లాకీ వెంటనే, దుర్బలయగు మేరీని వంతెనమీదుగా, క్రిందనున్న నీట బదిలముగ జారవిడచెను.

* * * * * *

“అయ్యో! నేనుగూడ మీతో వచ్చెదను.”

“జూలియా! నీ కేమి పిచ్చియా యేమి? త్రోవలో నెన్ని యుపద్రవములకు బాల్పడవలసియుండునో తెలియదు. నీవు వచ్చినయెడల చాల యాయాస పడవలసి యుండును.”

లారీ మండపము వాకిట నొక పెద్ద మోటారు నిలచి యుండెను. ఇరువురు పోలీసుజవానులును, హేమోరాగ నను, లందు గూర్చుండియుండిరి. ప్రిన్సీకూడ మోటారు నెక్కుచు, ‘ఇక పోనిమ్ము’ అని బండి నడుపువానితో ననెను. మోటారు బయలుదేర సిద్ధముగనుండెను. అంత పరుగున లోనుండి జూలియా వచ్చి, తాగూడ వచ్చెదనని యనెను. ఆమెకూడ తమతో వచ్చుట మేలు కాదనియు, చాల యిబ్బందులకు లోబడవలసి వ

యు నామె తోడనే యుండి పెరిగిన జూలియా, తన చెలి నెంతో ప్రేమించుచుండెను. మేరీ కూడ, తన బాల్య చెలి యగు జూలియాను పరిచారికవలె జూడక, పూర్వపు యభిమానము, జూపుచు, నెల్ల విషయములు నామెతో జెప్పుచుండెను. జూలియా కడు విశ్వాసముతో నామెవద్ద గొలువు జేయుచు, యజమానురాలి చిత్తవృత్తి ననుసరించి, వినయ విధేయతలతో మెసలు చుండెను.

వేకువ జామున వీచు పిల్ల వాయువులు, సంతోషమున నున్న జనుల కత్యంత హ్లాదకరములై యుండు ననుట నిజమే కాని, శోకాంబుధిని మునిగి యనుమాన తరంగములచే దరుమబడుచున్న జూలియా వంటి వారికి మాత్రము, ఆనంద దాయకములై యుండుటకు మారు, సంతాపకరములై యుండుననిన కేవలము స్వభావమే. అప్పుడే పొడమి, తూర్పు దిగ్భాగంబున నపూర్వకాంతితో ప్రజ్వలించుచుండిన వేగుజుక్కం గాంచిన జూలియా కేలనో హృదయ తాప మధికమయ్యెను. క్రిందనున్న జలముల దృష్టి నిగిడ్చి నిల్చుండిన జూలియా కప్పుడు నీటనే మునుగవలెనో కాని, యామె తలంపులన, వెనుకకు వచ్చి 'మేరీ!' యని కెవ్వున యఱచి, మూర్ఛిల్లి నేల జతికిల బడెను. ఆ కేక నాలించిన ఫ్రేసి పరుగిడి వచ్చి, యామె నెత్తుకొని పదిలముగ మోటారులో బండుకొన బెట్టెను.

'ఫ్రేసీ,—ఏమిది? ఆమె కేమైనది?' అనుచు నెవరో ప్రశ్నించెను.

'నా కేమియు దెలియదు. 'మేరీ' యని మాత్ర మొక కేక వేసినది.' అని ఫ్రేసీ బదులు చెప్పుచు 'ఆమె మూర్ఛిల్లు

టకు గారణమేమై యుండునో కదా?—అచ్చటనే నిల్చి యుండెను'—అనుచు ముందు జూలియూ నిలచిన చోటును జని క్రిందకు జూచెను. అంత వా డాతురతతో 'మేయో! ఇటు చూడుము!!—ఘోరము!!' అని తన వ్రేలితో నీటివైపు జూపెను.

* * * * *

విద్యుద్దీపము వెలుగున నే కన్యాలలామ ముఖబింబము గమనించునంత, రోలో తన సహజ ధైర్యము బాసి మనో నిశ్చలత్వములేని వాడయ్యెనో—ఏ రామామణిని తన చిన్న నాటనుండియు గాఢాను రాగముతో జూచుచు, యామెను రక్షించుటకై తా నెట్టి శ్రమలకు నైన లక్ష్యపెట్టక సమయము వచ్చిన మృత్యు ముఖమునైన నెదుర్కొన వెనుదీయడో—ఆ సుందరి మేరీ, హృదయ హీనుడగు బ్లాకీచే నీట బడవేయబడుట కన్నులార జూచి, యంతరాళమున నుద్భవించిన క్రోధ మోహశోక తాపముల నణపజాలక, రోలో చేతనున్న పిస్తోలును వెత్తి వానివలె గురి చూడకయే కాల్చి, కోటు దీసి యట బడవైచి, తటాలున వంతెనపై నుండి నీటగెం

బ్లాకీ తడవుసేయుక వెంటనే రోలో తీసివేసిన కోటు నొకసారి జేబులలో బరీక్షించి, తనకు లాభకరములగు వస్తువు లాదేమియు లేకుంటచే గాబోలు, మొగము చిట్లించుకొని కోపముతో కోటును నీటబారవైచి, రోలో యెక్కివచ్చిన తన సైకిలుపై నెక్కి చనెను.

'ఈత గొట్ట నేర్చియుండు' అనిన లోకోక్తిని సమగ్రముగ గ్రహించి కాబోలు, రోలో చిన్నప్పటినుండియు నా పని

క్రసామునందాసక్తి గలవాడై యుండెను. [illegible]లో జరుపు
కొనుచున్న దినములలో నాటున పడవ-పందెములలో నెంతయో
ప్రవీణత జూపి, యెల్లరిచే గొనియాడబడుచుండెడు
వాడు. విలాసార్థమై చిన్నప్పుడు నేర్చుకొనిన యీత, రోలో
కిప్పుడెంతయో పనికి వచ్చెను. నీట దుమికి, కొంత దనుక
నస్సి నైపుల వెదకి చూడ మేకి వానికి దగిలెను; అంత రోలో
మోదముతో నామెను పట్టుకొని, యదివరకే యలసి యుం
టచే, అతి కష్టముతో నామెను తీరము జేర్ప యత్నించుచుండె
ను. కాని, కొన్ని గజముల దూరము ప్రయాసపడి యీదుకొని
వచ్చిన పిదప, వాని బడలిక యధికమై బలము తగ్గెను. అతి
కష్టముతో రోలో యంతె, సమీపముననే యున్న వంతెన
కంబము నొకదానిని పట్టుకొనెను.

అట్టియవస్థలో నున్న సమయముననే ట్రెసీ వంతెనపైనుండి
రోలోను చూచి మెయోతో 'త్వరపడుము' అనుచు బల్కె-
ను. పోలీసు వారందరును పరుగెత్తి వారథి దాటి క్రిందకు దిగి
యొడ్డున నిలచిరి. వారివద్ద నొక పెద్దమోటు త్రాడుండినను
వ్రేలై యుండెను. అట్టి యాధారము లేదు కావున నేమి చేయ
వలెనో యని వారాలోచించిరి. ఆలస్యమొనరించినచో ప్రా
ణాపాయము గలుగనున్నది. ఒడ్డున చిన్న తెప్ప లెట్టివియు
లేకుండెను. ఆ రేడుగురు గడపవలసిన యొక పెద్ద పడవయు,
తెడ్లును, మాత్రముండెను. అందరు నేకీభవించి యా పడవను
నీటిలోనికి దిగ్చిరి. పడవలో గూర్చొని, వారంత దమ శక్తి కొల
ది, పడవ గడపిరి. కొన్ని నిముసములలో వారు మేకి రోలోల
మీపించి, వారిరువురను పడవలోనికి దెచ్చిరి.

గనుగొని క్రోధావేశుడై మొగ మెఱ్ఱ జేసి యామెపై దిరుగబడెను. నిద్రాప్రపంచ కారాగార బంధిత ప్రాణ రక్షణార్థము మార్తాండుం డరుదెంచి జీవులకు పునర్జీవన మొసంగుచుండెను.

ఒకదాని వెనుక నొకటిగా రెండు మోటారులును వడిగా పోవుచుండెను. 'ట్రెసీ, ఆమె జీవించునని నీకు ధైర్యమున్నదా?' అని జూలియస్ మరల ప్రశ్నించెను. ముందుబండిలో, మేరీ రోలోలు మాత్రమే యుండిరి. రోలో యామె నాడింబరీక్షించి, మామూలు విధమున నామెకు తెలివి దెప్పించుటకు తనకు దెలిసిన సాధనముల నెల్ల యత్నించుచుండెను. రెండవ బండిలో పోలీసు వా రందరును గూర్చుండిరి. ట్రెసీ బండి నడుపుచుండెను. పోలీసు వారెక్కి వచ్చిన మోటారులో నున్న పెట్రోలు డబ్బా బ్లాకీ విడచిన మేరీ బండికి పనికి వచ్చెను.

మోటారులు పట్టణములోనుండి పోవుచుండ రోలో యొక చోట బండి నడుపు వానితో మోటారు నాపు మని యాజ్ఞాపించెను. రెండు బండ్లును నిలచెను. రోలో దిగి యొక యింటి వాకిట నిలచి, గంట నొక్కి తలపు బిలచెను. ఆ యింటి గోడకు దగుల్చబడి యున్న బల్లపై "డాక్టర్ కెన్నీ" అని వ్రాయబడి యుండెను. లోనుండి కెన్నీ వచ్చి, రోలోను చూచి, యాశ్చర్యముతో 'ఏమి?' యను ప్రశ్నార్థకముగా కనుబొమలు పై కెత్తెను. మేరీ గూర్చి వానితో రోలో కొంత జెప్పి, యావధముల గొని రావలసినదని వేడెను.

అందరును రోలో 'లేబొరేటరీ' చేసుకొనిరి. కెన్నీ తనకు దెలిసిన సాధనముల నెల్ల జేయుచుండెను. మేరీ కనులపై న

రువ కుండెను. డాక్టరు మొగము దించి, కార్యము లేదని తల నూచెను. జూలియా యేడ్చుచు నొకచో గూర్చుండెను. మిస్ట్రీ శిక్కజచ్చి యొక కంబమునకు జేరబడి రెప్ప వాల్చక మేరీ వైపు జూచుచుండెను. కెన్నీ ప్రక్కనే, రోలో ప్రీసీలు నిల్చుని యుండిరి.

"కెన్నీ—ఆమె జీవించుట యసాధ్య మందువా? ఏ విధమునైన బ్రతికింప జాలవా?"

బదులు పలుకక, కెన్నీ పెదవి విరచెను. వాని ముఖము నిదానించుచు రోలో నిల్చునెను.

కొంతసే పాలోచించి, నిరూపకుడు కెన్నీ నుద్దేశించి, "ఎలక్ట్రికల్ రీససిటేషన్ వలన లాభ ముండునా?" అని బొమలు ముడివడ, నడిగెను.

"లాభ మున్న నుండవచ్చును. కాని, నే నెన్నడును యత్నించలేను" అని కెన్నీ యనెను. "అయినను, మన శక్తి కొలది యత్నించి చూచుట విధి! దైవాధీన మెట్లున్న నట్లు జరుగక మానదు."

ఇట్లు వా రాలోచించుకొనుచున్న సమయమున, సెక్రెటరీ రాస్, బిరబిర లోనికి దోసుకొనివచ్చెను. మేరీ చుట్టును మూగి యున్నవారి నొకసారి చూచి, సంగతి గ్రహించి, యాతురతతో డాక్టరు నుద్దేశించి,

"అయ్యో, ఆమెకు తెలివివచ్చినదా?" అని ప్రశ్నించెను.

మొగము పై కెత్తి చూచి, "ఇంకను రాలేదు. బ్రతుకునని నమ్మకము తోచకున్నది" అని కెన్నీ, మెల్లగ ననెను.

ఆ పలుకులు చెవిని పడగనే, రాస్ మొగము వైవర్ణ్యత

నొందెను. కన్నుల నశ్రులు క్రమ్మ దొడగెను. హృదయమున చెప్పరాని శోక దశాసల ముద్భవించెను. వాఁడు రోలో వైపు దిరిగి, "రోలో, నీవును యట్టి యధైర్యమే తోచుచున్నదా? ఏటువైన నామెను బ్రతికించు మార్గము లేదా? అయ్యో, యిమె మృతి నొందవలసిన దేనా? దైవమా, నీ కా ముగ్ధపై నింత కనికరము లేదా?" అనుచు నొక బాలిక వలె గద్గదస్వరముతో బలుకుచు, మేను దీర్ఘముగ జూచుచు, కంట నీటి బిందువుల దుడుచుకొనుచుండెను.

రోలో, కొంతదనుక దీరాలోచనాపరవశుఁడై, కెన్నెరాసుల నుద్దేశించి, "ఆఖరు యత్నము గూడ చేసి చూచెదను" అని యనెను.

వల్లె యని కెన్నీ తల నూచెను. రాస్ సంతోషమును కనబరచి, "ఇక నామె బ్రతుకు మార్గ మున్నది!" అని యని రోలోను భుజముపై దట్టుచు, యేమో యనరాయి పనుల నట్లు చేయక, తత్సమాన భావమునే తన విశాలనయనముల మూలమున వెలిబుచ్చి, "నిన్నెఱిఁగినవా రందరును నీకు కృతజ్ఞులై యుందురుగదా!" యను తాత్పర్య దృష్టితో వానిని చూచుచుండెను.

ధైర్యము చేసి రోలో, ఓబ్రీసీతో, "ఆ సామగ్రి నంతయు గొని తెమ్ము, యత్నించి చూచెదను. అదియే యాఖరు తెరవు! ఎలెక్ట్రిక్ రిససిటేషన్ వలన నామె బ్రతుక వచ్చునని నా కేలాగో తట్టుచున్నది" అని పల్కెను.

ఓబ్రీసీ, లోనుండి "పేటిక" దెచ్చి, తీగెలను, యంత్రమును సరిచూచి, సర్వమును సిద్ధముచేసెను.

పాన్పుపై మేరీ వెలకిల బరుండ పెట్టబడి యుండెను. కంఠశ్రోణులకు దీగెల దగిల్చి, యంత్రమును నడుపుచు, నా విద్యుచ్ఛక్తి ప్రభావ మెట్లు పరిణమించునో యని, గొప్ప యాతురతతో నిదానించు చుండెను. అచ్చట నున్న వా రందరును రెప్పవేయక చూచుచుండిరి. డాక్టరు కెన్నీ, పాన్పుదరి నిల్చిని మేరీ హస్తము బట్టుకొని, నాడి పరీక్షించుచుండెను. టీసీ "మిాటరును" కాపాడుచు, నిరూపకునికి వలయు సహాయ్యము నెల్ల జేయుచుండెను.

నూతనపురుషకు, విద్యుచ్ఛక్తి ప్రభావ మొకప్పు డేమాయు దెలియకున్నను, కాలక్రమమున నిప్పు డిప్పుడు చాల యద్భుత విషయము లెరుక యగుచున్నవి. ఇరువదియవ శతాబ్దమున, కొందరు శాస్త్రజ్ఞులు విశేష శ్రమవలన నీ యద్భుతశక్తిం గూర్చి యనేక సంగతుల గనిపెట్టగలిగి, విద్యుచ్ఛక్తియే జీవ మని బోధించుచున్నారు. మన శరీరములోని రక్తనాడులే తీగెల వలె నీ శక్తిని ప్రసరింపజేయు ననియు, యీశక్తి మన లో వ్యాపించియుండుట వలననే మనము జీవించి యున్నార మనియు, నది నశించుటయే మరణ మనియు, నది సరిగ్గ చాలక పోవుటయే వ్యాధిగ్రస్థతకు గారణ మనియు,—వేయేల, మన శరీరమే యొకవిద్యుచ్ఛక్తిప్రసరణయంత్ర మనియు, రక్తమాంస యుతమగు "బాటరీ" యనియు జెప్పుచున్నారు! రాగివంటి రెండు వివిధ లోహములదెచ్చి, హెచ్చుగ నీళ్లతో గలుపబడిన 'ఆసిడ్' ద్రావకములో నుంచి, యా లోహములకు రెండు తీగెల దగిలించి, వాటి చివరలను దగ్గర జేర్చి కలిపినచో, విద్యుచ్ఛక్తి యుద్భవించును. ఇట్టి శక్తియే మన శరీరములో నున్న

దనియు, దానినే మనము నాడిశక్తి యని యనుచున్నామనియు పెద్దల యభిప్రాయము. ఆకారణమున నిప్పుడు, విద్యుచ్ఛక్తినే మూలాధారముగ గైకొని, వైద్యులు దానిని సర్వరోగ నివారణ సంజీవి వలె నుపయోగించుచున్నారు. మన శరీరములోనే మాంస కండ ద్వారానైనను విద్యుచ్ఛక్తిని బ్రసరింప జేసినచో, నా కండరము వెంటనే యుబ్బి, పెద్దది యగుట గాని, లేక తగ్గి, చిన్నది యగుట కాని తటస్థించును. ఇందు మూలముననే గూనివంపు కూడ గుదర్చగలుగుట సాధ్య మగుచున్నది. శరీరమునందే భాగమునందైనను, రక్తము గూడు కట్టియున్న యెడల, నచ్చట "పోజిటివ్ పోల్"ను తగిలించినచో, విద్యుచ్ఛక్తి యచ్చటి రక్తమును పలుచనజేసి, యా ప్రదేశము నుండి దానిని దీసివేసి, "నెగటివ్ పోల్" తగల్చబడి యున్న చోట జేర్చును. ఇట్లే యనేక రీతుల మనము విద్యుచ్ఛక్తి ప్రభావమును ప్రత్యక్షముగ జూడగలుగు చున్నాము. యంత్రమూలమున నిట్టి యపూర్వ ప్రతిభావిశేషములు గల నాడిశక్తి (విద్యుచ్ఛక్తి)ని శరీరములోనికి బంపగలిగిన మానవుడు ప్రకృతిలోని యెట్టి విచిత్రముల నైన నెప్పుడైన యొకప్పుడు కనుగొన గలుగుటకు సమర్థుడే గదా!

రోలో యా విద్యుచ్ఛక్తి యంత్రము నుపయోగించుటకిదియే తొలిసారి. మొదటి ప్రయోగము మేరీపైనేజేయవలసి వచ్చినందున, నాయనయాతురతకు మేరలేకుండెను. తన యత్నము జయమందునో లేదో యను శంక గూడ గొట్లాడుచుండెను. కడుసాహసముతో నాయనయంత్రమును నడిపించుచుండెను.

అంత లేబొరేటరీలో నున్నవారి కందరకును కూడ నా

శ్చర్యము గొలుపునట్లు విద్యుచ్ఛక్తి ప్రభావమున గొన్ని నిముసముల పిదప మేరీ కన్నులను విచ్చెను.

“కెన్నీ! చూడుము—ఆమె కను రెప్ప లదరుచున్నవి!” అని రోలో పలుకుచు రెట్టింపు ధైర్యముతో యంత్రమును నడపుచు, విద్యుచ్ఛక్తినామె శరీరములోనికి బ్రసరింప జేయుచుండెను. శరీరము వేడెక్కె యాబాలిక గుండెయు యథావిధి నాడ దొడగెను కెన్నీ యచ్చెరు వంది, క్షణముదనుక నేమియు నమ్మ లేకుండెను. అంతయు గారడీవలె దోచుచుండెను.

తీగలను వదల్చి, రోలో చిరునవ్వునవ్వి, “కెన్నీ—ఎలెక్ట్రికల్ రీససిటేషన్’ ప్రభావము జూచితివా?” యనుచు, “ఇక నీ వౌషధముల నెక్కించి చికిత్స జేయుము, ప్రమాదము దాటిన ది” యని పల్కెను.

పిమ్మట మేరీ హస్తము నందుకొని నాడి పరీక్షించి, రోలో యామె వైపు జూచుచుండెను. మేరి చిరునగవుతో నాతని హస్తము బట్టుకొని, బలహీనతతో నదుముచు రెప్ప వాల్చక నిరూపకుని జూచుచు, కన్నులనెన్నియో భావముల వెలిబుచ్చెను.

# కోటీశుతనయ

## ఐదవ ప్రకరణము

## స్త్రీ హృదయము!

---

గీ. "సహజముగ మగవాఁడు పాషాణ హృదయుఁ;
డబ్జలోచనా సాహచర్యమునఁ గాని
వాని హృదయము మృదులత వడయు; దమృత
కరస్పర్శరహితాబ్జ కాంతమ్ముబోలె."

—కోకిల.

"ఎచ్చటి కేగియుండునో చెప్పఁగలవా?"

"నా కెట్లు తెలియును?"

విస్మృతచిత్త ప్రభావమును నించుమించుగ మేను చెమట పుట్టిన దినపు ప్రసక్తిలి యగునాటి సంధ్యాహ్నము, మోహనా యువుప్రమ భటులను వెంట నిడికొని, ఫిలీ సహాయులు కేఁగి, టామీని ఖుదిగ జేయు నుద్దేశముతో బిల్లీని పిలిచి, "టామీ యెచ్చట?" యని యడిగెను.

బిల్లీ—టామీ యెవరు?

మేఘా—టామీ యనువా డెవ్వడో యెరుగవా? ఆ పేరు గలవా డెవ్వడును హాస్టేలుకు నిన్నటి దినమున వచ్చి యుండలేదా?

బిల్లీ—నాకు జ్ఞాపకమున్నంతవరకు నట్టివా డెవ్వడును లేఁడు.

మే—నీవు నిజమే పలుకుచున్నావా? పోనిమ్ము, నిన్న నడ్డ
రాత్రిమున నెవరైన నిచ్చటికి వచ్చిరా?

బి—నలుగు రైదుగురు వచ్చియుండిరి.

మే—వారిని నీ వెరుగుదువు గదా?

బి—ఎరుగుదును.

మే—నేను నీ మాటలను నమ్మి చేయుచున్నాను. వా రెంతవరకు
నిచ్చట నుండిరి?

బి—రెండు జాములవరకు నుండిరి. ఒకడు రాత్రియంతయు
నుండి, వేకువ నేగెను. మిగిలినవా రెప్పుడేగిరో తెలియదు.

మేయోరు కొంచెము కోపగించుకొని, జవానులను పిలిచి,
హోటేలు నంతయు వెదకి రావలసినదని యాజ్ఞాపించి, మరల
ప్రశ్నింపసాగెను.

మే—వారిలో నెవడైన రాత్రి యధికముగ దాగియుండెనా?

బి—అందరును మాంత్రికులగనే పుట్టిరని నా నమ్మకము.

మే—అబ్బా! కేవల మసత్యము. ఒకడు నిన్న తప్పత్రాగి
యుండెను. నా కాసంగతి తెలియును. వాడే టామీ.
నీవు వాని నెరిగియు మరుగు పలుకుచున్నావు. నిజము
చెప్పవలయు—లేనిచో, నీకును ముప్పు వచ్చును.

బి—నా కేమియు తెలియదు. రాత్రి వచ్చినవారిలో టామీ
యనువా డెవ్వడును లేడు.

మే—ఐన, వారల పేరుల జెప్పుదువా?

బి—అందు కభ్యంతర మేమి? (అనుచు నేదో యొక హస్త
పుస్తకమును దీసుకవచ్చి, చూచుకొని) నోక్స్, వాల్టర్
టామ్సన్—నెడ్ మొదలగువారు.

మే—పోనిమ్ము, అం దెవరికైన చెము దున్నదా?

బి—లేదనియే నే ననుకొనుచున్నాను. రూఢిగ నా కేమియు తెలియదు.

మే—వీ రందరును తరుచుగ నిచటికి వచ్చుచుందురా?

బి—లేదు.

మే—ఇంతకు ముం దెప్పుడైన వచ్చిరా?

బి—ఒకటి రెండు సార్లు వచ్చియుండిరి.

మే—సరియే, ఈసారి వా రిచ్చటి కెప్పుడయిన వచ్చునట్లు తటస్థించినచో, నాకు వెంటనే వర్తమాన మంపుదువా?

బి—తప్పక కబు రంపెదను.

మే—మరచితిని, నేటి వేకువజామున నొక స్త్రీ గానని యంటివి. వా రెచ్చటి కేగియుండునో, చెప్పగలవా?

బి—నా కెట్లు తెలియును?

ఇంతలో జవానులు తిరిగివచ్చి హోటేలు నంతయు వెదకినను వారికి గావలసినవాడు కానరాలేదని మేయోతో విన్నవించిరి. తన శ్రమ వ్యర్థమాయెనని యిన్స్పెక్టరు చింతాకు పడెను, చేయునది లేక, జవానుల దోడ్కొని హోటేలునుండి మరలెను.

పోలీసువా రేగిన పిదప బిల్లీ తనలో నవ్వుకొని, లోని కేగి, "నెల్లీ—నెల్లీ—" అని బిగ్గరగ పిలిచెను. ఆ పిలుపు విని, లోనుండి స్త్రీ యొకతె వచ్చి ముందు నిలిచెను. నెల్లీ ముప్పది యేండ్లకు మించిన వయసుగలది యయ్యుంగూడ యిరువది యేండ్ల జవ్వని వలె నగుపడును. కడచిన రాత్రి టామ్ వచ్చి భోజనమునకు గూర్చున్నప్పుడు గళాసుతో ముందు

వానికి బ్రాంది నొసగిన దీమియే. సామాన్య స్త్రీల కన్న కొంచెము కురుచదయ్యె. సంపూర్ణ యంగసౌష్టవము కలిగిన నెల్లీ యందకత్తెలలో నెన్నదగు యువతికాని, కురూపికాదు. గోధుమవన్నె కలిగి, తళుకైన నిడుపుగ బెరిగిన జుత్తును సొగసుగ గత్తిరించి, మీదకు నెత్తిపెట్టి, పన్నెలతో నుంగరముల కొప్పువలె నగుపడునట్లు సరి జేసి, గులాబీలతో నలంకరించుకొని, నెల్లీ తెలుపు గౌను ధరించి. ఊలుతో నగ మల్లిన మేజోడును చేత బట్టుకొని, చిరునవ్వుతో వచ్చి బిల్లీ యెదుట నిలబడెను.

"నెల్లి, నీ వనినది నిజమే!"

"ఎట్లు తెలిసెను?"

"ఇప్పుడే పోలీసువారు వచ్చి పోయినారు."

"ఇంకను వానిని గూర్చి నా కేదో భయమే!"

"ఏమి? ఈసరికి టామీ స్టీమరు నెక్కియుండడా?"

* * * * *

నాటి యుదయము సుమారు సూర్యోదయ సమయమున రోజాబ్లాకీలు వారి స్వగృహ మగు 'రావెన్ రెస్టు' మందిరమున నొక గదిలో గూర్చుని సంభాషించుకొనుచుండిరి.

రో—నాథా, అంతకు దప్పు, వేరు తెర వేదియు గానరాలేదా? ఒకవేళ నామె స్మృతి నొందినచో నే మగును?

బ్లా—నీవలెనే, నేనును, చాలాసేపాలోచించితిని. మేకీ కెట్టి హానియు గూడ జేయుటకు నాకు మనసొప్పలేదు. కాని యీ తరుణమున నింకెట్లు తప్పించుకొనుటయో నాకు దెలియలేదు. ఆయుధపాణినై రోలో నా మీద

ము వచ్చుచుండెను. వంతెనపై నుండి క్రిందకు జూడ, జలచలనము చాల మందగమనమై యగుపడెను. వంతెన యెత్తుగలది కూడ కాదు. ఆమె చే నీట జారవిడచిన యంపిల, సహాయ ముండదని తోచినది. అదియునుకాక, రోలో యామెను కాపాడుటకై నీట దుమికె నని, నాకు తెలుసును. ఆమె కేమైనదియు నిప్పుడు 'ఆసుపత్రి' కి జనిన దెలియవచ్చును.

రో—నీ వేమనుకొనిన ననుకొనుము కాని, నా కేలాగో యీ బాలికపై నొకవిధ మగు మక్కువ కలదు. ఆమెను తలచికొనినపు డెల్ల నా హృదయము చలించి కరుణా రస భరిత మగును. పాప మా ముగ్ధ కిప్పు డేమైనదో!

బ్లా—(నవ్వుచు, దన యర్ధాంగి నోరచూపుల జూచుచు) నీ హృదయము చాల మెత్తనిది. నీ వెగనిపై దప్పు. న న్నులకై నీ దయారస ముప్పొంగుచుండును!

రో—(చిరునవ్వుతో) హాస్యముకాదు. నిజముగనే యనుచున్నాను. పాప మామెపై నాకు చాల జాలి కలుగుచున్నది.

ఇట్లాలుమగ లిరువురును వాదించుకొనుచుండిన సమయమున నొక పురుషుడు వడి వడి వచ్చి, వాకిట నుండిన సేవకునిచే లోనికి గబురంపెను. గదిలోనికి రావలసినదని యనుజ్ఞ నీయ, నా వచ్చినవాడు వెంటనే లోనికి వచ్చి, బ్లాకీ కెదురుగ నిలచెను. రోజా వాని నొకింత సేపు నిదానించి,

"టామీ, ఏమ ట్లగుపడుచున్నావు? చాల తొందర పనిపై వచ్చినట్లున్నావు? నీ యజమానురాలి కెట్లున్నది?" అని యడిగెను.

టామీ—(తృళ్లిపడి) ఏమి? ఆమె కేమివచ్చినది? మేరీ మీ వద్ద లేదా?

స్లాక్—లేదు: చేతిక్కిన పక్షి యెగిరిపోయెను.

టా—(ఆశ్చర్యముతో క్షణముదనుక దన యజమానుడగు స్లాకిని చూచి) అయిన, నాకు చాల ముప్పు రానున్నది? ఆమె గృహమున నుండెనుకదా యని, నేను తోటకిదివరకును పోలేదు. నేటితో నామెయొద్ద కొలువుండుట యంతమొందెను.

రోజా—ఏమి? ఇప్పుడు పోయి, యాలస్యమయినందుకు క్షమాపణ జెప్పుకొనుము.

టా—మీవలన నాకేమియు భయములేదు. ఆమె చాల యమాయికురాలు!

రో—(నవ్వుచు) అటులనా? ఇప్పటికిని యా బాలిక నిన్న బగ రుగిగనే భావించుచున్నాదా?

టా—నాకు బ్రహ్మచము డని ప్రమాణం యనూ హా.

స్లా—టామీ, ఆమెవలన హాని లేకున్న నీ కింక భయమేల?

టా—నెల్లీ నాకొక సంగతి చెప్పినది. ఆమెలుల నే నేమియు లక్ష్యము చేయలేదు. కాని యిప్పుడది నిజమని విశదమగుటచే భయమగుచున్నది. నిన్నరాత్రి యెవడో నావద్ద చాలసేపు కూర్చుండి ముచ్చటించెనట. నాకు నిద్రవచ్చినప్పుడు వాడు నా జేబులోనుండి యేమో సంగ్రహించినటుల నెల్లీ యనుమానించినది.

స్లా—పైవిలాసమువ్రాసి నీకొక కార్డు నొసగితిని. అది యేది?

టా—నావద్ద లేదు. అదియే వాని చేతిలో బడినది.

బ్లా—(కొంచెమునే పాలోచించి, యేదో తనలో సణుగుకొను చు) సరియే; అట్లైన, నిన్నా టేర్రిసీ కనిపెట్టియుండెను. నిన్నటి రాత్రి హాంటేలువద్ద నిన్ను గలసికొనినప్పుడు, చీకటిలో చెట్లనీడను నా కెవడో యొక పురుషుడు తచ్చాడుచుండినట్లుల శంక పుట్టెను. వాడే టేర్రిసీ యై యుండనోపును.

టా—అయిన నా కిప్పుడు తెరు వేది?

బ్లా—అన్నట్లు, నేడు యింకొక గంటన్నర లోపున నొక స్టీమరు ప్రయాణ మగుటకు సిద్ధముగ నున్నది. ఒక వారము దినము లైన నీ వీ యూరినుండి వే రెచ్చటికైన నేగుము. ఈలోపున నీకు నే నన్ని విషయములను తెలియ జేతును. ఆపిమ్మట నీవు నా కొక ముఖ్యకార్యము జేసియవలసియున్నది. నా సలహా యిదియే! లేకున్న నీకు శిక్ష తప్పదు. పొమ్ము. నీకు వలయు ద్రవ్యము రోజా యిచ్చును. తీసికొని వెంటనే చనుము. (అనుచు రోజా వైపు దిరిగి, యామె కేమో చెప్పి) ప్రియే, నాకు వేళ మించిపోవుచున్నది. మేకి సంగతి యేమైనదో కూడ దెలిసికొనవలెను. ఆఫీసును యింకొక యరగంటలో జేరవలెను (అనుచు దుస్తుల మార్చుకొనుటకు వేరొక గదిలోని కేగెను.

* * * * *

నాటి సాయంత్రము రోలో, మేకీ, జూలియాలు మువ్వురును 'లాలీ మంది' రోద్యానమున నొక పూ పొద వ

వేయబడిన చలువరాతి కుర్చీలపై సుఖాసీనులై ముచ్చట
లాడుకొనుచుండిరి. మేరీ కూర్చుని యుండిన పీఠమున మెత్తని
దిండ్లు వేయబడియుండెను. ఆమెకు నీటిగండము దాటి, యింక
నిండుగ నొక దినమైన కాలేదు; కావున నా బాలిక యింకను
తన యొప్పటి యారోగ్యస్థితికి రాలేదు. అందుచే నామె దిండ్ల
పై నొత్తిగిలి కూర్చుండెను: కాని, వ్యాధిగ్రస్తయై బలహీనను
గా నున్నటుల గానరాలేదు. మురియించి వీచుచున్న పిల్లవా
యువుల నప్పుడప్పుడు పొగడుచు, చేతికందుకొనివచ్చిన పొద
రింటి చిగురుటాకుల విలాసార్థము కోసి యూడుకొనుచు, సంభా
షణలో నవ్వులాట మాటలేవేని వెలువడిన, నందరును యు
ప్పొంగా నవ్వుచు, వారా యారామమున చాలసేపు వరకు
గాలయాపన మొనర్చిరి. మేరీకోలోల కన్న, జూలియా యు
త్సాహ మెక్కుడుగ నుండెను. ముగ్గురును తరుణవయస్కలు
—యవ్వనులు—లేబ్రాయలు—తలిదండ్రులు లేని యనా
థలు—అవివాహితలు—మిత్రులు. కాలము మిక్కిలి యను
కూలముగ నుండెను. సంధ్యాసమయము. మబ్బు లేని యాకస
ము. మెల్లగ వీచు గాలి. శోభావంతమగు సుందరోద్యానము.
కావున వారొక విషయమై కాని, యొక యుద్దేశముతో గాని
మాట్లాడుకొను చుండుట లేదు. వారి సంభాషణ క్షణమున
కొక విధముగా మారుచుండెను. మంచుపై జారునట్లు పరుగిడు
చుండెను; ఆటంకము లేదు—నిలకడ లేదు. స్వేచ్ఛగా, సం
తోషముతో నా ముగ్గురును తమ యిచ్చ వచ్చిన రీతి విచ్చ
లవిడి ముచ్చటించుకొనుచుండిరి.

కొంతసేపటి కచ్చటికి సెక్రెటరి రాస్ వచ్చి, "ఆఫీసు

భాగట్టా"ల చేప్పా మేరీ నడిగి, కనుగొని, కొన్ని కాగితముల పైని నా యుంచిద సంతకములు దీసికొని, యాఫీసు ముగించి, స్వగృహమున కేగుటకు సెలవు దీసికొనెను.

"రాస్, నీ దేహములో నస్వస్థతగా నున్నదా యేమి? నిద్దుర లేనివాని వలె నీ కన్నులు లోతుకు బోయి కళకాంతులు లేక యున్నవి." అని సెక్రెటరీని చూచుచు రోలో మెల్లగ బలికెను.

"నా దేహారోగ్య మేఁనోచెడు చున్నది. రాత్రి నిద్దుర పట్టకున్నది" అని రాస్ నవ్వుచు పల్కెను.

"ఆఫీసు పని యెక్కువగానున్నది కాబోలు; పగలెల్ల నిచ్చట నే యుండును. అందుకు తోడు నా స్వంత చిక్కులాయనను కలవర బెట్టుచున్నవి. పాపము! ఆఫీసులో నుండలేక, నాకు వాటిల్లిన యపాయమును విని లేబొరేటరీకి పరిగెత్తి వచ్చెను!" అని మేరీ యనెను.

"ఉదయమున కదూ?—అవును. అప్పటి కింక విద్యుచ్ఛక్తి యంత్రమును యత్నించ లేదు. నిజముగ రాస్ యాతురత చాల యధికముగ నుండెను. ఆడుదానివలె నిన్ను జూచి కన్నుల నీరు దెచ్చుకొనెను. ఉద్యోగికిని, అధికారికిని యట్టి సంబంధ మున్నకదా మెప్పు!" అని రోలో పల్కెను.

"రాస్, ఇంటికి బోవుటకు నీ కాలస్య మగుచున్నది కాబోలు? నీ విక వెళ్లవచ్చును—" అని మేరీ సెల వొసగెను.

జూలియా యెవరితోడను మాటలాడక, కొంతవనుక నస్తమించుచుండిన సూర్యుని జూచుచు, గూర్చుండెను. అంత మేరీ యామె నుద్దేశించి, "చెలీ జూలీయా, తదేక ధ్యానము

తోన క్లేశము కనిపెట్టుచున్నావు?" అని యడిగెను. మేరీ వైపు దిరిగి యా చెలికత్తె పక్కున నవ్వి, "ఏమియును లే"దని తల నూచెను.

మేరీ యంతట రోలో వైపు దిరిగి, "నీ 'జూనియరు' నెటకు బంపితివి? ప్రెసీ కానరాకుండుట జూలియా కేమియు మనస్కరించకున్నది" అని చిరునవ్వుతో ననెను.

"చెలీ, ఏ మంటివి? ఇట్టి పరియాచకము లేల యాడెదవు? నాకు ప్రెసీపై నేల—"

అని యింక యేమో యనబోవుచుండ, మేరీ నవ్వి "పోనిమ్ము; జూలియా, అయిన నీ కా కోప మేల?" అనెను.

ఒకరి నొకరు చూచుకొని యా బాలికలు పక్కున నవ్విరి. రోలో లేచి నిలువబడెను.

"నా కొక చిన్న పని యున్నది. నే బోవలెను. ప్రెసీ నా కొరకై యిచ్చటికి వచ్చినయెడల, నా యింటికి బంపుము. ఇంటి వద్ద కూడ నేను లేకున్నచో, నా లేబొరేటరిలో నుండునని చెప్పుము" అని మేరీతో నని, "క్షమింపుము, అవసర మగు పని యున్నది. లేకున్న, నా కిచ్చట గూర్చుండుట చేదు కాదు."

ఇట్లు పలుకుచు, మందస్మితవదనారవిందయై తన వైపు విదానించుచుండిన యా యరవిందలోచన నొక్కసారి తేరిపార జూచి, తనవైపు జాపబడిన యామె కరకమలము నందుకొని, మెల్లగ నదిమి, యొక్కసారి చిరునవ్వు నవ్వి, "సెలవు" అని పలికి వెనుదిరిగి రోలో యరుగుచుండెను.

* * * * *

విలువగల యుడుపుల దొడుగుకొని, యొక చక్కని యుంగరమును జేబులో నుంచుకొని, బంగరుపోచీ వాచీ చేతికి గట్టుకొని, సుగంధపరిమళ ద్రావకముల జే రుమాలుపై బోసికొని' పంట్లాము జేబులో గొన్ని 'బాంకునోటు' ల నిమిడ్చి, చే బెత్తము నిటు నటు నాడించుచు, యవ్వన సూచకముగా నంకురించుచుండిన సూనూగు మీసముపై జేయి వేసి తదేక ధ్యానముతో దువ్వుకొనుచు, నొకానొక యువకుడు మెల్లగ నడచుచు, నాటి సంధ్యవేళ బిల్లీ హోటేలు వైపు జనుచుండెను. సుమా రిరువదియైదేండ్లకు పైబడని తరుణప్రాయుడగు యా పురుషుడు మిక్కిలి చక్కనివాడై, చపలచిత్తలగు జవ్వనుల కన్నుల కొక భూలోక మన్మథుని వలె గన్పట్టుచుండెను.

బిల్లీ హోటేలు జొచ్చి, యా యందకాడు తనకు వలయు నిమ్మరసపర్బత్తు నొక గళాసు ద్రాగి, యచ్చటివారితో నొకింత దనుక గుశల సంభాషణ జేసి, బిల్లీతో చాలసేపటివరకును మాట్లాడుచుండెను. అప్పుడు బిల్లీ నిజ సతి యగు నెల్లీ ప్రవేశించి, వానిపై పేదృష్టి నిగిడ్చి చూచుచు నిలచెను. బిల్లీ, యా పురుషుని కంత, నెల్లి కెరుక జేయుచుండ, యింతలో నెవరో వచ్చి వానికొఱకై చావడిలో గూర్చుని యున్నారని తెలియరాగ, 'నిప్పుడే వచ్చెద' నని దెల్పి బిల్లీ గది వీడి వెలుపలికేగెను.

నెల్లీని చూచి నవ్వుచు నా పురుషుడు కూర్చొన వలసినదని వేడ, నామెయు వానితో ముచ్చటింప గుతూహల పడుచుంటచే, నొక యాసనముపై జతికిల బడి ముసిముసిగా నగ జొచ్చెను.

బిల్లీ చాలసేపటి వరకును మరల నా గదిలోనికి రాలేదు. హాలులోనికి వచ్చిన పరిచితులతో గాలక్షేపము జేయుచు, వీరి మాటయే మరచెను.

అట్టిటు లొకింత దనుక మాటలాడుకొనిన పిదప, నెల్లీ యా నూతన పురుషునితో క్రొత్తదనము వదలి, చిరకాల పరిచయము గలవానితో పగిది, ముచ్చటింపదొడగెను.

"ఛార్లెస్, నీపరిచయము కలుగుట నాకు చాల యానందము నిచ్చుచున్నది" అని నెల్లీ యాయువకుని నుద్దేశించిపలికెను.

"సుందరీమణీ, నీవంటి యందకత్తెను చూచు భాగ్యము లభించినందువలన నే నెంత సంతసించుచున్నానో నీ వెరుగవు. నేడు నిజముగ నాకు సుదినము. నే నెప్పుడు నింత యాహ్లాదపరవశత నెరుగను" అని మోహదృష్టుల నామెపై బరపుచు ఛార్లెస్ చేరబడి గూర్చునెను.

చపలచిత్త యగు నెల్లీ వేగిరపాటు తీవ్రమై యుండెను. తన యందము నొక సుందరపురుషుడు నేర్పుమై బొగడుచున్నాడని గ్రహించి, నెల్లీ లోలోన తన రూపురేఖావిలాసముల కెంతయు గర్వించుచు, మైమరచి, ఛార్లెస్‌తో సరస సల్లాపము లాడ మొదలుపెట్టెను. వానికి మాత్రము మేలనో యామె కుండిన వేగిరపాటు లేకుండెను. సమయోచితపు మాటల నాడుచు, నామెతో గలసి నవ్వుచుండెనే కాని, వా డొకింతయు జలింపకుండెను. నేర్పుతో నెల్లీ చూపెట్టుచుండిన ప్రేమచిహ్నములను మాత్రము వా డేమియు దిరస్కరించ లేదు. హెచ్చరిక జేయుచునే, ముచ్చటించుచుండెను. వా డేమైన యవ్వనరాగము వెలిబుచ్చునేమో యని నెల్లీ నిరీక్షించుచుండెనే కాని,

ద్వేషమెయు బయలుపడ కుండెను! ఒకరి నొక రెరిగి యింక గంటయైన కాలేదు. అంతలోనే, వారి పరిచయము పరిపక్వ మంది, స్నేహముగ పరిణమించెను. కాని, యింక నన్యోన్యాను బంధ ప్రేమముగా మారలేదు.

*　　*　　*　　*　　*

రోలోనివాస గృహమున చాల రాత్రి వరకును, రక్షక భటాధ్యక్ష, నిరూపకు లిరువురును వివిధ విషయముల గూర్చి మాటలాడుకొని, లాలీ మందిరమున నిన్న యల్లరుల జేయుచుండిన హంతకు డెవ్వడై యుండునో యని యాలోచించు కొనుచు, వానిని బట్టుకొను మార్గముల జర్చించు కొను చుండిరి.

మే—టామీ నేడు పనికి రాకుంటకు కదియే కారణ మందువా?

రో—మరేమి? ఈ యూరిలోనే యుండడని నా యభిప్రాయము. వాని కెల్లో యాచోకీ తెలిసినది. తోడనే పలాయితుడైనట్లు తోచుచున్నది.

మే—అంతియె కావలెను. వేరుగా తలచుటకు అవకాశము లేకున్నది. ఈ చుట్టు ప్రక్కల నెక్కడను లేడనుట నిశ్చయము. అన్ని చోట్లను వెదకించితిని.

రో—బిల్లీ హోటేలుపై నొక కన్ను వేసి యుంచుట యెందుకైన మంచిది. బిల్లీకి కొంత తెలిసి యుండవచ్చును.

మే—అవును. బిల్లీ నడవడిక నాకును, అనుమానాస్పదముగనే యగుపడినది. రోలో, అట్లయిన టామీ నిజముగా దోషి యనియే నీ యభిప్రాయమా?

రో—అందు కభ్యంతర మేమి? స్వయముగ వాడేమియు జేయ లేకున్నను—చేయకున్నను—వాడీ కుట్రలో జేరి యున్నాడని మాత్రము రూఢిగ దెలియఁగలను.

మే—(ఆలోచించుచు) టామీ యెంత యమాయకుని వలె ప్రవర్తించుచుండెను! తొలుత నీకు వానిపై గొంచెమైన ననుమాన ముండెను. కాని, నాకేమియు లేకుండెను. వాడు నిర్దోషియనియే వానింజూచి నే ననుకొనుచుంటిని.

రో—అటు లగుపడువారే, యెంత పనికైన నేనుచేయరు.

* * * * * *

లాలీ గారి యాకస్మిక మరణ వార్త వార్తా పత్రికలలో బ్రచురింప బడుటయే గాక, మేరీ సంతకముతో లేఖల మూలమున బంధు మిత్రుల కెల్లరకును తెలియ జేయబడ, నందరును "పరామరిక" యుత్తరముల వ్రాసి, మేరీ నోదార్చుచుండిరి. పట్టణమునకు సమీపమున నుండువారు స్వయముగ వచ్చి యా బాలికను చూచుచుండిరి.

రోలో సెలవు దీసికొని, యానంద మందిరా రామము వీడ్కొనిన పిదప, నొక యరగంట దనుక జాలిగూ మేరీ లా పూదోటనే కాలము బుచ్చి, పిమ్మట గృహము లోని కేగిరి. కెన్నీ యప్పుడే వచ్చి, మేరీని చూచి, రేగెను.

అప్పు డొక సేవకుడు మేడ మీదకు వచ్చి, యెవరో బంధుగులు వచ్చియున్నారని మనవి చేసెను. తోడనే మేరీ లేచి, వారి నెదుర్కొనుటకు సిద్ధపడుచు, నా వచ్చిన వారిని మేడపైకి దీసికొని రావలసినదని సేవకుని కాజ్ఞాపించెను.

ఇంకొక రెండు నిముషములలో మేరీ తన మేనత్త యగు "పాలీన్" కౌగిట బడి యేడ్వదొడగెను. బాలిక నోదార్చుచు, పాలీన్, కంట నీరు దెచ్చుకొని, తా గూడ దుఃఖిత యయ్యెను. వీ రిద్దరిని చూచి "సోఫియా" బిక్క జచ్చి, కొంచెము దూరముగ నిలచెను. "పీటరు" సామానుల సరిచూచుచుండెను. సోఫియా పీటరు లిరువురును పాలీన్ బిడ్డలు. సోఫియా యొక పదునాల్గేండ్ల చక్కని బాలిక. పీటరు ముప్పది యేండ్ల యువకుడు—'పార్లమెంటు మెంబరు' వాని కింకను పెండ్లి కాలేదు !

రాత్రి భోజనములు ముగిసిన పిదప, మేరీ తన బంధువులతో గొంతసేపు లోకాభి రామాయణము ముచ్చటించి, వారివద్ద సెలవు దీసికొని, తన శయనా గారము జొచ్చెను. పాలీన్ సోఫియాలు కూడ రెయిలు ప్రయాణపు టలసటచే వేగముగనే సెజ్జల జేరిరి. పీటరు మాత్రము చాల రాత్రివరకు మేలుకొని యుండి, కొంత సే పేదో పత్రిక జదివి, యటుపై దన పడక గది జొచ్చి, యేమో యాలోచించుచు, నొక కుర్చీపై గూరుచుండెను.

పీటర్ చాల కాలము నుండియు మేరీపై హద్దుగాని వలపు గలిగి యుండెను. ఆ బాలిక గూడ వాని నభిమానముతో నిలకించుచుండెను. కాని ప్రేమించలేకుండెను. ఒకప్పుడు పీటరు ధైర్యముచేసి, బాలికతో [illegible] విషయమై ప్రస్తావించెను. ఆ వృద్ధుడేలకో తన మనస్సు [illegible] ! [illegible] కీయ సమ్మతించలేదు. సాహసించి పీటరు [illegible] నెన్నడును కదపి చూడలేదు. ఆ ముగ్ధ రోలోపై దన మానసము నిల్పియున్నదని పీటరుకు

గూడ దెలియును. ఆ కారణమున పీటర్, రోలో నొక వైరిగా జూచుచుండెను. రోలో నామె నెరుగ కుండినచో, పీటరు నవశ్యము పెండ్లియాడి యుండును కదా యని వా డూహించు కొనుచుండును. ఒక నిరుపమాన సొగసుందనము గల గుణనిధి యగు కన్యకామణి రోలో మూలమున తనకు జిక్కకున్నది గదా యని, పీటరు నిరూపకునిపై గినుక వహించి యుండెను. పాప మీ సంగతి రోలో కణుమాత్రమును దెలియకుండెను.

నాటి రాత్రి మేరీని చూచి, యామె లావణ్యమున కచ్చరువడి, యా ముద్దుగుమ్మ యెట్టులైన దనకు లభించునా యని పీటరు వే విధముల దనలో నాలోచించుకొన దొడగెను. మేరీ వంటి సుందరీమణి యెట్టి ధీర చిత్తునైన జలింప జేయుగల దనిన వింతకాదు. సామాన్యపురుషు డగు పీటరు, సుందరిపై గన్ను వేయుటలో నాశ్చర్యము లేదు. వరుసకు మేరీ వానికి మరదలు! దగ్గర చుట్టము. అందమైన పిల్ల. తలిదండ్రులు లేని యనాథ. పీటరు కూడ దరిద్రుడు కాడు. విశేష ధనవంతుడు, విజ్ఞానవంతుడు. కన్ను, ముక్కు తీరు గలవాడు. మేరీ తన్ను భర్తగా నేలుకొనిన, పీటర్ జన్మమున నింక నెరవేరని కోర్కెలుండబోవు! ఆ బాలికను చూచిన దాదిగా, పీటరు మన్మథ వికారుడై, యోర్వలేని తాపమున బడి, పడకగదిలో పిచ్చివాని వలె నేదో యాలోచించుచు గూరుచుండెను.

వల పొక తాపకారి యగు యానందము—ఆనందదాయక మగు తాపము. ఆరాగ మొక యుడుకు మిఠాయి వంటిది. నోట బెట్టుకొనినచో నాలుక కాలి, చురుకును—కాని రుచ్యమై మధురముగ నుండును. అది యానందమ్మైన మంచి,

హృదాగ్ని నోల లాడించును—లేదా, తాప దవానలమున గాల్చి, వేధించి తహతహ లాడించును.

పీటర్ కన్నులకు మేరీ మోహనాకారము దక్క వేరే దియు గానరాకుండెను. కొంతసేపైన పడక బరుపుపై నాతడు మేను వాల్చెనే కాని, మైమరచి నిద్రింపలేకుండెను. కలలలో గూడ నా ముగ్ధ రూపమే గానవచ్చుచుండెను. అది గమను నకు వానికి నిద్రాభంగ మగుచుండెను. కలనుండి త్రుళ్లిపడి లేచి, గదిలో దా నొక్కడే యున్నట్లు విశదముగా నున్న రని వేడి నిట్టూర్పు పుచ్చుచుండును. నిద్దురలో కూడ నామె నామమే స్మరించుచు, "మేరీ" యని పలవరించుచుండును.

# కోటీశు తనయ

## ఆఱవ ప్రకరణము

### " తుపాను "

---

"The sea is the largest of all cemeteries, & its slumberers sleep without monuments... .....The same waves roll over all, the same requiem by the minstrelsy of the ocean is sung to their honour..... there, unmarked, the weak & the powerful, the plumed & the unhonoured, will sleep on until awakened by the same trump, when the sea shall give up its dead."

*Mantell.*

బ్లాకీ రోజా లిరువురును టేబిలు దరి ప్రాతఃకాల ఫలాహారమునకు గూర్చుండిరి. బ్లాకీప్రక్క నొక కుర్చీపై "కూలీ" తోక ముడుచుకొని కూర్చుని. యెన్నెన్నో వికార చేష్టల జేయుచుండెను. "కూలీ", బ్లాకీ పెంచిన యొక పెద్ద జాతి కోతి. బ్లాకీ, నాటి యుదయమే వచ్చిన యొక వార్తా పత్రికను విప్పి. చదువుకొను చుండెను. భార్యాభర్తలకు వలయు పదార్థముల నన్నిటిని టేబిలుపై నుంచి వైచి, సేవకుడు వెనుకటి యింటిలోనికి బోయెను. రోజా యొక కోపాలో మగనికై వేడి కాఫీ బోసి చెమ్చాతో కొంచము చక్కెరనందు గలుపు చుండెను. పత్రిక జదువుచు, నందొక విషయము జూచి, బ్లాకీ తుప్రి

ళ్ళిపడి 'అన్నా' ఎంత ప్రమాదము వచ్చినది!' అని యాలోచించుచు ననెను. భర్త పల్కుల నాలించి, రోజా గిన్నె నందిచ్చుచు, ప్రశ్నార్థకముగ గన్నులనెత్తి 'ఏమి జరిగినది?' అని యడిగి, బ్లాక హస్తముల నుండి పత్రిక నందుకొనెను. నల్లని పెద్ద యక్షరములతో ముద్రితమై, యా పత్రికయందొక విషయ మిట్లుండెను.

'తుపాను నష్టము'

కెప్టను జేమ్సు హూకరు గారి యాధిక్యతక్రింద 'తుఫాను' అను యోడ నడి సముద్రమున దగులబడి నశించినది. ప్రయాణీకు లందరును చనిపోయి రని తెలియవచ్చినందుకు చింతిల్లుచున్నారము.........

రోజా యీ వార్త జదివి, భర్తవైపు జూచెను. బ్లాక్ చింతాక్రాంతుడై శిరము వంచి, యాలోచించుచుండెను. మగని విచారము గని, రోజా, "నాథా! వాడు మరణించె నను రూఢివార్త తెలియకనే, యేల చింతింపవలయును? తప్పించుకొని వాడు బ్రతుక కూడదా?" అని సమాధానము చెప్పెను.

"రోజా, నీ కేటి వెర్రి?... అందరును చచ్చిన వెనుక వాడొక్కడు జీవించు టెట్లు? అయ్యో! వానిపై నెంతయాశ నెలకొల్పి యుంటిని? నేటికి నా యత్నము లన్నియు వ్యర్థమాయె ననియే కదా యూహించవలయును? పాడుదైవ మామరు నేల ధ్వంసము చేయవలెను? నే దలపెట్టిన కార్యముల

కన్నిటికిని కూడ నేప్పో విఘ్నములు కలుగుచునే యున్నవి... ........కాని తుద కే మగునో చూచెదగాక!" అని తల పంకించి, పిడికిలితో టేబిలుపై దట్టుచు, బ్లాకీ తనలో నేమో నిశ్చయించుకొనెను.

అప్పుడు వాని ముఖ లక్షణముల గమనించుటకు, రోజా కూడ భయపడెను. తన నాథు డమిత క్రోధావేశుడై యుం టంగని యెదురాడిన నేమి కోపగించునో యని యేమియు మాటాడక యామె శిరము వంచి యూరకుండెను.

తన యాసనమునుండి క్రిందకు దుమికి, "కూలీ" దూరముగ జని, భయముతో యజమానునివైపు జూచుచుండెను.

"ఇటుపై కరుణ వహించుట కూడదు. హృదయమా! ఇక గఠినత బూనుము. నాకార్యమునకింక నడ్డు వచ్చువా రెవ రుందురో చూచెదగాక!" అనుచు బ్లాకీ తనలో నేమేమో శపథముల జేసికొని, నిజసతి వైపు దిరిగి "రోజా! నీ వేమియు నాటంకముల జెప్పకుము. కొలదిదినములవరకును నేనొక రాక్షసుడనే యనుకొనుము. నీ వెరిగిన బ్లాకీ ననుకొనకుము. నా యూహా లన్నియు రక్తమయమ్మై యున్నవి! ఎదురు జెప్పిన యెడల, నా మాట లిటుపై జురకత్తులవలె వాడిగా నుండవలసి వచ్చును. నొచ్చుకొనకుము."

అని తీవ్రముగ ననుచు, నేమియు భుజింపక, కొంచెము కాఫీ మాత్రము త్రాగి, బ్లాకీ దుస్తుల దొడుగుకొని, గృహము వీడి చనెను.

బ్లాకీ వెడలిన పిమ్మట, రోజా వార్తా పత్రికలోని విషయము నింకొక సారి చదివి, కొలదిగ గుడిచి, ఛాకొలేట్ త్రా

గి, మెల్ల మెల్లగ నడచుచు, తన గదిలోనికి బోయి, యొక సోఫాపై జేరబడి, యేమో యాలోచించుచుండెను.

"ఏమిది? నిన్నటి యుదయము కదా వాడు 'తుపాను' నెక్కెను? అప్పుడే యాస్టీమరు తగుల బడినట్లు వార్త రావలెనా? నిన్న సాయంత్రమే నిప్పంటుకొనెనా? దైవకృతము లొక్కొక్కప్పు డెంత విపరీతములై యుండును! ఇక, తన పని పూర్తి యగువరకును బ్లాకీ నామాటల బాటించువాడు కాడు. నేనేమి చేయగలను? కానున్నది కాకమానదు. విధివశ మెట్లున్న నట్లు జరుగును!"

* * * * *

మానవునకు వాటిల్లు కష్టము లన్నియును, వాని య జాగ్రత వలననో, జ్ఞాన విహీనతనో, అనుభవము చాలకనో, కలుగు చున్నవి. తొక బట్టి యీడ్చుచున్నచో, గుఱ్ఱము మూతిపై దన్నదు; పట్టు రేపకున్నచో కందిరీగలు పైబడి కుట్టవు. తెలివిమాలినతనమునకు గూడ బ్రాయశ్చిత్త మవసరమై యున్నట్లున్నది! మన మెవర్చు మెట్టి పని కైనను, కార్య ఫల మొకటియున్నది. అది పదార్థమునంటిన నీడవలె, వెన్వెంటనే వచ్చుచుండును. కొన్ని వేళలయం దది యదృశ్య భంగి నుండ వచ్చును. మరికొన్ని సమయములయం దది వికృతరూపము గూడ దాల్చ వచ్చును! ఒక డొక పామును కొట్టబోవు తరి దెబ్బ తప్పును—అప్పుడు సర్పము వానిపై దిరుగ బడ వచ్చును. ఒక డొక చిలుకపై ముచ్చట కొలదియు, దానిం దెచ్చి యొక పంజరమున నుంచును—ఆహారము బెట్ట దలువు

దీయు తరి నా పిట్ట పై కెగిరి పోవచ్చును. ఒక్కొక్కప్పుడు మానవు డొ[నర్చు] పనులతో వాని యుద్దేశమున కెట్టి సంబంధ మునుండదు. వాని తలపును బట్టి కార్యఫలము రాబోదు. అట్లు, సత్కార్యము[ల]లో కప్పు డపజయము నొంద వచ్చును; దుష్కృత్యముల [వ]లన లాభము కూడ కలుగ వచ్చును. కావుననే, 'తా నొ[క]టి తలప దైవ మొకటి తలచు'నను లోకోక్తి పుట్టినది. కా[ని], నిప్పులేక పొగ పుట్టనట్లు, మానవు డేదో యొక యవక తవక పని చేయునిదే, యెట్టి యాపదయు రాకూడదని కొం[ద]రి యభిప్రాయము. ఒక డొక తప్పు జేయును— తత్కార్య[ఫల]ము మొకానొకప్పుడు వా డనుభవించక, యింకొక డనుభవించ[వ]లసి వచ్చును. కావుననే, "తండ్రిపాపము పిల్లల జుట్టుకొ[ను]" నను సామెత వాడుకలో నున్నది. అది న్యాయమా, కా[దా], యని విచారించుట కిప్పు డవసరము లేదు. తుంటరి యొ[క]క డొక కుక్కను కొట్టుటకై రాయి ఱువ్వినప్పు డది [దా]రి, మార్గమున చనుచుండిన వేరొకనికి తగుల వచ్చును. "ఎ[న్]జిన్ డ్రైవరు" చేయు పొరపాటు వలన రెయిలు బండిలో నున్న ప్రయాణీకు లందరకును, అపాయము కలుగ వచ్చును. వేరు లేక వృక్షము నిలువనట్లుగా, ప్రపంచమున కానవచ్చు దుస్థితులకును, దురవస్థలకును—అన్నిటికిని కూడ మూలకా[రణ]ము మాత్రము, మనుష్యుని యజ్ఞాన ప్రతిభావిశేషమే! అ... ...ము లేల పుట్టవలెను? అగ్ని పర్వతము లుద్భవిం... ...కుము? వరదలు కొట్టుకొని రా నిమిత్త మేము... ... ...కలుగవచ్చును. ఇవన్ని

ది

ర

లక్షణము. ముసురులో దడియుట యన్ననో, దా నది మానవుని తెలివి హీనత. ఏలననిన, వర్షము మీాద పడకుండు నట్లు నరుడు గృహముల నిర్మించుకొన గలడు. గొడుగు ధరించ గలడు. అటులనే యొకప్పుడు ప్రకృతి భీకరాకృతి దాల్చినను, తనూత్రలమున నిక్కట్లు గుడుచుట నరుని యజ్ఞానమే. మానవుడు తన ప్రజ్ఞా విశేషమున కష్టముల నోర్చుకొన గలడు. లేదా, జ్ఞాన హీనతను, ముప్పుల మూట గట్టుకొన గలడు. తన జ్ఞాన ప్రతిభా విశేషమున నరు డొకప్పు డొక ముప్పు దప్పించుకొన గలిగినచో మెప్పులేదు—కాని యాపద పాలైనచో నపకీర్తి నిందితుడు!

నడి సముద్రము. ఆకసము స్వచ్ఛముగా నుండెను. ఒక్క సుమారు గంట గంటన్నరలో సూర్యాస్తమానము కానున్నది. మురిపించి వీచుచుండిన నీటిగాలి మిగుల యానందదాయకముగ నుండెను. అట్టి తరుణమున "తుపాను" అను పొగయోడ నిప్పంటుకొని, దగ్ధమగుచుండెను. సృష్టివైచిత్ర్యముల కెంతని యచ్చెరు వందవలయును? చూపు మేర దూరమున నేవైపు గాంచినను, ప్రకృతి శోభావంతమై, ముదము గూర్చుచుండ, "తుపాను" నడి సముద్రమున దగులబడుట, కేవలము స్వభావ విరుద్ధమై, వసుదేవ తనయు డక్కజమాయు సమయముగ దోసిట నిక్షేపనంబు బడునట్లు దుశ్శకున కారణమై, జీవనాశన సూచకమై, పొడకట్టుచుండెను. పడవ నిండ ప్రయాణీకులు క్రిక్కిరిసి యుండిరి. అగ్నిమూలమున చేగిన పొ

మగుటచే, గ్రిందనుండి నీరు పడవలోనికి దోసికొని వచ్చుచుం డెను. అప్పుడు "తుపాను" లో జనించిన కోలాహల మిట్టి దని వచించుట యసాధ్యమే కాక, హృదయము వ్రక్కలు సేయును. పడవ నాయకుడగు హుూకర్ మిగుల ధీమంతుడే యయ్యు, నాలోచనను పాలుపోనీయుని కొందల చిత్తముతో, విచారగ్రస్తుడై, చేయునది లేక, తన సహాయులోపము లేకుం డుటకై యవసరమగు పనులనెల్ల జేయుచు, పని వారిచే జేయిం చుచుండెను. కాని బూశిదలో బోసిన పన్నీరు పగిది, వాని యత్నము లన్నియు నిష్ఫలము లగుచుండెను. రేగిన తేనె పట్టు వలె పడవలోనున్న వారందరును గొలుమనిరి. అందఱును, పడవ యింకొక మైదారు నిముషములలో నిర్మూల మగునని, విశద మయ్యెను. ఎల్లరును పరిపరి విధముల హుూకరును ప్రశ్నిం చుచుండిరి.

"అయ్యో, మరెట్టి రక్షణోపాయమును లేదా?" అని యొక డడిగెను.

"లేదు" అని గద్గద స్వరముతో, శిరమువాల్చి, కన్నీరు నించుచు, హుూకర్ బదులు చెప్పెను.

నిజమగు శోకమనునప్పుడు, హృదయాంతరాళమునుండి వెరలి వచ్చి, కన్నుల నశ్రులు జిమ్మిన హుూకరుదే శోకము! అంత దుఃఖము భరించగలిగిన యాతడు నిజముగా వీర పురు షుడే! తన యాధిక్యత క్రింద నున్న యోడ దిక్కులేక నాశన మగుట గన్నులార జూడ వలసిన కష్టమే కాక, పాపము తనపై భారము నునిచి, ప్రయాణము జేయుచుండిన తన చుట్టును మూగిన జనులను చూడ, హుూకరు మనమున నొక శోకాగ్ని

జనించి, రగిలి, లోలోన వానిని దహించు చుండెను. తన యుసువులపై నాశ వానికి లేశమును లేకుండెను. కాని తన్న పరియాణీకు లందరు నొక్కసారి మృతినొందుట దానెట్లు చూచి సహించ గలడు? తనమూలముననే కదా యిట్టి ఘోరము వాటిల్ల నున్నది? ఇం కొకడు పడవ నాయకుడై యుంననో యెటు వచ్చియుండునో? ఓడ ని ప్పంటు కొన కుండునేమో! అంటుకొనినను, అపాయము రాకుండ నాతడు కాపాడ గలిగి యుండునేమో! ఎంజిన్‌ను శోధించకుండుట హూకరు తప్పిదము కావచ్చును. అగ్ని తగిలిన కొంత సేపటి ధనుక నపాయము గనిపెట్ట జాలకుండుట వాని యవివేకమును కావచ్చును. 'సిలెండరు'బ్రద్దలగుట వానియజాగ్రతవలననే సంభవించెనే మో? పడవ తగుల బడుచున్నప్పుడు "వైరెస్ టెలిగ్రాము" నిచ్చుటలో యాలస్యమగుట కూడ వాని తెలివి తక్కువ చేతనే యై యుండవచ్చును. ఏదెటు లైనను, పడవ వాని యధీనమున నుండెను. ఏముప్పును రాకుండ గాపాడు నాయకు డతడు! కావున హూకర్ తన్నుదా బరిపరి విధముల నిందించుకొనుచు, విచారించు చుండెను.

తన్ను బ్రశ్నింప వచ్చిన వారి నోదార్చుచు, సేవకుల కేవేవో పనుల జేయుమని యాజ్ఞాపించుచు, పడవ పై భన్నుడై చేతులను వెనుకకు మోడ్చి, హూకరు దీర్ఘాలోచనతో నిలచి యుండెను. అట్టి తరుణమున నొక పాడవరి యగు పురుషు డొకడు ముందుకు దోసుకొని వచ్చి, "కెప్టెను" నుద్దేశించి

"అయ్యా, పడవ మునుగుట కింక నెంత వ్యవధి యున్నది?" అని యడిగెను.

"నాలుగైదు నిముసములు." అని హూకరు బదులు పలుకుచు తన కంట జిమ్మిన నశ్రుబిందువుల దుడుచుకొనెను.

అంతనా పొడుగు మనిషి, "అయ్యా, పాపము మీరేమి చేయగలరు? దుఃఖించవలదు. దైవాధీన మిట్లున్నది. ధైర్యముతో నుండుడు. శోకము కార్యకారి కాదు" అని హూకరుతో ననుచు, తానొక 'క్లెర్జిమన్' కావున, తోడి ప్రయాణికుల నందర నొకచో జేర బిలచి, వారి నుద్దేశించి, మరణము నెదుర్కొనుటకు ధైర్యము గొలుపుటకై, యిట్లుపన్యసించెను.

"మిత్రులారా, మనప్రాణములు శీఘ్రకాలములో బోనున్నవి. 'పదిమందితో చావు, పండుగ వంటి' దని పెద్దలందురు. దుఃఖించుట కిది సమయము కాదు; వ్యవధి కూడ లేదు. దైవ ధ్యానమే చేయవలయును. దేవుని బ్రార్థించుచు, నందరము గలసి యా మహాత్ముని సన్నిధి కేగుదము."

ఈ లోపున, హూకర్ సేవకులచే రక్షణ నౌకల గొన్నిటిని నీట దింపించెను. వాటిలో గొన్ని సగము కాలియుంటచే నుపయోగము లేని వయ్యెను. మిగిలిన నాలుగైదు తెప్పలలో స్త్రీలును, పసి పిల్లలును కూర్చుండ బెట్ట బడిరి. స్వల్ప సంఖ్య మాత్రమే యా పడవలో నిమిడెను. హూకరు కూడ నొక నావలో గూర్చుండుటకు చోటు జేసి, యందరును వానిని ప్రాణముల గాపాడుకొన వలసినదని ప్రార్థించిరే కాని, యాతడంగీకరింపక, "నా ప్రాణముకన్న నధిక విలువ గల యోడయు, మీ వంటి మిత్రులును నశించుచుండ, నే జీవించి యుండి ప్రయోజన మేమి?" అని బదులు పలికి, "తుంపాను"తో దాగూడ నగ్నిహోత్రుని వాత బడుటకు మనో నిశ్చయము

జేసికొనెను. అగ్ని, నాలుగు మూలలకువ్యాపించి, మిన్నునంటు పొడవున, జ్వాలల బరపుచుండెను. పొగ, క్రమ క్రమముగ దట్టమై, 'స్టీమరు' నంతట నాక్రమించి, యొకరి మొగ మింకొకరికి గాన రాకుండ జేసెను. కాలి, యతుకులు విడుచున్నప్పుడు, యినుప మేకులు పైకి దృళ్లుచుండెను; ఢామ్మను భయంకర శబ్దములు తరుచుగ విన వచ్చుచుండెను. అగ్ని కణములు తుళ్లి, జనులపై బడునప్పుడు, వారి దుస్తు లంటుకొని మరింత యల్ల కల్లోలము గలుగ జేయుచుండెను. అంత దనుక, నగ్ని నార్ప, హూకరు పనివారిని నియమించెనే కాని, మరి కార్యము లేదని విశద మగునప్పుడు, వారి నాపని మాను మని చెప్పెను. పడవలోని జనుల యార్తనాదములు, యేడుపులు, మొరలు, కేకలు, సముద్ర ఘోషను మించి వినవచ్చుచుండెను. పడవ మునుగ నున్నప్పు డందరును యేకమై, దేవుని ప్రార్థించుచు నిలువ బడిరి. కొంద రెప్పుడైన నీటి చావే కదా యని, యోడపైనుండి నీట గెంతుచుండిరి. అందరును వారి వారి బంధు మిత్రుల సమీపమున నుండి, యొకరి నొక రోదార్చు కొనుచుండిరి. ఆలి మగ లేకీభవించి, యేక దేహముతో మృతి నొంద నిశ్చయించి, రొండొరుల బాహు వల్లికల బిగి కౌగిట నుండి మరణమునకు వేచి యుండిరి! వచ్చియు రాని జ్ఞానము గల పసి పిల్లలు తమ తల్లుల బట్టుకొని భోరున నేడ్చుచుండిరి. పాప మా ప్రాణ రక్షణ పడవలలో నైన, స్టీమరులో నుండిన యందరు స్త్రీలును, పిల్లలును, యిమడ కుండిరి!

"తుపాను" పూర్ణముగ బరశురామప్రీతి యయ్యెను. ఫిరంగి ప్రేల్చిన శబ్దముతో నోడ ఢామ్మని ప్రేలి, శిథిలమై

ముక్క ముక్క లయ్యెను. బరువుగల భాగము లన్నియును జలగర్భము జొచ్చుచుండెను. ఆ నడి సముద్రమున నప్పుడంత యు శోక మయము; భయము; మరణము!

*    *    *    *    *    *

'గోలో లేబొరేటరీలో', రెండవ పూట మేయో వచ్చి, తన మిత్రులతో సంభాషించుటకై యొక వాలు కుర్చీపై గూర్చుని యుండెను. నిరూపకు డంత దా సరిజేయుచుండిన యొక 'కమేరా' యంత్రము నటు బడవేసి, యిన్స్పెక్టరును చూచి, చిరు నగవుతో పలుకరించి, యొక సిగరెట్టును ముట్టించి, మేయో కొక టొసగి, తానును వాని కెదురుగ గూర్చునెను. పిమ్మట వా రిరువురును కొంత దనుక పని తొందర లేక మాట్లాడు కొనిరి.

రో — మేయో, నిన్న రాత్రి యిటనుండి యేగిన పిమ్మట టావిరా గూర్చి, మరేమైన నాలోచించితివా ?

మే — లేదు ఏమి? అధిక మేమైన బయలు పడెనా యేమి?

రో — నేటి పత్రికలో 'తుపాను' కాలిపదనుయంశముజదివితివా?

మే — లేదు. పని తొందరలో నుదయము పత్రిక పప్పనేలేదు. 'తుపాను' కాలిపోయెనా' అపాయ మేమైన జరిగెనా?

రో — పడవ దగులబడునప్పుడు పారి తప్పునా? ప్రయాణీకు లందరును చనిపోయిరని తెలియ వచ్చినది. తోడి వారితో గూడ టావిరా మరణించి యుండునా, లేక విధి వశమున దప్పించుకొ గలిగెనా, యని, నే నాలోచించు చున్నాను.

మే:—(ఆశ్చర్యముతో నోటనున్న సిగరెట్టుదీసి చేతబట్టుకొని) రోలో 'తుపాను' నశించిన, మాత్రాన టామీ జచ్చె నెట్లు? ఆ పడవపై నెక్కి చనె నని నాతో నీ వెప్పుడును చెప్పనే లేదే ?

రో—అవును. నాకును, టామీ వార్త నేడే తెలిసెను. 'తుపాను' పై నెక్కి చనె నని టేసీ కనుగొనగలిగెను. ఆపెమ్మట నీ పత్రిక వచ్చెను.

మే—టేసీ కెట్లు తెలిసెను ?

రో—(నవ్వుచు) టేసీ యిప్పుడు తరుచుగ బిల్లీ హోటేలు కేగుచుండునని తెలియునా ?

మే—ఏల?

రో—(మేయో యొక్క యాతురము గని పెట్టి మరింత నవ్వుచు) ఆహోటేలులో నున్న నెల్లీ నెరుగుదువా?

మే—ఎప్పుడో చూచి యుందును. ఏమి, టేసీ నెల్లీని ప్రేమించు చున్నాడా?

రో—(నవ్వ నాపుకొన జాలక) మేయో! అంతవేగముగ నీ యభిప్రాయముల ధృఢ పఱచు కొందు వేల? టేసీ చేసికొని వచ్చిన కార్యముల నెల్ల దెల్పెదను వినుము. నీవు టామీని పట్టు కొనుటకై బిల్లీ హోటేలున కేగి యుంటివి! జ్ఞాపక మున్నదా ?

మే—ఉన్నది.

రో—అప్పుడు బిల్లీని నీవు కొన్ని ప్రశ్నల నడిగి యుంటినని చెప్పితివి. మీయిరువురి సంభాషణను నేను డైరీలో వ్రాసి కొంటిని. నా కేలాకో బిల్లీపై యనుమానము కలిగి

నది. టామీా యీా చోకీ వానికి దెలిసి యుండునని యూహించితిని. కావున ఢేస్రీసీతో కలిసి యోచించితిని. నాటి నుండియు దఱుచుగ ఢేస్రీసీ నచ్చటికి బంపుచు న్నాను. ఢేస్రీసీ తోలుత బిల్లీని మచ్చిక చేసి చూచెను. కాని అంత సులభముగ బిల్లీ ఢ్రేసీ వలలోజిక్కడా యెను. అందుచే ఢేస్రీసీ నెల్లీ చెలిమి జేయ దొడగెను. సాహజముగ నామె చపల చిత్తురాలు కాదు. కాని ఢేస్రీసీ యామెను వశ పరచుకొన గలిగెను. ఆమె మూలమున ఢేస్రీసీకి టామీా సంగతి తెలిసెను.

మే—టామీాని గూర్చి నెల్లీ కేల తెలియ వలెను?

రో—అట్టి తలపు నాకును కలిగెను. నెల్లీ టామీాల కెట్టి సంబంధ మున్నదని యోచించితిని. రూఢిగ నాకును యిప్పటి కెట్టి సమాధానమును తోచుచున్నది. కాని కొలది కాలములో సంతయు బయలుపడవచ్చును. టామీా మృతి నొందుటయే వాస్తవమయినచో మనకు గొంత చిక్కు. వానిని పట్టుకొనినచో చాల విషయములు బయలుప డును. టామీాని గూర్చి నా కింకొక యనుమానము తట్టుచున్నది. టామీా వాని నిజమైన పేరు కాదు. టామీా గూడ వేషధారుడై నాటక మాడుచున్నాడు.

మే—మిత్రమా, నీ పలుకులు నా కాశ్చర్యము గొలుపుచున్నవి. టామీా వేషధారియని చెప్పుటకు నిదర్శనములెవ్వి?

రో—కాలక్రమమున నన్ని నిదర్శనములును వెలువడును. టామీా మారువేషమున నుండకున్నచో వాడు చెవుడు లేనిదే, యట్లేల నటించవలెను?

మే—చెముడు లేదని నీ కెట్లు తెలియును?

రో—చెముడు లేదని తొలుత నా కనుమాన ముండెను. ట్రేసీ నా సందియము దీర్చెను.

మే—నెల్లీ మూలమున నేనా?

రో—అవును.

* * * * *

మోహావస్థలో నున్న వారి చైతన్యప్రవాహ మపారమై, యంధకారబంధురమై, యస్థిరమై యుండును. వారి చేష్టలు వికృతభావనాకల్పితములు; ఊహలు బుద్ధి జాడ్యజనితములు. మోహ మొక భూతమువంటిది. తాబట్టినవారి నున్మాదులుగ జేసి, వారి జ్ఞానమును హరించును. మోహపాశబంధు లంధులు. ముందు వెనుక లరయక, హృదయోద్దీపన ప్రేరితులై వర్తించెదరు.

హరోప్లేలుకు తరచుగ వచ్చుచు బోవుచున్న ట్రేసీని చూచి, నెల్లీ వాని రూపురేఖల కచ్చెరువడి మారు వేషమున నున్న నిరూపకుడని యెరుగక వాని చెలిమికై యత్నింపసాగెను. ట్రేసీ కూడ యామెను ప్రేమించుచున్నటుల నటింపుచు వచ్చెను. కాలక్రమమున వారి చెలిమి పరిపక్వ మంది, నెల్లీకి కళ్లు గప్పెను. తరుణవయస్కుడగు సుందరాకార పురుషు డొకడు తన వలలో జిక్కి పరవశు డాయెనని యామె యెంచెను; గాని ట్రేసీ యుద్దేశ మొకింతయు నామె పోల్చికొనలే కుండెను. ఏమియు మరుగుపరచక, నెల్లీ తన రహస్యముల నెల్ల వానితో జెప్పుచుండెను. ట్రేసీ, తన పై వేషమునే గాక, నిజ

మగు పేరు గూడ మార్చి, ఛార్లెస్ డిక్ అను **నామముతో** నామెవద్ద మెలగుచుండెను.

నాటి సాయంత్రము, నెల్లీ ప్రియుని రాకకై చక్కని దుస్తుల ముస్తాబై, శిరోరుహముల జక్కజేసికొని, యింపగు పరిమళ ద్రవ్యముల జల్లికొని, యూలుతో నేదో యల్లుచు, తన గదిలో సోఫాపై గూర్చుండి యుండెను. మాటి మాటికి ద్వారము వైపు జూచుచు యామె ప్రియు డెప్పుడు వచ్చునా యని నిరీక్షించుచు, మిక్కిలి యాతురతతో నిముసములు గడపుచుండెను. అప్పు డామె మనమున నుద్భవించుచుండిన భావనలివి యని కాని, యిట్టివని కాని నిర్ణయించి చెప్పుటకు మానవమానస తత్వవేత్తలకు గూడ నసాధ్యము. ఆతురత, ఆనందము, అనుమానము—అన్నియు నొక్కసారి జనించుచుండెను.

“......అట్లేల యూహింప వలయు? నన్ను నిరాకరింప నుద్దేశ మున్నచో ననుదినమును నాదరి కేల వచ్చును? ‘నెల్లీ, రేపుకూడ నీవేళకే వచ్చెద’నని చెల్పి, నిన్న నన్ను వదలి చను నప్పుడు, నా వైపు జూచి చిరునవ్వు నవ్వ నేల?......లేదు. ఛార్లెస్ నన్ను నిజముగా ప్రేమించుచున్నాడు. లేనిచో దన రహస్యముల నెల్ల నాతో నేల చెప్పును? తినబోవుచు రుచు లెంచ నేల? నేడు నన్ను దప్పించుకొని చనిన కదా? నన్ను ఛార్లెస్ నిజముగా ప్రేమించ లేదే యనుకొందము. అయినను, నా మాట ద్రోసి వేయునా? పురుషు లట్టి కఠినత బూనుదురనుట కల్ల!...ఇంకను రాడేల?...” అనుచు దనలో పరి పరి విధముల దలపోయుచు, నెల్లీ తెలియరాని హృదయ వేదనంబడి

యుండెను. ఊలుబంతి చేతనున్నదే గాని, నెల్లీ యల్లినది కొంచెమే! ఆమె కేమియు దోచకుండెను. ఇంతలో నొక స్థూలకాయుడగు పురుషుడు గదివద్దకు వచ్చి యొక కవరును నెల్లీ వద్దకు విసరెను. తృళ్ళిపడి లేచి, యామె కవరు దీసికొని, కోపముతో నా పురుషుని చూచుచు 'బిల్లీ—తటాలున వచ్చి నన్నదరజేయవలెనా? వచ్చుచున్నావని తెలియజేయరాదా? కవరు మీద బడగనే, తృళ్ళిపడి లేచితిని! —సరియే, వెళ్ళుము' అనుచు మరల సోఫాజేరి కవరు విప్పుచుండెను. ఇంతలో ట్రేసీ వచ్చి తలుపుదరి నిలచెను. నెల్లీ కవరును సగము చించి, కవాటము వైపు జూచునంత, ట్రేసీ యగుపడ, నామె యానందము పట్ట నలవికాకుండెను. బుగ్గలు లొత్తి బహు చిరునగవుతో ట్రేసీని పలుకరించి "రమ్ము" అనెను. తోడనే ట్రేసీ ముందువచ్చి, తలుపుల గొంచెము మూసి యామెను సమీపించెను

"నెల్లీ, నేడు కొంచె మాలస్యమైనది. క్షమింపుము."

"క్షమించుటకు నే నెవరు? నీ దయయున్న నొకసారి యీ దీనురాలిని చూడవచ్చెదవు; లేకున్న లేదు" అని నెల్లీ మొగము ప్రక్కకు దిప్పి, పల్కెను.

ట్రేసీ తనలో నవ్వుకొని, 'సుందరీ, నాపై నంత కోపమేల? మనఃపూర్వకముగ నీ చెలిమి నే గోరకున్న, ననుదినము ను నీ చెంత కేల రావలయు? ఆసంగతి నైన గ్రహింపవా?' అనుచు వేడుకొను వానివలె, నెల్లీ హస్తముల బట్టుకొనెను. ఆమె చేతనున్న యుత్తర మంత వాని కంటబడెను.

స్త్రీల కోపమునకు, ప్రియుల యాదరణవాక్యములే కదా విరుగుడు! నెల్లీ ట్రేసీవైపు దిరిగి, కన్నులువిప్పి, పక్కున నవ్వెను

"ఛార్లెస్—నిజముగ నన్ను ప్రేమించుచున్నావా? లేక మొగము తుడుపు మాటలచే భ్రమ పెట్టుచున్నావా' నీ వను దినమును నిటకు వచ్చుచున్నావే గాని యొకనాడును నీ యను రాగము వెలిబుచ్చియుండవు. నీపై గోప మనియా, యంటివి? నిజమే. ఒకానొక పురుషు డొక జవ్వని చెలిమిం జేసి, యామె తన్ను ప్రేమించుచున్నదని యెరిగియు, తన కౌగిలి నొసగకున్న, నట్టి కూరునిపై నామె కోపము జూపిన దన, సహజము కదా?" అనుచు నెల్లీ తన రెండు చేతులతో వాని కంఠము బట్టుకొనెను. అప్పు డామె చేతనున్న కవరు క్రిందబడెను.

* * * * *

"బార్నాడ్, నీ కిప్పుడు నయముగా నున్నదనుకొందును?"

"అయ్యా, మీదయ కెన్నిని వందనములు. నేడు నాకెం తయో నయముగ నున్నది. లేచి, తిరుగుటకు వలయు శక్తి క లిగినది శరీరమున మరి యెట్టి బాధయు లేదు—కొంచెము బలహీనత తప్ప—"అనుచు వాడు కృతజ్ఞతాదృష్టితో దన్ను జూడవచ్చిన డాక్టరువైపు మొగము దిప్పి, హీనస్వరముతో బలికెను.

తన రోగికి మేలుగా నున్నదని సంతసించి, డాక్టరు చిరు నవ్వుతో దలనూచి, వాని నాడి బరీక్షించి, ప్రశ్నల నడిగి, వైద్యశాలనున్న యితరుల జూడ, వడివడిగ నా హాలులోనుండి చనెను. డాక్టరు వేరొక రోగిని పరీక్షింప నరిగిన తోడనే, బార్నాడ్ వద్ద నుపచారముల జేయు "నర్సు" యొకర్తు వచ్చి, వాని పలుకరించెను. ఆమె సుమా రిరువదియేండ్ల జవ్వని.

జీవనాధారము వేఱొండు గానక, యాసుపత్రిలో రోగోపచారమునకై, స్వల్ప వేతనమునకు కుదురుకొనెను.

"బెట్టీ—నిన్ను చూచిన తోడనే ప్రాణములు లేచి వచ్చుచున్నవి. కడు దాహముగ నున్నది. ఏమైన నిమ్ము." అని బార్నాడ్ 'నర్సు'ను వేడుకొనెను.

బెట్టీ యంతట వాని కొరకొక కోపాతో కాఫీ దెచ్చి, యొసగెను. బార్నాడ్ లేచి మంచముపై గూర్చుని, యా బాలిక హస్తములో నుండి కోపానందుకొని యెత్తి త్రాగెను.

"బెట్టీ, కాఫీనా యడిగితిని—?"

"మరేమి కావలెను—?" అని యామె చిఱునగవుతో నడిగెను.

"నే గోరినది—నాకిమ్ము. నీ పుణ్యముండును" అనుచు వా డామెను ప్రార్థించెను.

"ఇప్పు డిచ్చుటకు వీలులేదు. డాక్టరు మరల రావచ్చును. రాత్రి యొసగెదను—లెమ్ము" అని పల్కి, బెట్టీ వాని హస్తమునుండి కాఫీ గిన్నె నందుకొని, హాలు వీడి చనెను.

బార్నాడ్ నకు మధుపాన వ్యసనము కలదు. కడచిన రాత్రియే వా డాసుపత్రికి గొని తేబడినను, యిప్పటి నుండియు వాడు బెట్టీని మచ్చిక జేసికొని, యధికారులకు దెలియ రాకుండ విస్కీసి కొని తెమ్మని వేడుకొను చుండెను. బెట్టీ హృదయము చాల మెత్తనిది. తన యుపచారము క్రింద నున్న రోగుల నామె కడు దయతో జూచుచు, వారి కష్టములను తన కష్టములుగ భావించుచు, శ్రద్ధతో సేవనముల నొసగుచు, వారి కష్టసుఖముల నెల్ల జెప్పుమని యొక స్కూలు బాలికవలె

కడు ముచ్చటతో వారిచరిత్రల నాలకించుచుండును. వైద్య శాలకు వచ్చిన దాదిగ, బెట్టీ యనుక్షణమును బార్నా డనువాని చరిత్ర దెల్పుమని కోరుచుండెను. విస్కీ నిచ్చినచో వాడు సర్వమును చెప్పెదనని యామెను దువ్వుచుండెను. పడవనశిం చుటెట్టి, వా డెట్లు జీవములతో రాగలిగెనో, తెలిసికొన బెట్టీ కుతూహలపడుచుండెను. సహచరులగు యితర నర్సు లామెకు బార్నాడ్ గూర్చి పరిపరి విధములగు వింతచరిత్రల జెప్పుచుండి రి. ఎట్లైన వాని నోటనే సర్వమును దెలిసికొన నిచ్ఛగించి, బెట్టీవాని తులితగవున కంగీకరించెను. వాడు బ్రాందీ నిమ్మని కోరునప్పుడు, కూడ దని యెరిగియు, నధికారులకు దెలిసిన, దన పై గోపింతురని జంకియు, నామె రహస్యముగ వానికా కృత్రి మపానీయము నొసగుట కియ్యకొనెను.

కాఫీ త్రాగినపిమ్మట బార్నా డామెను కడు దీనముగ వేడుకొనుటచే, బెట్టీ వానిపై గనికరమూని, యప్పుడే లోని కేగి కొద్దిగ, విస్కీనొక గళాసులో బోసి, వానికొసగెను. పిమ్మ ట వానిదరి గూర్చుని యాబాలిక, వాని చరిత్ర జెప్పవలెనని ప్రార్థించెను. ఒకటి రెండుత్తరములు వానికై నామె వ్రాసిపె ట్టినచో, దనకథ దెల్పువాడనని బార్నాడ్ అనెను. కా దనక, బెట్టీ వానికొరకై యుత్తరముల వ్రాసెను. ఇక జెప్పకున్న బాగుగ నుండదని యెంచి కాబోలు, వా డంత దనచరిత్ర నిట్లు చెప్పదొడగెను:—

"హూకర్ నాయకత్వమున 'తుపాను' నడి సముద్ర మున యగ్నిహోత్రిని వాత బడెనని నీకు దెలసిన విషయమే ఆయోడపైనుండిన ప్రయాణీకులలో నేనొకడను. ఓడ, నిరూ,

లముగ గాలిసపిదప, యెక్కడికక్కడ పడవ భాగములన్నియు
నూడి, పేలిపోవి. ప్రాణములపై నణుమాత్రము నాశ జూపక,
హుటాకర్, పడవలోనే యుండి, దానితో తా గూడ నీట మును
గెను. ఓడ శిథిలమగునప్పుడు జనులందరును నీటగ్రుంకిరి. దైవ
కృపవలన, నా కొక ధృడమగు కర్రబల్ల చేజిక్కినది. నాకు,
యీత బాగుగ వచ్చియుండుటంజేసి యాబల్ల నూతగా బట్టు
కొని, యెట్టెటులో కొంతదనుక నీటిపై దేలియుండ గలిగితిని.
చాలసేపట్లు పిడికిట ప్రాణములబట్టుకొని, యీదులాడుచుండ.
సమీపమున నాకొక తెప్ప కానవచ్చెను. అది ప్రాణరక్షణ
పడవలలో నొకటియని దెలిసికొంటిని. అందుండిన జనులేమైరో
నాకు తెలియదు. ప్రవాహముచే నది తిరుగబడినప్పుడు, వారం
దరును, నీటమునిగిరనియే నానమ్మకము. ఏమైననేమి, దేవుడది
నాకొఱకే ఖాళీచేసి పంపెనని సంతసించి యందుపై నెక్కితిని.
పడవలో నీరు చేరియుంటగాంచి, మున్ముందా నీటినితోడి వేసితిని
ఒక్కడనే యగుటచే పడవ నామట్టుకు విశాలముగనే యుండె
ను. కాని పడవలో తినుబడి పదార్థము లెవ్వియును లేకుండెను.
చేయునదిలేక, దైవముపై భారమునునిచి, యందు గూర్చుం
టిని. పడవ గడుపుటకు శక్తి చాలకుండెను. కెరటముల చిత్త
ము వచ్చిన దిక్కునకు పడవ పోవుచుండెను. పడవ ప్రక్కకే
మాత్రము వంగుచున్నను. 'నాపని సరి' యనుకొనుచుంటిని.
ఏవైపు జూచినను తీరము కానరాకుండెను. అట్లొంటరిగ, ప్ర
తినిముసమును మరణమునకు సిద్ధమై, కూర్చునియుంటిని. ఆకలి
వేయుచుండెను. దాహమునకు మితిలేకుండెను. అలసియుంటచే
గన్నులు మూతబడుచుండినను, నిద్రరాకుండెను. కొంతసేపటికి

నాకు స్మారకము తప్పిపోయెను. ఎంతసే పట్లు స్మృతిలేక పడి యుంటినో తెలియదు. మరల నేగనువిచ్చునరికి జిహ్వ చీకటిమై యుండెను. ఆసకము మబ్బుగ్రమ్మి యుండెను. చంద్రోదయ మైనదో లేదో తెలియరాలేదు. అంతలో మేఘములు గర్జింప సాగెను. ఆ సకమున మెరుపులు గానవయ్యెను. చిన్న వర్షము ప్రారంభించెను. రొజ్జగాలి వీవ దొడగెను. వర్షపుజల్లు పడున ప్పుడు వెలకిల బడుకొని, నోరు దెరచి, యా చినుకులతో నోరు దడుపుకొన యత్నించితిని; గాని, చినుకులు చిన్నవౌట చే, లాభము లేక పోయెను. పడవలో నేమైన నీరు చేరినచో, నది త్రాగ వచ్చునని సంతసించితిని; కాని యట్టి యదృష్టము జేకూరలేదు. జల్లు వెలిసిపోయెను. ఆ చిరి వర్షమునకు నే ధరిం చిన దుస్తులైన బాగుగ దడియలేదు. బట్టలు తడసినచో, పిం డుకొని, యా నీళ్లనైన ద్రాగ వచ్చునను ఆశతో నుంటిని. లాభము లేకుండెను. మరికొంతసేపటికి, మేఘముల చాటు నుండి చంద్రుడు తొంగిచూడ మొదలిడెను. క్రమక్రమముగ మేఘములు చెదరి, యదృశ్యమయ్యెను. వెన్నెలలో నేనైపు జూచినను నీరు తళతళ నద్దము వలె మెరయుచుండెను. ఆకలి గడి యూరటిమై తెలియరాకుండెనే గాని, దాహాతీవ్రత మాత్ర మధికమై, వేధించుచుండెను. జలమధ్యమున నుండి యు, నొక్క చుక్క నీరైనను త్రాగుటకు లభించకుండె గదా యని, చెప్పరాని దుఃఖము పుట్టెను. అంతకంతకు మొగము తిరిగినట్లయి, కన్నులు చీకట్లుగ్రమ్మి దృష్టిమాంద్యమాయెను. ఆహార నీరములు లేక యీ నౌకపై నే నేకాకినై కూర్చుని, కృశించి చచ్చుటకన్న, నీట దుమికి యొక్కసారి ప్రాణముల

గోల్పోవుటయే యుత్తమ మని, తలచితిని కాని, యట్టి సాహస కృత్యము జేసి యాత్మహత్య నొనర్చుకొనుటకు ధైర్యము చాలకుండెను. ప్రాణములపై మక్కువ, నన్నట్టిపనికి దుక్కగా జేసెను. కొంత సేపటికి నాకు శరీరమున జిరి చమ్మట క్రిమ్మి తెలివి తప్పెను. ఆ పిమ్మట నేమి జరిగెనో నాకు దెలియదు. నేనిచ్చటికి కెప్పుడువచ్చితినో, యెటుల వచ్చితినో, యెవరు నన్ను గొని తీసుక వచ్చిరో—యేమియుగూడ నాకు లేశమును జ్ఞాపకమునకు రాకున్నది. "తుపాను" దగ్ధమగుచున్నప్పుడు, హఠాక్ రొసగిన వైర్లెస్ టెలిగ్రాము వలన నేదో స్టీమరు చాల యాలస్యముగ నాప్రదేశమునకు రాగలిగి యుండెననుకొందును. పడవనుండి నన్నది యెత్తి తీసియుండును. రాత్రి నన్ని తీరమున చేర్చి, మీ యాసుపత్రిలో నొప్పగించి, యా యోడ తనమార్గమున నేగియుండును. శెట్టీ, ఇదియే నాకథ. ఏమియు దాచక నీతో సర్వమును జెప్పితిని."

# కోటీశు తనయ

## ఏడవ ప్రకరణము

### క్రోధి

« సీ॥ గుఱివిరాఁజి రోదసీకుహర మొక్కఁటముంప
నుప్పొంగు ప్రళయపయోధి కంటె,
జగము లన్నియు నొక్కసారి భస్మము సేయ
నడరెడు కల్పక్షయాగ్ని కంటె,
బహుపర్వతారణ్య పటలిఁ జూర్ణము సేయఁ
గడఁగు సంవర్త్తాశుగంబు కంటె;
బ్రహ్మాండ భాండంబుఁ బట్టి బ్రద్దలు సేయఁ
విదిరెడు విలయ భైరవుని కంటె;
నధిక గాంభీర్య, మతిశీతలం బగు పరితాప, మున, నధిక వేగ మద్భుతం బైన కాదె
మియ్యని ప్రళయాక్ర కలదిరవి మోరిల, దాలిగిలి యూనియుందురె వసుమతీశ."

ఉత్తరరామాయణము.

ప్రొద్దు పోయి, సుమారు, రెండుగంటలై యుండెను. మగఁ డింకను భోజనమునకు రాలేదని, రోజా మిగుల యాతురతతో వేచియుండెను. చీకటి దట్టమై యుండెను. నాఁడు మబ్బు క్రమ్మియుంటచే, నాకసమున నక్షత్రములగుపడకుండెను. భర్త రాకకై నిరీక్షించుచు, రోజా యేమేమియో దలపోసి కొనుచు, గూర్చుని యుండెను.

"నేటి యుదయమునుండియు, నానాథు డేనిమిత్తముననో, మిగుల గ్రోధావేశుఁడై యున్నాఁడు. ఈనాఁ డీ మూలమున నేదో ముఖ్యకార్యము జేయ సమకట్టి యుండినట్లున్నది. లేనిచో

వాని మరణమునకు దా నింత వగచుటేల? ఇటుపై దా నేపని జేయ గడంగినను, 'రోజా, నీ వద్దు జెప్పకుము' అని నాతోన నెను. ఎట్టి విపరీత కార్యము నుద్దేశించెనో! నాకణుమాత్రము బాడగట్టుకున్నది. ఆఫీసు నుండి మరలి వచ్చిన పిమ్మట నెన్న డును, మరల వెంటనే యిలు విడచు వాడు కాడు; నే డేలకో మిక్కిలి వేగముగ దుస్తుల మార్చుకొని, 'యిప్పుడే వచ్చెద' నని పల్కి, చనెను. ఇంతదనుక రాకుండుట జూడ, నేదో య వసరమగు పని మీదనే యరిగి నట్లు దోచును."

ఇట్లు రోజా తనలో దా ననుకొనుచు గూర్చొనియుం డ, వడివడిగ దలుపు దెరచుకొని, బ్లాకీ లోపల బ్రవేశించెను.

"నాథా, చాల యాలస్యమయినది-వంటకములు జల్లా రుచున్నవి. భోజనమునకు వేగిరపడుము" అనుచు రోజా కుర్చీ నుండి లేచెను.

"నాకేమియు నాకలి లేదు.—కాని" అని వాక్యము బూర్తి చేయకయే, తన గదిలోనికి జని, బ్లాకీ, యుడుపుల దీసివేయుచుండెను.

టేబిలుదరి భోజనమునకు గూర్చుని యున్నప్పుడు, కొంతసేపటికి బ్లాకీ, నిజపతి నుద్దేశించి, సంభాషింప దొడగెను.

"రోజా, యింతదనుక నే నేపనిపై బోయియుంటినో తెలియునా?"

రోజా—ఎట్లు తెలియగలదు? నాకు గర్ణపిశాచి లేదే? (అని మెల్లగ నవ్వెను).

బ్లాకీ—(కొంతదనుక మాటాడక) ఆడబోవు తీర్థము నే డెదురైనది. రాకి వ్రాయుట, పండు పడుట కలసి వచ్చినవి.

రోజా—అనగా?

బ్లాకీ—అనగా నాకోరిక సిద్ధించునను మాట!

రోజా—(తెల్లబోయి చూచుచు) నాకేమియు బోధ పడలేదు.

"అటులైన, వినుము. పీటర్ నెరుగుదువా? మేరీకి మేనత్త కొడుకు. ఇంతదనుక వానితోనే మాట్లాడుచుంటిని. వాడు మేరీని పాప మతి గాఢముగ ప్రేమించుచున్నాడు. ఆమె నడవడిక బట్టి చూడ, వానికి మేరీ వశపడు నట్లు దోచలేదు. తోలోపై నామె మనసు నిల్పియున్నదని పీటరు గ్రహించెను. తోలో లేకుండినచో, నామె పీటరును వరించుట కభ్యంతర ముండదని వాడనుకొను చున్నాడు. పీటర్ చాల ధనవంతుడు. తోలోను వాని కడ్డముగా లేకుండ జేసినయెడ, నాకు పీటరు చాలబహుమానము నొసగుటకు సిద్ధపడెను. అపిదప, మేరీయే వానిని చేపట్టినచో, నామె యాస్తికి గూడ వాడే యధికారి యగును. అప్పు డందులో నర్ధ భాగము నిచ్చివేయుట కంగీకరించుచున్నాడు."

"(భయదృష్టితో మగని దిలకించుచు) పీటరుకు దోడ్పడ నుద్దేశించితివా?"

"అవును; ఈ విషయమున నీ వేమియును, వ్యతిరేకము గా జెప్పకుము. అటుల జెప్పినను, నే నిదివర కే మాటనిచ్చితిని గావున నాయూహ మార్చలేను."

"(ఆలోచించుచు) పీటరు నిన్నెట్లు కనుగొన గలిగెను?"

"ఆ వ్యవహార మంతయు మన "జెసీమా" మూలమున జరిగినది. పీటరు యుద్దేశముల నతి నేర్పుమెయిం గనుగొని

యామె నాకెరుక జేసెను. అందుపై పీటరుకు నేనొక జాబు వ్రాసితిని.”

“ఏమని?”

“ ‘నీ కార్యము నిర్వహించగలవానిని పొద్దు గ్రుంకిన యొక గంటకు ‘ఫలానా’ ప్రదేశమున గలుసుకొని మాటాడు కొన వచ్చును.’ అని.”

*　　　*　　　*　　　*

నాటి సాయంకాలము రోలో, లాలీ మంది రమునకు వచ్చి, మేరీతో చాలసేపటివరకును, యువకులతో గాల యాపనము చేసెను. పుష్పితారామమున కెదురుగ నుండు మేడ చీడీపై నేయబడిన మెత్తని యాసనముపై సుఖాసీనులై వారిరువురును సంతోషముతో మాటలాడు కొనుచుండిరి.

“మిత్రమా, రోలో, నీవా విద్యుచ్ఛక్తి యంత్రము వెతుగకుండినచో, నే మరణించియే యుందును కదా? కెన్నీ యత్నములన్నియు గార్యము లేకుండెను. నే నీపాటికి—”

“మేరీ, పోనిమ్ము. ఆ విషయము గూర్చి యిప్పుడాలో చింప నేల? నీవంటి సుకుమారిని తీసుకొని పోవుట దేవునికి మాత్ర మానందమా? నీ మరణము దేవతలకు గూడ కన్నుల నీరు దెచ్చును. అందుచే బరమేశ్వరుడప్పుడు నాకా సాహస ము నిచ్చెను. లేకున్న, నాకంత ధైర్యమెట్లు కలిగెను? అది కాక ‘ఎలెక్ట్రికల్ రీససిటేషన్’ చికిత్స నే నెన్నడును చేసి యుండలేదు. నిన్నటి యత్నమే మొదటిది. యంత్రము నడు చుచుండిన కొన్ని నిముసములకు, నీ కనురెప్ప లదర దొడగె ను. అప్పుడు నాకు గలిగిన యానంద మిట్టిదని తెల్పుటకు

సాధ్యముకాదు. కాని నాకొక యనుమానము కూడ భయపెట్టుచుండెను. విద్యుచ్ఛక్తియే నీ కన్నుల దెఱచెనో, లేక నిజముగ యాశక్తి శరీరములో బ్రసరించుటచే నీకు మరల తెలివివచ్చి కన్నుల విచ్చితివో—అప్పటికింక నాకేమియును స్పష్టముగ దెలియకుండెను."

(వాని భుజముపై జేయివేసి) "రోలో, నీకు నే నెంతయు కృతజ్ఞురాలను. నీఋణము దీర్చుకొనలేను. నాకొఱకై నీవు మృత్యుముఖము కూడ నెదుర్కొనుచున్నావు! వంతెనపైనుండి సాహసించి నన్ను రక్షించుటకు నీట దుమికితివి. వైద్యుడు విషపాత్రముల నొసగు నప్పుడు నాకడ్డి త్రోసిపడితివి. చచ్చిన దాని మరల బ్రదికించితివి!"

"నీ వట్లు వచించుట నాకు విచారము గలుగుచున్నది. స్నేహము పట్ల, మన మొండొరులకు దోడ్పడుట విధాయుకము కాదా? అట్లైనచో, నీ వడ నేజేసిన ఘనకార్య మెద్ది? నీ చెలిమి నుండిన నా కంతియే చాలును. నిన్నెరుగుటయే నాకొక—"

"ఏమి? చిన్న నాటనుండియు మన మొండొరుల నెలిసికొని, యైకమత్యముతో నుంటలేదా? నన్ను నీమిత్రవర్గములో నింక జేర్చుకొన జాలకున్నావా? అవును, నీకు నే నేమి యుపకారము జేయగలిగితిని? నిజమే—"

"చెలీ, అట్లనుట నీకు ధర్మమా? నీకంటె నాకు సన్నిహితమిత్రు లెవరున్నారు?" అని సుందరి హస్తము నదిమిపట్టుకొని, మందహాసముతో నామొవైపు జూచుచుండెను.

ఆకన్యకామణి తన భ్రమర నేత్రములతో రోలోవైపు

చూచినప్పుడెల్ల, యా యువకుని గుండియలు ఝల్లు మనుచుండె ను. రోలో చంచలహృదయుడు కాడు. ఏ స్త్రీనికూడ నాత డిదివరకు జేరనీసి ముచ్చటతో ముద్దుల మునుగలేదు. మేరీ యన్ననో, చిన్ననాటి స్నేహితురాలు. సుగుణాలంకృతయగు ము ద్దులాడి. కాని, యామెయెడ గూడ రోలో బహు జాగరూకత తో వర్తించుచుండెను. తన్నులోలోన ప్రేమించుచున్నాడని, మేరీ యెరుగునేమో కాని రోలో మాత్ర మెన్నడును, ఆమె తో నట్లు ప్రియాలాపము లాడియుండలేదు. కాని, నా డామె గనపఱచిన యనాథత్వ దీనత్వములకు, రోలో హృదయమున నొక్కింతయుదయ, శరీరముగరువెక్క పులకరింప దా బట్టుకొనియు న్న హస్తకమలము నొక్కింత యదిమి యభిమానము ను వెల్లడి జేయుటయే గాక, యామెను తనవైపునకు కొంచెము లాగెను. ఆలలనామణియు నందు కాటంకము గనపఱచక, రోలో దగ్గరజేరెను. పిమ్మట వారొండొరులతో నేమియు మాటాడ లేదు. మేరీ మాత్రమొక్కసారి రోలోవైపు తేరిపార జూచి చిరునవ్వునవ్వుచు, మొగము వంచెను. కమల గులాబులేకీభ వించి యక్కలికి ముఖపద్మముగ నేర్పడెనా యనునట్లు, సుంద రి నెమ్మోమప్పుడు నూతనశోభచే వికసించెను. జవ్వనిని రోలో తనవైపులాగికొని, తన బాహువల్లికల నామెను చిక్కజేసి హృదయాంతరాళమునుండి యుబికి వచ్చుచుండిన మోహము నొక్కసారిగ నణప నుద్దేశించినట్లు, యాతురతతో నాయింతి యధరము ముద్దాడెను.

* * * * * *

### "కూలీ—కూలీ...దా!"

కుర్చీదిగి, వెనుదిరిగి పోవుచున్న "కూలీ"ని బ్లాకీ పిలచి తనపక్క గూర్చుండబెట్టి, కొంతసేపుదువ్వి, "కూలీ, నీయవసరము వచ్చినది. నీకార్యముజయించుకొని వచ్చితివా, నీకన్న నాకు మిత్రులెవ్వరుండరు" అని యేమో యనుచుండెను. యజమానుని యాదరణకు ముదమంది, మర్కటము తలపైకెత్తి వానివైపు జూచుచుండెను బ్లాకీ యుద్దేశము "కూలీ" గ్రహించెనా? వాని పల్కుల నర్థముచేసి కొనగలిగెనా?—.

మానవుని జ్ఞానమున కంతము లేనటుల గానవచ్చుచున్నది! నరుడు సముద్రముల దాటుచున్నాడు; వాయువిమానముల నిర్మించి, గాలిలో పక్షివలె నెగురుచున్నాడు; వేడిమి, వెలుగు, విద్యుచ్ఛక్తి మొదలగు సృష్టివైచిత్ర్యముల దనయుపయోగమునకై వినియోగించుచున్నాడు; భూమి పెకలించి, వెండిబంగారముల ద్రవ్వుచున్నాడు. లోకములోనున్న జీవరాలలోనెల్ల మానవుడుత్తముడు! జ్ఞానవంతుడు!! బలవంతుడు!!!

వ్యాఘ్రహార్యక్షములవంటి ఘాతుక మృగముల నవలీల మడియించు శక్తియేకాక, నరునకట్టిజంతువులను మచ్చికజేయు బుద్ధి విశేషముగ గూడనున్నది. పులులు, సింహములు, ఏనుగులు, మొదలగు జంతువులను మచ్చికజేసి, వానిచే ననేక పనుల జేయించుచుండుట మనము "సర్కసు"లో జూచుచున్నాము. పాములవాడు నా స్వరము బాడి త్రాచుల లొంగదీయుట మనకు వింతకాదు. మానవుడు తన జ్ఞానము వలన ననేక వింతల జేయుచున్నాడు.

"కూలీ" యను కోతిని పెంచి, మచ్చికజేసి, బ్లాకీ యా

ఇంతువున కనేక విద్యల గరపి, దానినొక సేవకునిగా జేసెను. యజమానుడు నేర్పిన పనులనెల్ల నతివిధేయతతో జేయుచు, "కూలి" బ్లాకీ వద్ద మచ్చికపడి సంచరించుచుండెను.

"కూలీ,—నేడు నీవు చేయవలసిన కార్యము మిక్కిలి కష్టతరమైనది. జయించుకొని రమ్ము!" అనుచు బ్లాకీ, కోతిని దువ్వుచుండెను.

ఇంతలో రోజా లోనికివచ్చి, మగనిపై పుజూచి, యాశ్చర్యముతో, కొంతదూరమున నిలచియుండెను. బ్లాకీ యామెను చూచి, "రోజా—వచ్చి, కూలీని దీవింపుము!" అని నవ్వెను.

"నాథా! నేడు కూలీకి పని చెప్పిరా?"

"అవును—ఆఖరు ఆధార మదియే—టామీ పడవలో జచ్చియుండకున్న, నిప్పుడు 'కూలీ' యవసర ముండకుండును. కాని, ప్రస్తుతము కర్తవ్య మాలోచింప, 'కూలీ' చేయవలసిన పనియే ముఖ్యముగ తోచినది."

మగని పల్కులాలించి, రోజా నిశ్చేష్టురాలై, కొంతదనుక నేమియు మాటాడక, పిదప బ్లాకీ భుజముపై జేయవేసి, "ఇంకను టామీ సంగతి రూఢిగ దెలియునిదే యీ కార్యము నకు సాహసింప నేల? కొన్ని దినములు వ్యవధి లేదా?" అనెను.

"ప్రియే, యేమి నీ వెర్రి!" అనుచు నామెను దగ్గరకు లాగి, ముద్దిడి, "రోజా, నీకెందు కాభయము? కాలయాపన మొనరించిన మన కేమి లాభము? కొన్ని దినములు వ్యవధియున్నదని యుపేక్షజేసిన, నెంత హానియో నీవు గ్రహింపలేకున్నావు. శీఘ్రముగ దానిని కడతేర్చిననే కాని ముందున్న కార్యములు సాగవు!" అని బ్లాకీ రోజాతో బల్కెను.

"అయిన నీయిష్టము. కాని యీమర్కటమంత సాహస కార్యము జయించుకొని రాగలదా, యనిసంకోచించుచున్నాను."

* * * *

రోలో, తన గదిలో టేబిలుదరి గూర్చుని, రసాయన శాస్త్రగ్రంథము నొకదానిని పఠించుచు, మధ్యమధ్య తననోటు పుస్తకములో నేదో వ్రాసికొనుచుండెను. నిరూపకుడు కూర్చునియున్న గది, నలుచదరముగనుండి, విశాలమై, యుద్ధమువలె శుభ్రముగనుండి, కొలదివస్తువులచే నలంకరింపబడి యుండెను. ఆయన శయనించుటకు మెత్తని దూదిపఱుపుతో నొకవైపు యినుపచట్టపు పందిరిమంచ ముండెను. టేబిలుదరి యాయన కూర్చునియున్న కుర్చీకాక, వేరొక సోఫా కుర్చీయును, యింకొక బెత్తుకుర్చీయును, యుండెను. టేబిలునకు కుడివైపున నొక పెద్ద బీరువా పుస్తకములతో నిండియుండెను.

దక్షిణమున నున్న కిటికీ గాజుతలుపులతో మూయబడి యుండెను. గది ద్వారమునకు వ్రేలగట్టబడిన తెర క్రిందవరకును జారి పడుచుండెను. నిశ్శబ్దముగనున్న యాగదిలో నొంటరిగ గూర్చుని రోలో వ్రాసికొనుచుండ, టేప్రిసీ ప్రవేశించి, యతని యెదుటనిలచెను. రోలో వానిని కూర్చుండుమని కుర్చీ జూపి, "టేప్రిసీ, ఇంత రాత్రియప్పుడు తిరుగ వచ్చెదవని యనుకొనలేదు. నీకొఱకై కొంతదనుక నిరీక్షించి, మరి నేడు రావని నిశ్చయించుకొంటిని. నీవేగిన కార్య మేమైనది?" అని యనెను.

రోలో చూపిన యాసనమున సుఖాసీనుడై టేప్రిసీ కొంతదనుక నేమియుబలుకక, చిరునవ్వు నవ్వి జేబులోనుండి యొక యుత్తరము దీసి, రోలో కిచ్చెను. రోలో అందుకొని,

యాలేఖ జదివి, యేమియు నర్థము జేసికొనలేక, యాలోచించుచు గూర్చుండెను.

"కొలది దినములలో వచ్చుచున్నాను. నే జచ్చితినని యెల్లరు దలచుట మంచిదే నైనది.

ఫ్రాన్సెస్ బొగ్నాడ్."

"ట్రిసీ, ఈ యుత్తరమున కర్థమేమి?" అని గోలో యనెను.

"(చిరునవ్వుతో) ఇందుమూలమున టామీ జీవించి యున్నాడనియే గాక, కొలదిదినములలో వా డిచ్చటికి వచ్చున్నాడని కూడ విశదమగుచున్నది."

"(తన డైరీపుస్తకము దీసి, యందు బొగ్నాడ్ లేఖను వ్రాసికొని) అయిన, వాని నిజమగు నామ మిదియేనా?"

"అవును."

"ఈ యుత్తరమును హోటలువద్ద నే సంపాదించితివా?"

"అవును."

"ఎట్లు?"

"నే నచ్చటి కేగుసరికి, నెల్లీ యీ యుత్తరము గల కవరు విప్పుచుండెను. అంత నే నామెను సమీపించితిని. నే దగ్గరకు రాగానే, నెల్లీ, యుత్తరము నటుమరచి, నాకంఠము బట్టుకొని-"

"సరియే, అటులైన నీ వీయుత్తరమును తీసి భద్రపరచితి వని యామెకు దెలియదు?"

"కాదు. ఆమెకు నే నీయుత్తరముదీసి చదివితినని కూడ దెలియును."

"(ఆశ్చర్యముతో) అయిన, నెల్లీ నిన్నుమాననీక,

నీచేతి కీ లేఖ నిచ్చినదా?"

"లేదు లేదు. ఉత్తరము జదివి బల్లపై బడవేసి, నెల్లీతో నాకు తీవ్రమగుదాహము పుట్టుచున్నదని యంటిని. ఆమె వెంటనే లోనికి జని యొక షాంపేని బుడ్డి దెచ్చి మూత దీసెను. రెండు గ్లాసులలో నాద్రాక్షరసము బోసి, యామె చూడకుండ మత్తుమందు నొకగ్లాసులో గలిపితిని నే నొక గ్లాసును సేవించుచు, నెల్లీనికూడ త్రాగుమని బలవంతముచేసితిని. నామాట ద్రోసివేయలేక, యామెయు, గ్లాసుపై త్రాగనారంభించెను. కొంతసేపటి కామెకు చైతన్యముతప్పి, పిచ్చిదానివలె నయ్యెను. సోఫాపై నామెను పడుకొనబెట్టి, యీ లేఖ గల కవరుదీసి యుత్తరమునుసంగ్రహించి, మరల కవరునట్లు బానైచి, తలుపులు మూయకనే, గదివీడి, వెలుపలికి వచ్చితిని. పూర్తిగా నామె కింకను స్మారకము దప్పియుండక మునుపే, నామెతో వెర్రివెర్రి ప్రేమవాక్యముల బల్కుచు, డెర్నాడ్ సంగతి యడిగితిని. ఆమె మాటలబట్టి నాడే డోవరా యని నిర్ధారణజేసికొంటిని.

* * * *

అర్ధరాత్రము కావచ్చినది. జనసంచారము తగ్గి పట్టణమెల్ల నిశ్శబ్దముగ నుండెను. జనులు వారివారి కార్యములు నాటికి ముగించికొని, శయ్యలజేరి నిద్రామదితులై యుండిరి.

గోతిని వెంటబెట్టుకొని బ్లాకీ వచ్చుచుండెను. యమభటునివలె నిర్దయత్వమూని యొక ప్రాణనాశనమునకై యుక్తి బన్ని యరుదెంచుచున్న బ్లాకీ నవ్వును చూడగలుగువారికి, వాడొక పిశాచమువలె నగుపడును. నల్లని దుస్తుల ధరించి, శిర

సున్నమిాదుగా నొక యున్నివలువ గప్పుకొని, రోడ్డుప్రక్క నుండి నడుచుకొని వచ్చుచున్న యా కురూప పురుషుని హృదయమెంత కఠినమైనదో కాని, వానికెట్టి కఠిన కార్యములలో నైనను జంకులేకుండెను. నాటి నిశా సమయమున, తన పెంపుడు కోతిని వెంట దీసికొని బ్లాక్, నడచి నడచి, తుదకు రోలో నిద్రించియున్న గది కిటికీవద్దకు వచ్చి నిలచెను.

కురూపకుడు తన సహచరుడగు పేర్సీని పంపివేసిన పిదప, కొంతదనుక నేమో యాలోచించుకొని, రాత్రి యగుటచే జాలకాలము మెలకువతో నున్నచో, దేహారోగ్యము చెడు నని యెరిగి, సెజ్జజేరి, పండుకొనియెను. పగలెల్ల బనిలో నీదులాడు చుండుటచే, వానికి గన్నులు మూయగనే తెలివిదప్పి నిద్ర పట్టవలసినది. కాని నాడు వానికి కన్నులనిండ నిద్ర రాకుండెను. సెజ్జ జేరిన దాదిగా, వాని కొక మనోహారిణి మోహనాకారము కన్నులయెదుట నాట్యమాడు చుండెను. బ్లాకీని జయించుటకు సిద్ధిగట్టి, సాహసముతో బని చేయుచున్నాడే కాని, రోలో నిజవైరియగు మన్మథుని బారికి దాళలేకుండెను. మేరీపై వాని మనసు తగుల్కొని, మరలించుటకు వాని నశక్తునిగా జేసెను. గదిలోనుండిన విద్యుత్కాంతిని, వెన్నెలలోని మెరపువలె, లేనవ్వు వాని ముఖమంతట నాక్రమించ, కన్నులు మూసియున్నను, వానిని మెలకువలో నున్నవానివలె నగుపడ జేయుచుండెను.

బ్లాకీ సులభ సాధ్యముగ కిటికీ తలుపుల నూడదీసి, జూలీ చేతికొక వాడి చురకత్తి నిచ్చి, కోతిని మరల మరల దువ్వి, దాని చెవులో నేమో చెప్పి, లోనికి బంపెను. చప్పుడు

చేయక కొత్తిలో బ్రవేశించి, రోలో శయనించియున్న మంచము నెక్కెను. క్లాకీ కవాటము దరినిలచి కనిపెట్టుచుండెను.

కమ్మని నిద్దుర కన్న, భూలోకమున నానంద దాయక మగు యుత్తమావస్థ వేరొండులేదు. మెత్తని దూదిపరుపు పై మేనువాల్చి, వెచ్చగ బండుకొన బోవు సమయము కన్న, మెలకువావస్థలో ముదము గూర్చు తరుణము వేరేదియు లేదు. శయనించ బోవునపుడు, మనకు, పొందవలసిన మేలు, ముందుకింక రానున్నదని దెలియుటచే, హృదయమునందొక విధ మగు తాపి, వెచ్చదనము, ఆమోదము, ధీరత్వము—ఒక సర్వ రాగసమ్మిళిత వికారము, జనించును. పగలెల్ల బనిపాట్లచే నలసి యుంటచే, శరీరము చైతన్యావస్థ నుండి దూరపడుట కాయత్త పడుచుండును. జోకొట్టుచుండిన తల్లిచేయి ముద్దుబిడ్డనుండి తీసివేయబడినట్లు, కనులను మూసికొనిన పిదప, మెల్లమెల్లగ మనకు తెలివితప్పి, యొక నిర్వ్యాపారావస్థ వచ్చును. దానినే పెద్దలు నిద్ర యనిరి. నిద్ర, పెద్ద నిద్దురకు దోబుట్టువు! అట్టి యవస్థలో మనకీ ప్రపంచముతో నెట్టి సంబంధమును లేదు. అంతయు మరచి యొక దివ్యస్థితియందుందుము.

ఒకానొకప్పుడట్టి గాఢనిద్రయందుండక, మనము కలతనిద్దురకు లోనగుదుము. అత్తరుణమున మనకు స్మారకము దప్పియే యున్నను, ప్రపంచజ్ఞానము పూర్తిగ నుండక పోదు. శయనించియే యుందుము—కన్నులు మూతపడియే యుందుము—కానియొక విధమగు తెలివిగొనుందుము. అట్టి యవస్థలో శరీరము మన యధీనమునం దుండదు. కాని మనసు మాత్రము స్వాధీనమై యుండును. ఈ సగనిద్రకును, మెలకువకును, మధ్య

నిదానించి, పిమ్మట టేబిలుపై పడియుండిన వార్తాపత్రిక నంది కొని చదివెను. తోడనే, యిదివరకు మందహాసప్రవృత్తమై యుండిన యామె ముఖబింబము నిశ్చలత నొంది కాంతిహీన మయ్యెను. పత్రికయం దామె చూచిన విషయ మిట్లుండెను:-

గోదావరీ మూలలు

# డాక్టర్ రోలో మహాశయుని

## ఆకస్మిక మరణము!

కడచినరాత్రి యాయన సుఖనిద్ర నున్న యవసర మున, గదిలో నొక పెద్దజాతి మర్కటము ప్రవేశించి, మంచము నెక్కి, యొక చురకత్తితో నిరూపకుని యెడ మభుజముపై బొడిచినది. కోతి గదిలో నేలపై గుండు దెబ్బవలన జచ్చి పడియున్నది. మోటుగాయము తగిలి యుంటచే, రోలోగారు మంచముపైనుండి లేవ నశక్తులై యుండిరి. ప్రక్కనేయున్న గంట నాయన మోగింప, పెర్సీ యను సేవకుడు లేచి గదిలోనికి వచ్చి చూచెను. యజమానుని యాజ్ఞప్రకారము డాక్టరు కెన్నీకి వర్తమానము బంపబడెను. ఆయన వచ్చి, తగిన యుపచా రముల జేసెనేకాని, రక్తము స్రవించుచునే యుండెను. ఉదయమున డిటెక్టివ్ ట్రేసీ, యిన్స్పెక్టరు, మేయో మొదలగువా రందరును వచ్చిరి. లాలీ మందిరపు యజ మానురాలగు మేరీ కూడ వచ్చి యాయన దరి గూ ర్చుండెను. గాయము తుద కాతని సామ్మసిల జేసి, ప్రాణముల హరించెనని తెలియవచ్చినందుల కందరును దుఃఖించవలసియున్నది.

సహజముగ నాడువారు మెత్తని హృదయము గలవారు. పాపభీతి వారి కనికము. సుఖదుఃఖములు వారి చేతముల నల్లలలాడించునట్లు, మగవారిని చేయజాలవు. నిరూపకుడు చనిపోయెనని తెలియరాగానే, రోజా వ్యాకులచిత్తయై, తొలుత నా పత్రికలోని వార్త విశ్వసించక, మరల జదివి, బ్లాకి నుద్దేశించి,

"ఇది నిజమే యందువా?" అని మెల్లగ బ్రశ్నించెను.

"ఏమి? యనుమాన మెందుకు? మన 'కూలీ' వానిని భుజముపై బొడుచుట నే గన్నులార జూచితిని. ఆ గాయము వలన రోలో చచ్చియుండుట కభ్యంతరము లేదు. కాని పాపము నోరులేని జంతు వొకటి మృతి నొందవలసి వచ్చెగదా యని విచారించుచున్నాను. కూలీ చాల విశ్వాసముగలశక్తి!"

తన వైరి చచ్చెగదా యని మదమందుచుండిన మగనిపై నొకసారి దీర్ఘముగ జూచి, యా మగువ మొగము దించుకొని, "పాపము శమించు గాక!" అని తనలో మెల్లగ విని వినబడున ట్లుచ్చరించుకొనుచు, వెనుదిరిగి, గది వీడ బోయెను.

ఆమె నడవడిక గనిపెట్టి, బ్లాకి ముందు కొక యడుగు వచ్చి, సుందరిని కరమున బట్టుకొని, "రోజా, ఏ మట్లు గొణుగుచు నరుగుచున్నావు? రోలో మృతి నొందుట నీ కంతగా నిష్టము లేన ట్లున్నది — కారణమేమి?" అని యడిగెను.

"ఆయన మరణించిన మన కేమిలాభము?"

"సరిసరి — అటులనా యంటివి? రోలో చచ్చిన వెనుక మన మేకార్యము దలపెట్టినను యాటంకము లుండవు. వాడు సామాన్యుడు కాడు. ఈ కేసులో రోలో, పానకములో పుడక వలె నడ్డువచ్చి, నే దలపెట్టిన కార్యముల కన్నిటికిని భంగము

గలుగజేయుచున్నాడు. లేకున్న నేనే నీసరికి గోటీశ్వరుడనే."

"నాథా, నిజమే కాని, విత్తమున కాసించి, యొక యుత్తమపురుషుని వధించవచ్చునా?" అని రోజా మెల్లగ విచారసూచక కంఠముతో బలికెను.

"న్యాయాన్యాయ విచక్షణలలో దిగి, స్వలాభముల బోగొట్టుకొనువానికి నా యుద్యోగము తగదు" అనుచు బ్లాకీ కోపించెను మొగ మ్ముఱ్ఱజేసి రోజావైపు జూచెను.

"కాని యొకప్పుడు 'నిరపరాధుల దుఃఖపెట్ట' నని నాతో వాగ్దానము జేసియుంటిరే! లాలీని నడతేర్చుటకు నేనేమైన నాటంకము జెప్పితినా? అప్పటి స్థితిగతులు తల మునించి తాటి ప్రమాణమై యుండెను. లాలీ మిక్కిలి పట్టుదలతో గుట్టు బయలు బెట్ట సిద్ధపడెను. స్వరక్షణ నీ కప్పుడు విధియై యుండెను. లాలీని వధించకుండినచో, నీ కప్పుడు ముప్పు తప్పకుండును. కాని, పాపము రోలో మన కేమిహాని యొనర్చెను? అష్టకష్టములకు లోనైన యొక యనాధను కాపాడుచున్నాడు. చాల చిన్నవాడు కూడను. లాలీ యన్ననో, మిగుల వృద్ధుడు. లోకానుభవము లన్నియు దీరినవాడు."

"అయినను, రోజా,— ఈ యుపన్యాసము నిచ్చుటలో నీ భావ మేమి?" అని మొగము చిట్లించుకొనుచు, బ్లాకీ యడిగెను.

"ఏమియును లేదు. రోలో మరణము నాకు మిగుల విచారము గొలుపుచున్నది. అదియునుగాక, మీ రేమో [illegible]న వాని యసువుల హరించుటలో ఘనత యేదీ? బుద్ధికుశలతను జూపుకొనుటకు నాకు నవకాశ మొసగి, వానిపై [illegible] గట్టవచ్చును— అది నిందనీయము కాదు. ధర్మయుద్ధమున జయము

ముంగిన గదా చెప్పు!" అనుచు రోజా యేమియు జంకక, ధైర్యముతో దన యూహల నన్నిటిని వెలిబుచ్చెను.

ఆమెపలుకుల నాశ్చర్యముతో నాలించుచు, బ్లాకీ కొంత సేపటిదనుక నేమియును మారు వలుకక, యూరకుండెను. పిమ్మట వాడొక వాలుకుర్చీపై గూర్చుని, నిజపతి నొకప్రక్క యాసనముపై గూర్చుండజేసి, తదేకదృష్టితో నామెను జూచుచు, "అయిన రోజా, రోలో గతించెనని నీవింతవగవనేటికి? వానిని నే జంపుట నీ కిష్టము లేకుండిన, దొలుతనే య ట్లేల నాతో జెప్పకుంటివి?" అని యాలోచించుచు బల్కెను.

"మున్ముందు నన్నే విషయమున గూడ వ్యతిరేకముగా మాటాడవల'దని యాజ్ఞాపించితివే. అటుపై 'కూలీ' ని నీవు దీవింప నన్ను బిలచినదనుక, నాకు నీ యుద్దేశ మేమియు దెలియలేదు. ఇంత శీఘ్రముగ నీ విట్టి సాహసకృత్య మొనర్చెదవని నే ననుకొనలేదు. అదిగాక, 'కూలీ' ని నీవు చేరదీసి దువ్వనపుడు, 'తొందరయేల' నని నే ననలేదా? నా మాటల నప్పుడేమైన బాటించితివా? ఇప్పుడు వగచి యేమిప్రయోజనము? నిరపరాధులగు రెండు ప్రాణము లిప్పుడు వృధా నశించినవి! రోలో యొకడు—మన 'కూలీ' యొకతె! కోతిని చేతులారా నీవే చంపుకొంటివి!"

"రోజా, ఆలోచించక నే నీకార్యము జేయలేదు. రోలో వలన నాకు హాని రాగలదని యెంచి, యిట్టిపని కియ్యకొంటిని. అందుకు దోడు ధనాశ కూడ మెండాయెను. అయిన దయినది. ఇప్పుడు వగచిన లాభ మేమి? ఇటుపై కర్తవ్యము నాలోచింపవలెను. నీట దిగినవెనుక లోతుకు జంక రాదు. పోని

ము—పీటరు చెప్పిన 'పిలు' విషయమై నీ వేమం దువు?" అని బ్లాకీ భూకొని సమాధానపరచుచు, నడిగెను.

"నా కేమియు దెలియదు. ఇట్టుపై నాతో నేమియు జెప్పకయే చేయుచుండుము" అనుచు నలిగినదానివలె, కుర్చీ నుండి దిగ్గున లేచి, వెనుదిరిగి లోనికి జన నెంచెను.

వెంటనే బ్లాకీ యామెను దన కరమున బట్టుకొని "రోజా, నీవుకూడ నిట్లే యనిన, నా మనసె ట్టుండును? నీ పలుకులు ములుకులవలె నా హృదయసీమ నగులుచున్నవి. యోచించక నీ వనుచుండిన మాటలు నా కెంతయు నొచ్చుచున్నవి! కార్య సిద్ధికై నే నింతటి తెగింపు పని బూనితినని నీ వెరుగుదువు. టామీ మృతినొందుట యింత చేసినది." అని మెల్లగ ననెను.

"టామీ చచ్చినట్లు రూఢిగ దెలియదే? 'తుపాను' సమసించినచో, వా డేటికి చావవలయు? అదృష్ట వశమున బ్రతికి యుండునేమో, యని యేల దలపరాదు?........ఏమైనను నీ వీ విషయమున జాల తొందర పడితివి! నాకందుకు మిక్కిలి విచారముగానున్నది. నిజముగ రోలో మరణించియే యున్న—"

"రోజా" అని యింక నేమో యనుచుండగనే బ్లాకీ యామె నాపి, "రోజా, నీ కింక నిట్టి యనుమానమేల గల్గుచున్నదో తెలియకున్నది! 'మరణించియే యున్న—' అని యనుటలో నీ యుద్దేశ మేమి?" అని ప్రశ్నించెను.

రోజా యేమియు బదులు పలుకక, యూరకుండెను.

* * * * * *

"ఏమిది? ఈ మగువ యేమియు విచారములో నున్న దానివలె నగుపడదే? అరే, నా నీడ జూచి నేనే భయపడితిని!

ఈమె నిక్కముగ వానిని ప్రేమించియుండదు. లేకున్న నీ సంగతికి తల్లడిల్లు చుండునా? రోలో యామె ప్రియుడైయుండినచో, వాని మరణ వార్త కామె యెంత దుఃఖించవలసి యున్నదో?” అనుచు దనలో నింకనేమో తలపోసికొనుచు, పీటరు నాటి యుదయమున రాస్ మందిరమున యాఫీసు చావడిలో బచారు చేయుచుండెను.

ఇంతలో రాస్ మేడ మీదికి వచ్చి, ఆఫీసులో బ్రవేశించెను. పలువురను పలుకరించి, వాడంత దన యథాస్థానమున గూర్చుని పని చేసుకొనుచుండెను.

“రాస్— నేటి పత్రికలో రోలో చనిపోయెనను వార్త జూచితివా?” అని పీటర్ సెక్రెటరిని ప్రశ్నించి యడిగెను.

“చూచితిని. పాపము చాల యోగ్యుడైన చిన్నవాడు. నాకు పరిచితుడు. ఆయన గతించెనని విన్న దగ్గర నుండియు నా మనసు మనసువలె లేదు. నా యజమానురాలెంత విచారించుచున్నదో? ఆమెకు రోలోపై విశ్వాసము మెండు. తన తండ్రి హత్యా కేసులో నామె ప్రత్యేకముగ వానినే నియమించినది.” అని సెక్రెటరి తన విచార గ్రస్తతను వెలువరచెను.

“ఆమె మన మనుకొనినంత దుఃఖములో లేదు! ఉదయమున జే. సీ. లన రోలో మరణవార్తవిని, యామె లోకమునకు వచ్చి, యొకసారి శవము జూడనేగెను. మరల వెంటనే మోటారుపై యరుదెంచెను. కాని యెవ్వరితోడను మాటలాడకున్నది.” అని పీటర్ ఆశ్చర్యముతో ననెను.

రాస్ తృప్తిపడి, “ఏమి? ఆమె విచారగ్రస్తురాలివలె లేదా?” అని, బొమలు పైకెత్తి యాతురతతో బ్రశ్నించెను.

"లేదు"

"ఓయ్యా, నీవు పొరబడియుందువు. ఆమె యంత కఠిన హృదయ కాదు. అందులో గోలోనమే స్మృతినొందెనని వినినప్పు డామె యాందోళన మెట్లుండునో, నాకు తెలియును" అని సెక్రటరి పలికెను.

* * * *

నాటి సాయంకాలము జూలియా మేరీ లిరువురును కూర్చుని సంభాషించుకొనుచున్న సమయమున, టెలిఫోనులో ట్రేసీ నుండి గంట వినవచ్చెను. బాలికల నిరువురను లేబొరేటరీ కొకసారి రావలెనని ట్రేసీ ప్రార్థించెను. వెంటనే బయలుదేర నాయత్తపడి, మేరీ తన మోటారును సిద్ధము జేయుమని యొక సేవకుని కాజ్ఞాపించెను. ఆమె జూలియాతో మేడ దిగనున్నప్పుడు, రాస్ యెదురుగ వచ్చి, మేరీ నుద్దేశించి, "నాకొక మూడు దినములు సెలవొసగ వేడుకొన్నాను. అవసరమగు కార్యముపై నేటి రైలుపై నే నొక గ్రామమునకు బోవలసియున్నది." అని పలికెను.

"అటులనే కానిమ్ము. త్వరలో మరలి వచ్చుటకు బ్రయత్నింపుము. ఆఫీసు మూసి పొనుము" అనుచు మేరీ వానికి సెలవొసగి, మేడదిగి మోటారు నెక్కెను.

పీటరు, సోఫియాను తోడ్చుకొని కొన్ని దినుసులను కొనుటకై బజారునకు బోయియుండెను. పాలిక్ మాత్రము గృహముననే యుండెను.

మేరీ జూలియాలు లేబొరేటరీకి జేరునప్పటికి నచ్చట యథాప్రకారము, వాకిట పెన్నీ గూర్చుని యుండెను. లోనికి

జని, వాడు ప్రిన్సీకి మేరీ రాక నెరుగ జేయగనే, "రమ్మనుము" అని ప్రిన్సీ పల్కెను. పెర్సీ వారల దోడ్కొని యొక గది బ్రవేశించెను. ప్రిన్సీ, కెస్సీ, మేయోలు ముగ్గురును మాటాడు కొనుచు నాగదిలో గూర్చుండి యుండిరి. మేరీ జూలియాలు కూడ నచట సుఖాసీనులైరి. పిమ్మట వారందరును చాల సేపటివరకు నేమో మాటాడుకొనిరి.

లేబొరేటరీవీడి, మరల లాలీ మందిరమునకు మరలు చున్నప్పుడు, మోటారులో సంభాషించుకొనుచు, బాలిక లిరు వురును యుప్పెనగా నవ్వుకొనుచుండిరి.

* * * * *

నాటిరేయి లాలీ మందిరమున నందరును కమ్మగ శయనించిన వెనుక, పీటరు లేచి తన గదిలోనుండి వెలుపలికు వచ్చి, ద్వారము చెంత నొక్కింత దనుక నేమో యాలోచిం చుచు, నిలచెను. చేత నొక తాళము బట్టుకొని వాడు చప్పు డు జేయక, "రాస్ ఆఫీసు" చావడి ద్వారమువద్దకువచ్చి, మె ల్లగా దలుపుల దీసెను. ఆఫీసు లోనికి జని, మరల గవాటము మూసి, యార్పియుండిన దీపముల వెలిగించకయే, చీకటిలో కొన్ని యడుగుల దూరము నడచి, కొంచె మాలోచించి, తన జేబునుండి యొక విద్యుద్దీపము దీసి, వెలిగించి, చేత బట్టుకొని నాలుగు వైపుల బరీక్షించెను. అంత నొక మూలకు వాని కొ క యినుప "సేఫ్" (అనగా ఖజానా దాచుకొను పెట్టె) యగుపడెను. లాలీ వ్రాసియుంచిన 'వీలు' కాగితమా 'సేఫు'లో నుంచబడినట్లు బ్లాకీ వానికి దెలియజేయ, పీటర్ వాని నడిగి యెట్లో వాడు సంపాదించి యుంచుకొనిన తాళముల నడిగి పు

చ్చుకొని సులభముగా సేఫ్ తెరచి, తన ప్రకాశమానమైన చేతి లాంతరు వెలుగులో, పెట్టెనంతయు గాలించి వెదకి తనకు గావలసిన కాగితములను సంపాదించెను. పిమ్మట మరల సేఫ్ తాళము బిగించి, యానందముతో మెల్లగ దగ్గరగా నవ్వుకొనుచు, ఆఫీసునుండి వెలుపలికి వచ్చి, తలుపులు మూసి, తన పడక గది జొచ్చెను.

ఆ సేఫ్-రహస్యము నెరిగియుండినచో పీటర్ తగిన జాగ్రత్త వహించి యుండును. కాని పెట్టె గుట్టు వానికేమియు దెలియదు. అది యొక అమెరికా దేశపు కొత్తరకము పెట్టె. మిక్కిలి బలిష్ఠమై యుండుటయే గాక, యా ఖజానా పెట్టెకు దొంగలు బట్టు నేర్పుకూడ గలదు! సేఫ్ లోపల నొక కెమేరా యంత్ర మతి నేర్పుగా నమర్చబడి యున్నది. పెట్టె తెరువ బడగనే, తెరచువారి రూపపటము వారికి తెలియకనే ముద్రించబడును. పన్నతాళించిన పీటర్ ఫొటోగ్రాఫుము స్ఫుటముగ ముద్రించబడి, సేఫులో నిమిడియుండెను. ఆ సంగతి వానికణుమాత్రము దెలియకుండెను. 'ప్రతులు' సంపాదించగలిగినందుల కపరిమితానంద మంది, పీటర్ తక్షణమే గృహము నుండి పీలు జేసికొని వెలుపలి కేతెంచి, బ్లాకిని కలిసికొనుటకై చీకటిలో నడచుచుండెను.

“బ్లాకి నిజముగా సామాన్యుడు కాడు. మాటు ఖరారు ప్రకారము మున్నుందు రోజులోనే చంపగలిగినాడు! పీలు సంపాదించుటకు నాకు తోడ్పడి, యీ తాళము చెవుల నొసగను— ఎట్లుపదేశ మిచ్చెనో, యట్లే నడచి చూడ, నిజముగా నాయత్నము ఫలించినది. వానికా తాళము లెట్లు దక్కెనో తెలి

వస్తువు నావద్ద నుంచుకొందును" అనుచు నాపురుషుడు 'తా నంత సామానేల గొనుచున్నా'డని యడిగిన వారితో నెల్ల జెప్పుచుండెను. పుస్తకముల వేలాము వచ్చినపుడా పురుషుడు" "అన్ని గ్రంథములును కలపి యొక్కసారి వేలాము పాడుడు, అని సలహానిచ్చెను. అందు కెల్లరు నంగీకరించిరి. ఎంతధర కైన నాపుస్తకముల దానే కొనుట కా పురుషుడు నిశ్చయించుకొనెను. కాని, మూడవ సారి పాటకు, వానికన్న నధికవెల, దాపాడి మేరీ తా గ్రంథముల నన్నిటిని తీసికొనెను. అందు కా పురుషుడు కోపించుకొని, "స్త్రీలకీ గ్రంథము లేలనో!" అని తన ప్రక్కనున్న వారితో మెల్లగ విసుగుకొనుచు ననెను.

"స్నేహమే!—రాలోపై నామెకు గల భక్తిచే మేరీ కొనినది" అని ఒకడు బదులు పలికెను. కోపించుకొనుచు నా పురుషుడు మేరీపై నొక్కసారి నిదానించి చూచెను. మేరీ, మోటారులో గూర్చుని యుండి, యా పురుషుని ముఖవైఖరి గమనించి జూలియాతో మెల్లగ నేమో చెప్పి, చిరునవ్వునవ్వెను. అంత జూలియా, యా పురుషుని వైపొక్క సారి చూచి, యామె కేమి దప్పినో కాని, మేరీని భుజముపై దట్టుచు, "యిప్పుడే వచ్చెద నుండుము" అని పలికి, మోటారునుండి దిగి లేహారేటకి హాలులోనికి జనెను. ప్రిన్సీ జూలియా లేమేమో కొంతసేపు మాట్లాడుకొనిన పిదప, మేరీవైపు కోపదృష్టితో జూచిన పురుషుని ప్రిన్సీ నిదానించి క్షణముదనుక జూచెను. పిమ్మట వాడు జూలియా చెవిలో నేమో చెప్పి, యామెను వరల మేరీవద్దకు బంపివేసెను. జూలియా మోటారుపై నెక్కి, తన చెలియ ప్రక్క గూర్చుండెను.

"మేరీ, యిప్పుడేలనో యాపురుషునివైపు జూచుటకు నాకు భయమగుచున్నది."

మేరీ పక్కున నవ్వి, "ఎంత నంగనాచివే? నీకెప్పుడు నిట్టి బెదరులే కలుగుచుండును. గ్రేసీతో గుసగుసలాడి యిప్పుడే రాబట్టి, యా యువకునితప్ప. నింకేపురుషుని చూచినను నీకు భయమే!" అని యెగతాళి జేయసాగెను.

"చెలీ, పరిహాసము కాదు. నిజముగనే భయపడుచున్నాను. నామాట నమ్ముము." అనుచు జూలియా, రహస్యముగ మేరీ చెవులో నేమో గొణిగెను.

అంత మేరీ భయాశ్చర్యములతో గక్కురు మనెను. గాని వెంటనే యేమో సమాధానము జేసికొని, జూలియా చెప్పిన యాలోచనకు సంతసించి, యామె చేతినుండి కమేరాను తా దీసికొనెను. యంత్రమును సరిజూచి, మేరీ యంతట నాపురుషుని రూపపటమును తీసెను.

"చెలీ, మేరీ, ఆ మోటారులో నున్న యువతి వాని సాధ్వి వలె నున్నది?"

మేరీ తలయూచి, "అవును కాబోలును. ఆమె 'ఫోటో' గూడ దీసెద నుండుము" అని కమేరాను మరల సరిచూచి పట్టుకొనెను. ఆ దంపతుల ఛాయాపటముల దీసిన వెనుక, మేరీ జూలియా లొండొరుల జూచుకొని, చిరునవ్వు నవ్విరి.

వేలాము ముగిసిన పిదప, గ్రేసీ లేచి, దుస్తుల సవరించుకొని, తన పెంపుడు కుక్కను వెంట బెట్టుకొని, చేబెత్తము నాడించుచు, మెల్ల మెల్లగ నడచి బిల్లీహోటేలుకు ప్రయాణమందెను. హోటేలుకు వచ్చి, యందరికన్న నధిక సామగ్రి

కొనిన నూలిమగలు సామానుల మోటారులో బంపివేసి, బిల్లీ హా· హోటలువద్ద దిగి, లోనికి జనిరి. సేవకు డొకడువచ్చి, సలా మొనర్చి, కూర్చుండుట కా దంపతులకు నాసనముల చూపి, ''ఏమి కావలయును?' అని సవినయముగ నడిగెను.

"బిల్లీ యెక్కడ?"

ఆ సేవకు డంత లోని కేగి, యజమానుని దోడ్కొని వచ్చెను. బిల్లీ నూ వచ్చిన వారిని బుగకరించి. లోనికి రమ్మని చేసి, వారిని దోడ్కొని యొక గదిలోని కేగెను. గది జొచ్చిన వెనుక, దలుపుల మూసికొని, వారు మువ్వురును సుఖాసీనులై, తమలో దా మేమో రహస్యముల మాట లాడుకొనజొచ్చిరి.

హోటేలుకు వచ్చుచు, ట్రిసీ మార్గమున నొక పోలీ సుభటుని పిలచి, తన డైరీపుస్తకము నొకసారి తెరచి చూచి, వాని నిట్లు ప్రశ్నించెను:

ట్రిసీ—ఓయీ, అరగంటలోపున నీ మార్గమున నెన్ని మోటారు లేగి యుండెనో, చెప్పగలవా?

పోలీసు—సుమా రేడెనిమిది పోయి యుండును?

"గోధుమ వన్నె మోటా రం దేదైన నుండెనా?"

"(కొంచె మాలోచించి) అట్టి రంగువి రెండు బండ్లు పోయినట్లు జ్ఞాపకము."

"రెండును, ఒకే సైజువా? లేక—"

"కావు—అం దొకటి పెద్దదియు, మఱొకటి చాల చిన్నదియును."

"పెద్దబండిలో నెందఱు కూర్చునిరో తెలియునా?"

"బండి నడుపువాడు కాక మఱి యిరువురు."

"వా రెవరో యెరుగుదువా?"

"ఎరుగను. ఎవరో ధనికులవలె నున్నారు. భార్యాభర్త లనుకొందును."

"పోనిమ్ము; ఆ మోటారు నంబరు చూచితివా?"

"చూచితిని కాని జ్ఞాపక ముంచుకొనలేదు."

"మోటారే వైపుకు బోయెనో చెప్పగలవా?"

"ఆవైపు (అని బిల్లీ హోటేలున్న దిక్కు వ్రేలితో జూపెను)."

'సరియే,' యనుచు, పోలీసువాని చేతిలో నొక నాణెము నుంచి, వడి వడి హోటేలువైపు ట్రెసీ నడచుచుండెను. శునకము వెన్నంటి యాయనతోనే యరుగుచుండెను. హోటేలుకు జని, ముందుచావడిలో నున్న సేవకుని దగ్గరకు బిలచి, మోటారుపై నిప్పు డెవరైన నిచ్చటికి వచ్చియుంటిరా?" అని ప్రశ్నించెను.

"ఎవరో యొక పురుషుడును, వాని చెలియు గలసి వచ్చిరి" అని వాడు ప్రత్యుత్తర మొసగెను.

"వా రేరి?"

బిల్లీ వా రిరువురను వేరొక గదిలోనికి దోడ్కొని పోయెననియు, వా రేదో రహస్యము మాట్లాడు కొనుచుంటచే గాబోలు, కవాటము మూసి లోన గూర్చుండిరనియు, సేవకుడు బదులు చెప్పెను. ఆలస్యము జేసిన మంచిదికాదని, ట్రెసీ వెంటనే కొంచెము పైక మా సేవకుని కొసగి, యా గదివద్దకు దన్ను దోడ్కొని పొమ్మనెను. తొలుత నొకింత జంకినను, చేతనున్న నాణెము జూచి, యభ్యంతరము జెప్పక, వాడు

ట్రేసీ నచ్చటికి దోడ్కొని పోయెను. సేవకుని పొమ్మని, కవాటమునకు సమీపమున నొక మూలను నిలువబడి, ట్రేసీ చెవుల రిక్కబెట్టి పొంచి యాలించుచుండెను. బిల్లీకంఠము ట్రేసీ యెరుగనిది కాదు. స్త్రీకంఠము సులభముగ బోల్పవచ్చును. ఆ మూడవ వాని గొంతుక యా నూతన పురుషునిదై యుండవలయునని ట్రేసీ నిర్ధారణ జేసికొనెను. వారి సంభాషణ యంతయు వానికి స్పష్టముగ వినరాకుండెను. మధ్య మధ్య కొన్ని పదములు దెలియనే తెలియకుండెను.

స్త్రీ—అయిన బిల్లీ, వానిజూడ నీకేమీ దెలియదా?

బిల్లీ— తెలియదు. కాని 'తుపాను' ......నిశ్చయము.

పురుషుడు—'తుపాను' లో నెక్కిన వా రెవరును జీవించి రాలేదా?

బిల్లీ—నాకు తెలియదు.

స్త్రీ—వాడు మృతినొంది యుండుననియే యందువా?—బిల్లీ, నీ యభిప్రాయ మేమి?

బిల్లీ—చచ్చె ననియే నానమ్మకము.

స్త్రీ—.....................................

పురుషుడు—రోజా, నీ కెంత కిట్టి యనుమానము. కలుగుచున్నదో తెలియకున్నది. రోలో గూర్చి కూడ త్రొలుత నీ విట్లే యంటివి?

స్త్రీ—పోనిమ్ము ఆ సంగతి యిప్పుడేల...బిల్లీ, నీ భార్య యేమిచేయుచున్నది?

బిల్లీ—నెల్లీయా? ఆమెకు శరీరమున బాగులేదట.

పిమ్మట కొంతవరకు నెవ్వరి మాటలును ట్రేసీకి విన

రాకుండెను. కుర్చీనుండి గదిలోని వారిలో నొకరు లేచి నిలబ
డినట్లు సవ్వడి యయ్యెను. తోడనే ట్రేసీ యటనుండి వెనుక
కువచ్చి, చావడిలో నిలబడెను. కుక్కను పిలచి, ట్రేసీ యొకటి
రెండు గదుల దాటి మేడమీదకు జని, నెల్లీ యుండు గదివద్ద
నిలచి, తలుపు దట్టెను.

*  *  *  *  *

సాయంకాలమున జూలియా చల్ల గాలికై సముద్రతీర
మున కేగ బయలు దేరెను. సన్నని పట్టుగౌను కట్టుకొని, వక్ష
స్థలమున నొక గులాబి పుష్పము ధరించి, చేత నొక గిల్టుకవ
రు పుస్తకము బట్టుకొని యామె మెల్లగా నడచుచుండెను.
అస్తమించుచున్న సూర్యుని బంగరు కిరణములు చెట్ల సందు
లనుండి యామెపై బడినప్పుడు, జూలియా సహజ సౌందర్య
ము ద్విగుణమై, కన్నులకు విందొసగుచుండెను. పట్టువలె మె
త్తనై, యుంగరములుగా బెరగిన యామె శిరోరుహములు పసి
డి వన్నెదాల్చి నొసటిపై బడినప్పుడు, చంద్రుని దోసిరాజన
జేయు నామె ముఖకమలము శోభాపరీవృతంబై యసమాన
సొగసుందనమును సూచించుచుండెను. హాయి హాయి యని
పింప వీచుచున్న మలయమారుత మామె ఫాలతలంబునవ్రాలిన
బంగరు ముంగురుల నల్లల నాడించుచు, జూలియా కెంతయో
ముదము గూర్చుచుండెను. దూరమున నగుపడుచున్న సృష్టి
వైచిత్ర్యముల కెల్ల నచ్చెరువందుచు, సుందరి తన హృదయ
మున నెట్టి చింతను జొరనీయక యానందమ్మున మైమరచి,
యరుగుచుండ తన కెదురుగ వచ్చుచున్న యొక తరుణ వయ
స్కునిపై నామె దృష్టిపారచిరునగవుతో వానింబలుకరించి లోం

దగపనిపై బోవుచుంటివా?'' యని ప్రశ్నించెను. సంతోషము తో వాడును 'లే' దనుచు తల నూచెను. 'జూలియా! నీతో వత్తునా? ప్రస్తుతము మ రేమియు ముఖ్యకార్యములు లేవు. బిల్లీ పశాలీలు వద్ద పని చాల త్వరగా ముగిసినది. ఇప్పుడచ్చటి నుండియే వచ్చుచున్నాను'' అని వాడు చిరునవ్వుతో ననెను.

''నీకిష్టమున్న రమ్ము — చల్లగాలికై పోవుదము.'' అని జూలియా యన, నా పురుషుడు తన హస్తము నామె బట్టుకొన నొసగి, యామెతో గలసి నడువ జొచ్చెను. ''టేరిసీ! మ రేమైన క్రొత్త సంగతులు తెలిసెనా!'' ఇంక నెన్ని దినములు మన మిట్లు నాటకము నాడవలెను?''

''కొద్ది రోజులలో నేమైన దెలియవచ్చును.''

''పోనిమ్ము — ఆ విషయములగూర్చి యిప్పుడేల మాట్లాడవలయును? వేరే సంగతులున్నచో జెప్పుము—''

''అవును నిజమే—సంతోష సమయమున విచారకరమగు సంగతుల నేల దల్చుకొనవలయు? ప్రకృతి శోభావంతమగు ప్రాతపసిండి మెరుంగుల దాల్చి, వృద్ధుల జీర్ణహృదయముల సయితము ప్రేమామోదముల నంకురింప జేయుచుండ, మనవంటి యువ్వనప్రాయు లేల యట్టి యానందము ననుభవింపరాదు?'' అనుచు టేరిసీ యామెతో గొంత దూరము నడచిన పిదప, ''జూలియా—ఇచ్చటి దారి రెండు పాయలుగ విభజింపబడినది, చూడుము. ఏవైపు మనము దిరుగుదము?''అని యడిగెను.

''నీయిష్టము.''

''అయిన నీ యొంటరి మార్గమున నేగుదము'' అని టేరిసీ యామె నా దారిని తోడ్కొని నడచుచుండెను. వెడల్పు

తక్కువగా నున్నను, ఆదారి కిరు ప్రక్కల సరివరుసను నాటబడిన వృక్షముల శోభచే, కడు రమ్యమై యుండెను. అన్య జన సంచారము లేని యామార్గమున జూలియాపెప్రిసీలు తమ యిచ్ఛకువచ్చిన రీతి స్వేచ్ఛగా మాట్లాడుకొనుచు, బోవు చుండిరి.

"చెలీ, నే డెంత హాయిగనున్నది?"

"అవును. నే డేకారణముననో నా హృదయము పట్ట రాని యానందమున మునిగి తేలుచున్నది."

"ఆనందము గోక్షీరము వంటిది. మోహాగ్నిపై వెచ్చగి లినచో, పొంగిపొరలుచుండును. నిర్మలమై, మధురమై, ప్రేమను యవ్వనరోగికి బలము నిచ్చు దివ్యౌషధము! మరియు నది దీప మువలె ప్రకాశమానమై తన వేడిమిని, నల్దిక్కుల బ్రసరింప జేయును. జూలియా, నీలో జనించిన యామోదజ్యోతి, దివ్యకాంతితో నా హృదయమును వెచ్చజేసి, వెలుగిచ్చు చున్నది."

(చిరునవ్వుతో) "ఈ సిద్ధులభాష నెప్పుడభ్యసించితివి?"

"నీ చెంత నున్న నెట్టి పురుషునికైనను వాని యంతరాత్మ యొకవింత భాషనునేర్పును. ఏమీ—గ్రంథములలో ఈ భాష కదా యుండును?" (అనుచు మెల్లగ నవ్వెను).

"ఉపమామూల్య గ్రంథమున నట్టికీర్తిని లేదనుకొందును." అనుచు చేతనున్న పుస్తకము జూపెను.

"అదే గ్రంథము?"

"రోమియో జూలియట్ నాటకము"

"విషాదాంత నాటకము—కాని, 'రోమియో జూలియా

టుల ప్రేమానురాగము నిరుపమానమైనది. ఆ జూలియటు వంటి యుత్తమ చెలియ నాకును లభించు నను యాశ కలుగు చున్నది."

"ఆ భాగ్యురా లెవతెయో కదా?"

"నీకు గోపము రాకున్న జెప్పెదను."

"నా కేటికి కోపము రావలయు?"

"అయిన వినుము. చాలదినములనుండి నీతో నీవిషయమై ప్రసంగింప నెంచియుంటిని. కాని సమయము చిక్కకుండెను. ఒకానొక స్త్రీరత్నమును నేను మిగుల బ్రేమించుచున్నాను. ఆ మెను జూచిన దాదిగ నామెపై నాకు భరింపరాని వలపు కలిగెను. రోమియోవలె నప్పటినుండియు నామనసు కలవరపడెను. నా జూలియట్ నన్నేలుకొనునో లేదో యను భయముతో డెందము బాధ నొందుచున్నది. అన్నివేళల నాసుందరి మోహనాకారమే నా కన్నులకు గనపడుచుండును. నేటికి దైవము మమ్మిద్దర నొకచో జేర్చి, నా ప్రేమను వెలిబుచ్చుటకు సావకాశము నిచ్చెను."

"అందుపై నామె యేమనెను?"

"చెలీ, జూలియా, ఆమె యే మనునో నీవు గ్రహింపలేవా?"

"నీప్రేమను గ్రహించి, వివాహ మాడుటకు సంతసించె ననుకొందును."

"నిజముగ నట్టి యదృష్టమే చేకూడినచో, నేను ధన్యుడనే యగుదును."

"నీమాటలు నా కర్థము గాకున్నవి."

(జూలియా భుజముపై జేయివేసి, యామెను దగ్గరజేర్చి) "ప్రియే, నా మనోహారిణి యగు జూలియట్, జూలియా కాక యింకెవరగుదురు? ఇన్ని దినములనుండియు, నీ వది పోల్చి కొనలేదా? నాకు నీపైగల గాఢానురాగమును నీవు గన జాలకుంటివా? జూలియా, నిన్ను నే నిక్కముగ ప్రేమించుచున్నాను. నా ప్రార్థన నంగీకరించి నన్ను జేకొనుము. ఆసంధ్య వలె నా ప్రేమము తీవ్రమై, నిర్మలమై హృదయసీమను వ్యాపించి యున్నది."

(సిగ్గుచే దలవంచి, మందస్మిత వదనారవిందముతో క్రీగంట జూచుచు) "సంజవలె నీరాగ మశాశ్వతమై యంధకారమున నస్తమించుననియా యందువు?"

"ప్రేయసీ, నీ వీ విపరీతార్థముల దీసి, నన్ను వేధించిన నే కేమి యానందము? నిన్ను నేను ప్రేమించుచున్నా ననిన, నేల విశ్వసింపవు?"

(తన భుజముపై నుండి ప్రేమికుని చేతిని దీసివైచి) "మిత్రమా, క్షమింపుము. నన్ను నీవు గాఢముగ బ్రేమించుచున్నావని యెరుగుదును. కాని క్షమింపుము. నిన్ను నే జేకొన నశక్తురాలను."

(నిర్ఘాంతపడి) "జూలియా, నా జన్మము వ్యర్థపఱచెదవా? న న్నేల బడయజాలవు? నన్ను ప్రేమింపజాలవా? లేక—వేరొకని—?"

"ప్రాణప్రియుడవగు నిన్ను నే బ్రేమింపక కాదు. నీవు దప్ప నింకొక పురుషునికి నా హృదయము సమర్పింప నాకు సాధ్యమా? నిన్ను నే నెంత ప్రేమించుచున్నానో దైవమునకే

యెఱుక. నిన్ను భర్తగా గైకొనలేనందుకు నే నెంత దుఃఖించు చున్నానో నీ వెఱుంగజాలవు."

"సుందరీ, మన మొండొరుల బ్రేమించుకొనిన పిదప బెండ్లియాడ నభ్యంతర మేమి? ప్రేమజనిత మగు వివాహము కన్న నుత్తమమేది? నా పల్కుల ద్రోసివేయక, జూలియా! నన్ను బడయ సమ్మతి నిమ్ము. అటంకముల జూపకుము."

అనుచు ఫ్రెసీ యామెను తన దగ్గరకు లాగి, కౌగిట జేర్చి కడు మోహమున నధరము ముద్దాడెను.

"నా హృదయము హరించిన నీవు నా హృదయేశ్వరు డవే యగుదువు కాని, ఫ్రెసీ, నన్ను బలవంతపరుపకుము. ఆ పై విచారించిన నేమి ప్రయోజనము? నాచరిత్ర నెరిగినచో, నీవు నన్ను జేకొనవు. నిన్ను ప్రేమించుటచే నేను చపలచిత్తనే యగుదును కాని, నీ సౌఖ్యము భంగపఱచునంతటి దుర్మార్గు రాలను కాను......నన్ను వదలుము—నీకు నేను తగను" అని జూలియా యనెను.

"కలికీ, అది వెఱ్ఱిమాట. నీవంటి సుందరి రాజాధిరాజు నకు తగ దనినను నేను నమ్మను. నీవు నన్ను ప్రేమించుచున్నా వనుట నాభాగ్యము! నీచరిత్ర యెట్టిదైనను సరియే. నీవే నా మనోహారిణివి; నిన్నుదప్ప నే నన్యకాంతను సతిగా గోరను" అని ఫ్రెసీ పల్కెను.

"అయ్యో, నా తలిదండ్రు లెవరో నే నెఱుగనే! బీద దాన నగు దాసీనే!" అని జూలియా కన్నీరు గార్చుచు, ఫ్రెసీ వక్షస్థలమున శిరస్సు నానుకొని దుఃఖించెను.

"జూలియా, అంతమాత్రమున నీపై నాప్రేమ తగ్గునని

మెంచితివా? ఆరీతి యనాథవు గనుకనే పూర్వముకన్న నిన్ను నే నధికముగ బ్రేమించెదను. నీకుల మెట్టిదైనను, తలిదండ్రు లెవరైనను, నీ చరిత్ర మెంత హీనమైన దైనను—నీవే నా మోహినివి—నా ప్రాణసమానురాలవు—" అనుచు రెండు చేతుల నామె నదిమికొని, మోదార్చుచు శిరము ముద్దిడెను.

"మనోవల్లభా, నేను నీ యధీనురాలను. నిన్ను బడయలే కున్న నే నొరుల బెండ్లియాడుదు ననుకొంటివా? నా దీనస్థితి నీ ప్రేమను క్షీణింపజేయునని వెఱచితిని. నీపల్కుల విని నా డెందము హర్షాబ్ధి నోలలాడుచున్నది. నా కిప్పుడు గలుగుచున్న యానందము జన్మములో నెన్నడును నెఱిగియుండను. ప్రియుల దృష్టి కడు మాంద్యము. కావున మోహావస్థలో నున్న నీవు నిలకడపై నీమాటల మఱతువేమో?" అనుచు ప్రేసీ కంఠము నిరుగేల బట్టుకొని, తన విశాల నేత్రములతో వాని మోము జూచుచు జాలిగా సాశ్చర్యముగ బలికెను.

"ముద్దులగుమ్మా, నా ప్రేమ తగ్గునని నీ వొకనాటికిని నూహింపకుము—హృదయఫలకమున దృఢముగ నాటబడిన ప్రేమబీజము, నీ యధరామృతవర్గముచే దినదినాభివృద్ధిగాంచి జన్మఫలము నొసంగకపోదు" అని ప్రేసీ యనెను.

అంతట ప్రియులొండొరుల బాహువల్లికల దగుల్పబడి, కొంతదనుక, దనివిదీర బిగి కౌగిటనుండి, యన్యోన్య చుంబనోల్లాసముల బరవశులై, సౌఖ్యాంబుధి న్మునిగి తేలుచుండిరి.

# కోటీశుతనయ

## తొమ్మిదవ ప్రకరణము

### తోటమాలి

"తే.గీ. మిగుల నుపకారి యైనను మిత్రుఁడైన
కానిపని సేయుమనఁ జేయఁగలఁడే నరుండు?
యరసి పాలిచ్చి పెంచిన యమ్మయైన
విసముఁ బెట్టినఁ గుడుచునే ప్రియసుతుండు?"

—గయోపాఖ్యానము.

"అవును—కాని నీ కిప్పుడేమి భయము? రోలో గతించెను కదా?"

"రోలో కన్న, ట్రెసీని చూచిన నా కెక్కుడు భయము. మొట్టమొదట ట్రెసీయే నన్ను గనిపెట్టెను. వాడు చాల కాని వాడు. ఘడియకొక రూపముతో దిరుగుచుండెను."

"ఇంతకును నీ వొనర్చిన దోషమేమి? బ్లాకీ- వలలో జిక్కుట నీ కింత జేసినది."

ఇట్లు తోబుట్టువు లిరువురును గదిలో గూర్చుని సంభాషించు కొనుచున్న సమయమున, మేడమీద కెవరో వచ్చుచున్నట్లు సవ్వడి యయ్యెను.

"చెల్లెలా, నెల్లి! ఎవరా వచ్చుచున్నది? బిల్లీయై యుండును కద? బిల్లీ కింకను నేను వచ్చినట్లు తెలియదు."

నెల్లీ కొంత వినుక జెవులు రిక్కబెట్టి, నిదానించి, ధ్వని బట్టి, "ఛార్లెస్ వచ్చుచున్నది." అని మెల్లగ బలికెను "వాడే కావలెను. అన్నట్లు మరచితిని,—నేడు 'చీకటి పడులో పున రాలే నని' చెప్పియుండెను."

సోదరి పలుకుల నాలించి, బార్నాడ్ మిగుల యాతురతతో, "'చార్లెస్' అనగా నెవరు?" అని యడిగెను.

"నీ వెరుగవేమో—వాడొక ధనికుని బిడ్డడు. రూపవంతుడగు చిన్నవాడు; యువకుడు; విద్యావంతుడు. చాల యమాయికుడు గూడను. చెప్ప మరచితిని—నిన్ను చూడవలెనని చాల కుతూహలముతో నున్నాడు." అని నెల్లీ చెప్ప సాగెను.

"నీకు వాని పరిచయ మెక్కడ?"

"పరిచయమే కాదు—స్నేహ మనుము! క్రొత్తగా మే మిరువురమును స్నేహితులమైతిమి" అని యనుచు, నెల్లీ మెల్లగ నవ్వెను.

గదిలో బార్నాడ్ నెల్లీ లిట్లు సంభాషించుకొను చుండిన సమయమున, నతివడి దలుపు దోసికొని, యొక పురుషుడు లో బ్రవేశించెను. వానిని చూచి, నెల్లీ త్రుల్లిపడెను. బార్నాడ్ కూడ కొంత గ్రిక్కతుమని, మరల ధైర్యము దెచ్చుకొని, క్రొత్తగా వచ్చినవానిని చిరునగవుతో బలుకరించెను.

క్రొత్తగా వచ్చినవా డంత నెల్లీ సోదరు నుద్దేశించి "బాబూ—నీ వెప్పుడు వచ్చియుంటివి? నెల్లీ కేదో యుత్తర మిదివరలో వచ్చియుండెనని నెల్లీ యనగా వింటిని. అది నీవు వ్రాసియుంటివేమో యని నా కేలాగో యనుమానము కలిగినది. రోజా కూడ నట్లే యనినది. కనుగొందమని నెల్లీవద్ద కి

ష్టపడు రాగ, ప్రత్యక్షముగ నీవే యగుపడితివి. మంచిది—" అనుచు నా పురుషు డొక కుర్చీపై జతికిలబడి, బార్నాడ్ నే మేమో ప్రశ్నింప మొదలుపెట్టెను. కొంతదనుక టామీతో ముచ్చటించినపిదప, వాడు టామీని తోడ్కొని, గదినుండి వెలుపలకు వచ్చెను. పిమ్మట వే రొక రహస్యప్రదేశమునకు బోయి, వా రిరువురును చాలసేపు మాటలాడుకొనిరి.

నెల్లీ యొక్కతెయే గదిలో గూర్చునియుండెను. "వీని మూలముననే నాయన్నకు లేనిపోనియిక్కట్లు గలుగుచున్నవి" అని విసుగుకొనుచు, నెల్లీ యేమో తలపోయుచుండెను. ఇంతలో ఫ్లారెన్స్ వేసమున నుండిన ట్రిసీ వచ్చి, యాగది జొచ్చెను. చిరునగవుతో నాయువకు నెదుర్కొని నెల్లీ—"ఫ్లారెన్స్, నే నొక వింత దెల్పెదను. అదియేమో పోల్చికొనగలవా?" అనెను.

క్షణ మాలోచించి ట్రిసీ, "పోల్చితిని. నీ సహోదరుడు—" అని మాత్ర మని యూరకుండెను.

"అవును. వా డిప్పుడే వచ్చి చేరినాడు. ఇంతదనుక వానితోనే మాటలాడుచుంటిని."

ట్రిసీ మొగమున నానందచిహ్నములు విశదమగుచుండెను. వెంటనే వాడు గదితలుపు జేరవేసి, నెల్లీని సమీపించి యామె చెక్కిలి ముద్దాడి, ప్రియే—నేడు నే నిచ్చటికి బయలుదేరునప్పుడు శుభశకునము లెదురయ్యెను. నీ కేదో సంతోషవిషయ ముండునని యప్పుడే యనుకొంటిని! చచ్చిపోయెనని యనుకొనిన తోబుట్టువు తిరిగివచ్చుట కన్న, వేరు శుభ మేమి కావలెను? నీకు శుభము జేకూరుట నాకెంత యానంద దాయకమో నీ వెరుగవా!" అనుచు ప్రియోక్తుల నామెకు, యరచే

యని స్వర్గము జూపెట్టుచుండెను. "నీ కోరిక నేను, తప్పక దీర్చెదను! ప్రియాలింగన చుంబనములతో నేను మాత్రి మెట్లు సంతుష్టి నొందగలను? ఇన్నాళ్లను వెర్రినై, యేనో యొక నెపమున ననుదర్శనముగ వెనుదీయుచుంటిని! పురుషుడన య్యు నేనిట్లు లక్షించుట కూడదని తెలిసినది. నేను మన మిత్రు పురమును సంతోషముగా నున్నాము! కాని నెల్లీ, నీవు నన్ను నిజముగ గాఢముగా ప్రేమించుచున్నావా? లేక—"

నెల్లీ కన్ను లెత్తి యొక్కసారి వాని వైపు జూచి, వాని పైబడి యధరము ముద్దాడి, కంఠము నిరుచేతుల బట్టుకొని, వాని వక్షస్థలముపై శిరము వాల్చి, కన్నుల నీరు గార్చెను. నెల్లీ పూర్ణముగ తనకు వశమయ్యెనని ఛ్రిసె గ్రహించెను. ఆ క్షణమున సహజముగ జాలియూ వాని తలపుకు వచ్చెను. తనలో మెల్లగ నవ్వుకొని, పదిలముగ నెల్లిని తన కౌగిటినుండి విడదీసి, యామె నడుముపై నొక చేయివేసి, సోఫాపై నామెను గూర్చుండ బెట్టి, తానును యామెసరి గూర్చుండెను. "పాప మీమె నాపై మనసుగలిగి యున్నది. మా యోపాయమును నెట్లైన దప్పించుకొన వలెను. అట్టు యటుండ, నీమె సహాయ్యముననే టానిని నిప్పుడు పట్టవలెను" అనుచు తనలో దలపోసి కొనుచు, ఛ్రిసీ నెల్లితో కామాంధునివలె నటించుచు, యామె ముంగురుల దువ్వసాగెను.

"ముద్దులాడీ—మన మిట్లున్నప్పుడు మీ యన్న వచ్చెనచో నేమనుకొనును?"

"ఛార్లెస్, నీ వందుకు జడియకుము. క్రిందికి నేనొక సారి యేగి వచ్చెదను. ఇంక నొక గంట దనుక నెవ్వరును నా

గదిలోనికి రాకుండునట్లు తగిన యేర్పాటు జేసివచ్చెదను" అని పలికి, నెల్లీ లేచి నిలువబడెను.

ఆమె హస్తము బట్టుకొని "ప్రియురాలా, నీ యూహాలెప్పుడును శ్లాఘనీయములే! నీ విట్టి యుక్తి బన్నెదవని నే నెరుగుదును——కాని——" అనుచు నామెను మరల దన ప్రక్క గూర్చుండ బెట్టి, చెక్కిలి నొక్కుచు, "నీయన్న మరలి వచ్చినందుకు, మనమిప్పుడు 'ఛాంపేని'తో విందు జేసికొందుము. బార్నార్డ్——అదియేకదా నీ సోదరుని నామధేయము——బార్నార్డ్ నింకొక గంటలో నీ గదిలోనికి రమ్మనుము. నేనిక్కడ నుందునని చెప్పకుము. వానితో నీవే యేమో మాట్లాడ నున్నావని యనుము" అని బోధపరచెను. నెల్లీ తలనూచి, యటులనే యని పలికి, వెంటనే మేడ దిగెను.

సారాయి బుడ్లుంచబడు గదిలో, టామీ యొక బెంచీపై గూర్చుని, యొక పనికత్తెతో బరియాచకము లాడుచుండెను. నెల్లీ వానిని వీపుపైదట్టి, "బ్లాకీ యెక్కడ?" నని యడిగెను.

"కొన్ని నిముసముల క్రిందటనే యేగెను. ఏమి?" అని టామీ యామె వైపు దిరిగి ప్రశ్నించెను.

"ఏమియును లేదు. వెనుకనుండి నీతో గొన్ని సంగతులు మాట్లాడ వలసియున్నది. ఇంకొక గంటయైన పిదప, నా గదిలోనికి రమ్ము. ఈలోపున నాకు వేరే పనియున్నది." అని పలికి, నెల్లీ యొక బీరువా నుండి ఛాంపేని బుడ్డి దీసి, బిరడా మూడదెసి, చేత బట్టుకొని, మేడ నెక్కెను.

* * * * * *

"రోజా, నీకనిపించినది నిజమే! టామీ జోరించియున్నాడు."

బ్లాకీ మాటలకు దృష్టిపడి యామె మగనివైపు నిర్ఘాంతపడి, చూడ జొచ్చెను.

" 'బిల్లీ హొరొటేలు' లో నిప్పుడు వానిని కలసికొంటిని. నే జెప్పిన కొన్ని యేర్పాటులకు వా డొడబడ కున్నాడు. పీటర్ మాటల బట్టి చూడ, మేరీ వానిని వరించునట్లు దోచదు కావున మేరీని కూడ వధించుట యుక్తమను కాదా యని యంటిని. అందుకొక పన్నాగ మాలోచించి, టామితో జెప్పితిని. 'ఆమెను చంపిన మన కేమి లాభము?' అని టామి యడిగెను. 'ఆమె గతించిన వెనుక, పీటరే కదా లాలీ యాస్తికి హక్కుదారుడు? అప్పుడు వాడు లాలీమందిర నాయకు డగును' అని టామికి బోధించితిని. వాడందుల కేమియు మనస్కరించక, తన యజమానురాలిని చంపుటకన్న, దాచచ్చుటే యుక్తమని పలికెను." అని బ్లాకీ సవిస్తరముగ తన సతితో జెప్పెను.

వాని మాటల కాశ్చర్య పడుచు రోజా, "పాపము, టామి మేరీపై నెట్లు చేయి జేసికొన గలడు? ఏమైనను, యామె వాని యజమానురాలు గదా? టామికి మాత్రము సుగుణమైనను కలదని తెలిసికొనుట నా కానందముగా నున్నది" అని నిర్భయముగ పలికెను.

"అయిన మేరీని వధించుట నీకు గూడ నిష్టము లేదా?"

"లేదు."

* * * * * *

నెల్లీతో సరససల్లాపముల జేయుచు, ఫ్రెసీ యామె తెచ్చిన నిషాపదార్థము నొకగ్లాసులో బోసి, యుపమాత్రము దా సేవించి, నెల్లీచే నధికముగ ద్రాగించెను. ఆ పసికకు దెలి

యరాఘండ నందేమి కలిపెనో కాని, యామె శీఘ్రములో నొంటిపై స్మారకము లేనిదై ట్రెసీపై బడి వాని వక్షస్థలముస ముఖము వాల్చి నిద్రించెను. ట్రెసీ తనలో జిరునవ్వు నవ్వుకొని, వెంటనే యామెను పదిలముగ నొక పరుపుపై బరుండబెట్టి, తానొక కుర్చీపై గూర్చుని, దుస్తుల సరి జేసికొనుచుండెను.

ఇంతలో నొడలిపై గొంత స్మారకము లేనివాడై, యిటుపటు జూగుచు, మెల్ల మెల్లగ మేడమీదికొక పురుషుడు వచ్చుచున్నట్లు యాచోకీ యగుటచే, ట్రెసీ దిగ్గున లేచి, చేత నొక రివాల్వరు బట్టుకొని, తలుపు వారకు జని నిలచెను. కొంచమోరువాకిలిగా వేసియుండుక వాటుముల దాచికొని, టామీ గదిలోనికి వచ్చెను. తోడనే ట్రెసీ వానిపై బడి, చేతుల నదిమి పట్టుకొని, "టామీ—యిప్పుడింక తప్పించుకొన జాలవు." అని పలికెను. "నోరెత్తి యరచినచో పిస్తోలుతో గాల్చెదను."

నిర్ఘాంతపడి, టామీ క్షణముదనుక నోట మాటలేక గజ గజ వణకుచు, నిలువెల్ల జిరి చెమ్మటలు గ్రుక్కుకొనుచు, ట్రెసీ వైపుజూచి "అమ్మా, క్షమింపుము; శరణు వేడుచున్నాను." అని దీనముగ బలికెను.

"ఏమియు బలుకక నాతోరమ్ము" అని ట్రెసీ మిగుల యసూయతో బండ్లు గొరుకుచు, ననెను.

"ట్రెసీ—నన్ను కాపాడితివేని, నీ కొక మహోపకారము జేసెదను." అని యనెను.

క్షణమాలోచించి, ట్రెసీ, "చెప్పుము. నీవు చేయగల సహాయ్యము బట్టి యుండును. అంత దనుక నే నెట్టి యభయము నిచ్చువాడను గాను."

"లాలీ హత్యకేసులో హంతకుని బట్టి యిచ్చుటకు నిశ్చయించితిని—నన్ను రక్షింపుము."

ట్రెసీ ముఖ మానందముతో వికసించెను. "సరియే నీకు హాని రాకుండ గాచెదను. నీకు దెలిసిన రహస్యముల నన్నిటిని జెప్పుము" అనుచు ట్రెసీ వాని నొక కుర్చీపై గూర్చుండ జేసి, గది తలుపులు మూసి తాళము బిగించి, తానును టామీ ప్రక్కనే గూర్చుండి, "చెప్పుము." అనెను.

"నన్ను తప్పక కాపాడెదవా? నా కెట్టి హానియు రాకుండ జూచెదవా? అటుల నాకు వాగ్దాన మిమ్ము-లేనిచో జెప్ప జాలను." అని టామీ భయముతో నుడివెను.

"నీకు శరణ మిచ్చితిని; భయపడకుము. సవిస్తరముగా నంతయు జెప్పి వేయుము" అని ట్రెసీ హెచ్చరిక గొలిపెను.

"అటులైన ట్రెసీ—యిదిగో నీ చేతుల బట్టుకొని ప్రమాణము జేయుచున్నాను. దైవ సాక్షిగా నుడివెద వినుము నేను కేవలము నిర్దోషిని. బ్లాకీకి భయపడి నేనొన్ని దోషముల జేసితిని. బ్లాకీయే లాలీని చంపినవాడు. లాలీ గారి మరణము హత్యయే!"

"నీవు బ్లాకీ నెరుగుదువా? నాకు వానిజూపించ గలవా?"

"అది నాకు సాధ్యము కాదు. నే జచ్చెదను!"

"పోనిమ్ము నీ వేమి చెప్ప దొడగితివో, చెప్పుము. వెనుక నుండి బ్లాకీని గూర్చి యోచించెదను." అని ట్రెసీ యనుచు మిగుల జాగ్రత్తతో నాలకించుచుండెను.

"లాలీ రేపటి యుదయమునకు మృతినొందు ననగా, నేటిరాత్రి సుమారర్ధరాత్రి సమయమునకు బ్లాకీ నా వద్దకు

వచ్చి, తోటలోని కొక సారి తాఁబోవ గార్యమున్నదని యనెను. అటులనే కానిమ్మని తలుపులుదీసి, యా రాత్రి వానిని పూఁదోటకు దోడ్కొని పోతిని. లోనికి నన్ను రావలదని బ్లాకీ వారించెను. కారణ మరయుటకు వెరచి, నేనక్కడే ద్వారము దరి వేచి యుంటిని. తన జోళ్ల నూడదీసి వాడు నా కాళ్ల కుండిన బూట్సు నిమ్మని కోరెను. అడ్డు జెప్పక తీసి యొసగితిని. సుమారొక యిరువదినిమిషములదనుక నారామమందే యుండి కొన్ని పూవుల గోసికొని, వాడు మరలి వచ్చెను. "టామీ! ఉదయము పెందలకడ పూవులగోసి, నీ యజమానురాలి కిమ్ము' అని నాతో ననెను" అని టామీ నివేదించెను.

"సరియే—ఆ పై కథ నాకెఱుక. కాని లాలీ యెట్లు చంపబడెను?" అని ట్రేసీ ప్రశ్నించెను.

"నాటిరాత్రి తొలి ఝామున నన్ను లాలీగదిలోనికి రహస్యముగ బొమ్మని, యటగల ఖజానా పెట్టెకు సమీపమున నొక మాయ పాము నుంచుమని యాజ్ఞాపించెను."

"ఏ మంటివి? సర్పమా?" అని ట్రేసీ యాశ్చర్యముతో నడిగెను.

"అవును, సర్పమే. కాని నిజముగ పాముకాదు. రబ్బరు పామువలె నగుపడినది. కాని దూరమునుండి, చూచినచో నిజముగ నొక త్రాచువలెనే యగుపడును. 'టామీ భద్రము సుమీ! ఆ పాము 'పొటాష్' బంతి వంటిది. అగ్నికి దూరముగా [illegible]వలెను. ప్రమాదమున చేతి నుండి నేల జారవిడిచితివా, చచ్చెదవు' అని బ్లాకీ నా కుపదేశించెను. 'ఏమి? ప్రేలునా [illegible]?' అని భయపడుచు, వాని నడిగితిని. మెల్లగ

నవ్వుచు, వాడు, 'లేదు. అది మామూలు 'బాంబు' ల వలె పేలదు. నిప్పంటుకొని కాలును. చప్పుడు కాదు. అది కాలునప్పుడు మంట కూడ కాంతిగా నుండదు. గంధకము కాలునట్లు నీలి రంగుతో కాలును; అమోనియమ్ అకొనైట్ పొగలు వెడలును." అని యూహము గుట్టు జెప్పెను. ఆ సర్పము నేల, గదిలో నుంచబడునుచున్నాడో ధైర్యముతో నడుగ లేకుంటిని. బ్లాకీకి వశపడుట వానికి జడియుటే!"

"చాలును—ఆ పాము గూర్చి యంతయు గ్రహించితిని. కాని బ్లాకీ యెవరు? వానికి నీ వెట్లు వశమయితివి?"

"ఆసంగతి మాత్రము నన్నడుగవలదని వేడుచున్నాను. పగ లెన్నడును నేను కూడ బ్లాకీని చూచియుండలేదు. రాత్రి పూట బ్లాకీ సహజముగా మారువేషముతో నుండునదియే నా నమ్మకము. ఈయూరులో నేవాని కనేకగృహము లున్నవి. బ్లాకీ యొక్క చక్కని యిటలీకన్యను వివాహమాడి సుమారొక సంవత్సరమై యుండును. ఆమెతో నా దెప్పుడును కలసియుండును."

"టామీ—యింకొక సంగతి నడిగెదను. లాలీ నేల బ్లాకీ వధించెనో చెప్పగలవా?"

"నాకు తెలియదు."

"పోనిమ్ము ఆయన గతించిన వెనుక, మేరీ నేల హింసించు చున్నాడు?"

"అదియును తెలియదు. మేరీ నెట్టులైన నెత్తుకొని పోయినచో, జాల ద్రవ్యము లభించునని యొక సారి యని యుండెను. ఆమెచే గొన్ని కాగితములను సంతకము జేయించ నుదేశించుచున్నట్లు దెలిసినది. ఇప్పుడా తలపు మార్చుకొని—"

"ఏమి? ఇటుపై నామెజోలికి రా నిష్టము లేదా?"

"కాదు కాదు. వేరొక పన్నాగము బన్నియున్నాడు. ఆమెను పీటరు కిచ్చి పెండ్లి సేయ యత్నించుచున్నాడు. అది సాధ్యము కానప్పు డామెను కూడ హత్య జేయ నిశ్చయించినాడు"

తృళ్లిపడి ట్రేసీ, "పీటర్ బ్లాకీ కేమగును?" అనియడిగెను.

"నాకు తెలియదు—" అనిటామీ మరల చెప్పదొడగెను.

"పీటరేదో కుట్రలో బ్లాకీతో గలసి యున్నాడు."

"అటులైన మున్ముందు పీటరును పట్టుకొనవలెను." అని తనలో ట్రేసీ యేమో యాలోచించుకొన సాగెను.

"ట్రేసీ, నే నిప్పుడు చాల పశ్చాత్తాప పడుచున్నాను. నే జేసిన దోషముల కిప్పుడు చాల వగచుచున్నాను. నేడు ముఖ్యముగా బ్లాకీపై నాకు జెప్పరాని కోపము గలిగినది. రోలోను చంపెనని విని నా మనసు నీరై పోయినది! అదిగాక, మేకీని చంపుటకు నన్ను నియమించెను! నే నందుకు సమ్మతించక పోవుటచే, నాపై వానికి గినుక జనించినది. 'టామీ, బాగుగ నాలోచించుకొనుము. రెండు దినము లింక వ్యవధి యున్నది' అని బ్లాకీ నన్నుద్దేశించి పలికెను. కాని భూమి తోడుగా పలుకుచున్నాను—టామీ నేటినుండియు బ్లాకీకి వశమై యుండడు! నా శక్తి కొలదిని ప్రయత్నించి, వానిని మీ కప్పగించుటకే మనో నిశ్చయము జేసికొంటిని. ఇటుపైని టామీ బ్లాకీకి శత్రుడే!"

"టామీ, ని న్నిప్పుడు నమ్ముచున్నాను. నీ కెట్టి శిక్షయు రాకుండ జూచెదను. నిజముగా నీవు నాకు చాల సహా

యము జేసితివి. కొన్ని ముఖ్యమగు సంగతుల దెల్పితివి—
ఇటుపైని నే జెప్పినట్లు నడచుకొందువా?"

"అంతకన్న నేనేమి కోరెదను?"

"ఐన సరియే. రేపు నే నిచ్చటికి రాను. నీవేనన్న గలసికో."

ఇంక గొన్ని విషయములు వానితో బ్రసంగించి. టిప్రసీ వాచీదీసి చూచుకొని, బిర బిర లేచి నిజగృహమున కేగెను.

* * * * * *

"చెలి మేరీ, నీకింక నిద్ర రాలేదా? నాకు గన్నులు పడిపోవుచున్నవి."

"జూలియా, యెంతయో రాత్రి కాలేదు! అప్పుడే పండుకొనుట యేమి?"

గదిలో కూర్చుచి, మేరీ జూలియాలు చాల సేపటి నుండియును ముచ్చటించుకొనుచుండిరి.

"నీవేమి గ్రహించితివో కాని, మన నాటకము నాకే మియు దెలియరాకున్నది. ఇట్లు దాగుడు మూతలాడుటలో రోలో యుద్దేశమేమో తెలియకున్నది." అని జూలియా యాలోచించుచున్న దానివలె ననెను.

"మ రెన్నాళ్లు? ఇంక రెండు దినములే కదా?"

"కానిమనకు గలుగబోవు లాభ మేమోగ్రహించలేను."

"జూలియా, యేదో కారణము లేనిదే రోలో యిట్లు మనచే నాటకము నాడించదు."

"అది వాస్తవమే, కాని—" అని యేమో సంకోచించు చున్నట్లు జూలియా పలికెను.

"ప్రేసీ నడుగ కుంటివా?" అని మేరీ నవ్వుచు బ్రశ్నించెను.

సిగ్గుచే జూలియా చిరునవ్వు నవ్వి, యూరకుండెను.

"జూలియా, రేపటి యుదయమున తప్పక గనుగొందము. రోలోనే యడుగుదము"

"చెలీ మేరీ, నీవే యాయన నడుగవలెను. ఇంకెవరడగినను, లాభ ముండదు." అని జూలియా పక్కన నవ్వెను.

సమయోచిత మగు జూలియా సల్లాపము గ్రహించి, మేరీ నవ్వుకొని సంతోష దృష్టితో నామెను చూచెను.

"ఆమాట కేమిగాని, చెలీ, పీటర్ నడవడిక గనిపెట్టితివా? వాడు మేనత్త కొడుకే యైనను,—"

"పాపము వాడు నిన్నతి తీవ్రముగా మోహించెను."

"నే నెరుగుదును. నాతండ్రి జీవించి యున్నప్పుడు కూడ నీ విషయమై ప్రస్తావన వచ్చినది. నా జనకుని కీ సంబంధ మేమియు నిష్టములేదు."

"పీటర్ తో నే డేమంటివి?"

"'ఇకముందు నాతో నట్టి ప్రసంగము లాడకుము' అని కోపముతో బలికితిని."

* * * * * *

అర్ధరాత్రము కావచ్చినది. జనులు వారి వారి శయ్యల జేరి, మైమరచి, నిద్రించుచుండిరి. పట్టణములోని కోలాహాలమంతయు నణగి, నిశ్శబ్దమైయుండెను. పీటర్ మాత్రమెంత యత్నించు చుండినను, వాని కన్నులు మూతపడకుండెను.

మనో వ్యాధిలో బడి కొట్టాడుచుంటచే, వాని హృదయము గలవరపడి, పీటరు నొక యున్మాదుని వలె జేసెను. మేరీ తన్నెన్ను కొనదని, వానికి నిశ్చయముగ దెలిసెను. రోలో గతించినచో, నామె యవివాహితగా నుంటకైన వెనుదీయును కాని, పీటరును చేబట్టుట కొడంబడదని విశదమయ్యెను. సుందరి తనకు లభించు నాశ లేనితరి, పీట రెన్ని యొనర్చిన నేమిలాభము? తనకు గల యాస్తి సర్వస్వమునైన గోల్పోవుట కా బాలిక లక్ష్యము సేయదు కాని, పీటరును మాత్రము భర్తగా నేలు కొనదు! స్త్రీల పంత మిట్టిదని పీట రెరుగును. దొంగవీలు గల్పించిన లాభమేమి? ఆమె చిత్తము హరించలేనితరి, యామె సొత్తు నపహరించిన నేమి ప్రయోజకత్వము? ఇంతకును, మేరీ డబ్బుకై పీటరేల యాసించవలయును! పీటర్ చాల ధనికుడు! పీటరిట్లు తనలో వితర్కించు కొనుచు, క్షణమున కొక విధముగు మనో నిశ్చయమునకు వచ్చుచుండెను. ఆమె వాని నేల ప్రేమించలేకున్నదో యని వాడు తదేక చింతతో నాలోచించుచుండెను. అప్పుడప్పుడు మేరీపై వానికి భరింపరాని కోపము పుట్టుచుండెను. ఇంత తిక్కతో నున్నందున, నామెకు దగిన శిక్ష జేయుటయే యుత్తమ మని యనుకొను చుండెను. ఆమెపై గసి దీర్చుకొనుటకు మంచి యుపాయము నాలోచించుచుండెను, కాని, మరల సుందరిపై వానికి గలమోహము రాగము వానిని వెనుదీయ జేయుచుండెను. మేరీని వధించినచో, దానెట్లు సుఖించ గలడు?.....ఇంకొక సారి యత్నించి చూచుటకు పీటర్ నిశ్చయించుకొనెను. నిలకడపై నామె మనసు దిప్పుకొను నేమో? బ్లాకీ సలహా యుత్తమముగా

దోచదు! ఆమె కొఱకే కదా పాపము రోలోను చంపించుటకు పీటరు పూనుకొనెను? ఒక గుణనిధియొక్క నిష్కళంక రక్తము దన చేతులపై బోసికొనుటలో, పీటర్ యుద్దేశము తావలచిన జవ్వని లభించునని యే కదా? అట్టి వాంఛ యీడేరకున్నప్పుడు, వాడేల దుష్ప్రవర్తకుడు కావలెను? హత్యయొనర్చినను, చోరత్వమున కియ్యకొనినను, మనోభీష్ట సిద్ధి యైనచో మనస్తాపము గొంత యుపశమించును. పీటర్ సహజముగ నిర్దయుడు కాడు—అన్యుల హింసించు హంతకుడు కాడు—నీచ కులస్థుడును కాడు! అట్టి వాడొక హత్య జేయించ బూనుకొనెను!

స్వచ్ఛమై, నిర్మలమై, నిష్కళంకమై, తేజోవంతమై, ప్రకాశించు వజ్రము నయితము నిప్పులో బడినచో నేమగును? తన సహజ కాంతిని బాసి, విలువ లేనిదై, వికృతాకృతికి లోనై, యొక మకమక లాడు నల్లని మసి జొగ్గుగా మారును. మానవ హృదయ మొక యపూర్వ వజ్రమువంటిది. మోహాగ్నికి లోనై, యది తన సహజగుణముల బాసి, మసిగా, బొగ్గుగా, బూడిదగా మారి నిష్ప్రయోజక మగును! పాపాగ్నిని రగుల్ప జేసి, జ్వలించుటకు, స్త్రీలగ్ని హోత్రమునకు వలయు సమిధల వంటివారు. లోకములోనుండు దారుణ కృత్యము లెల్లను యాడుదాని మూలముననే కలుగున్నవి.

'ఈవ్' మూలముననే 'ఆడమ్' తినరాని ఫలమును భుజించి, నరునకు మరణము జేకూర్ప గారణు డయ్యెను. 'హెలన్' వలననే 'ట్రాయ్' నిర్మూలమై దగ్ధ మయ్యెను. సీత మూలమున రావణునకు పుణ్యము నశించి, చావు కలిగెను. యుద్ధములకును హత్యలకును జారచోరత్వములకును గూడ

మూలకారణము సర్వసాధారణముగ వనితయే! ‘మానవుని నరకమున కీడ్చునది స్త్రీ’ యని మిల్టన్‌కవి బోధించి యున్నాడు.

మేరీ యను లలనామణి, పీటరు కన్నుల కగుపడ కుండినచో, వాడేల రోలోను చంపు పాపము నొడిగట్టుకొన సిద్ధపడును? మానవునకు యవ్వన మొకా నొకప్పుడు శత్రువుగా బరిణమించి, వానిచే గొన్ని యసాధారణ దోషముల జేయించును. స్త్రీల పాలిట జక్కదన మొక పాపిష్టి దేవతయై, వారి నురుమాడి, హింసించుచుండును. పీటరు, మేరీ సొగసుందనము దిలకించి, యామగువ నెట్టులైన బడయు నుద్దేశముతో నెంతటి దారుణకృత్యమునైన జేయ వెనుదీయకుండెను. బ్లాకీ యామె సంహారణముదలపెట్టి చెప్పినపుడు మాత్రము, సహజముగ పీటరు హృదయము ఝల్లుమనెను. వాడందు కొడబడకుండెను! బ్లాకీ నావేశించిన దేవత ద్రవ్యాశ—పీటరు నావేశించినది మోహదేవత!

ఏపని జేసినను, పీటరు మనసు స్థిమితముగా నుండకుండెను. శయనింత మన్న నిద్దుర రాకుండెను. పని జేయుట కాలోచన దోచకుండెను. దేనికిని, మనసు వాని యధీనమున నుండకుండెను. నిజముగ నాటిరేయిని పీట రొక పిచ్చివాడే! గదిలో నొంటరిగ గూర్చుని, క్షణక్షణమున కొక విధముగ నాలోచించుకొనుచు, బుద్ధి నిలకడ లేక, యేమియు దోచక, తన యూహాప్రవాహమున మేరీ తలంపులనే యీదులాడజేయుచు, తీరము జేర నసాధ్యుడై వా డమిత వేదనలో బడియుండెను.

# కోటీశ తనయ

## పదియవ ప్రకరణము

---

### విందు.

"కరటకశాస్త్రుల్లా! గుంటూరు శాస్త్రుల్లు!"

"అవును. కొంచం చిరిగెడ్డం అంటించుకున్నారు; అంతే భేదం—"

"ఔరా? అతగాడి దాయణం!......యేమిచిత్రము. మేలుకున్నానా నిద్రపోతున్నానా?"

—కన్యాశుల్కము.

"రోజా, ఇప్పుడు టామీని కాచుకొనవలసి యుండు నేమో! నిజముగా వాడు విశ్వాసఘాతకుడై వర్తించుచున్నాడా, లేక—"

"ఏమి? వాడేమొనర్చెను?"

"నిశ్చయించి యింతలో నేమియు జెప్పలేను. కాని నా చారులు కొందరు వానిగూర్చి దెల్పియున్నారు. టామీ శత్రుపక్షమువాడుగా మారనున్నాడని తెలియవచ్చినది. రూఢిగ నేడు కనుగొనగలను."

బ్లాకీ పలుకులనాలకించుచు, రోజా నిశ్చేష్టయై నిల్చెను.

"అట్లైనచో, నాథా! నీ కేమియు నపాయమురాదా?"

"అపాయమే కాదు. పీక పోవునంత ముప్పు వచ్చును. కావుననే యిప్పుడు బయలుదేరుచున్నాను. ట్రేసీ కబురంపినట్లు టెలిఫోనులో పిలచి, వాడందుకు జబాబొసగి, ట్రేసీతో

మిత్రుని వలె సంభాషించెనా, టామీ జన్మమీ ఘడియతో నాఖరని యెంచుము'' అని కోపముతో బ్లాకీ యేదో మనో నిశ్చయము జేసికొనెను.

* * * * *

నాటియుదయము రోలోగారి లేబొరేటరీలో మిక్కిలి యలికిడిగా నుండెను. 'కూలీ' పొడిచిన కత్తిదెబ్బవలన నిరూపకుని భుజముపై మోటగు గాయము తగిలెనే కాని, కేన్నీ వైద్యసహాయమున గాయము మాన్పబడి మరల రోలో నెప్పటి యారోగ్యస్థితికి రానిచ్చెను. కెన్నీ రెండు పూటలును వచ్చి, రోగిని చూచి యౌషధము నొసగుచుండెను. మర్కటముచే బాధపడిన మరునాటి రేకువను, బాగుగ దెలివి వచ్చినపిమ్మట రోలో తన 'జూనియరు'ను పిక్కటుబిలచి "ట్రేసీ. నేను మృతి నొందినట్లు పత్రికలో బ్రచురింపుము!" అని యుక్తితో బలికెను. ట్రేసీ తనయజమానుని యుద్దేశము గ్రహించి, వెంటనే టైపు యంత్రమువద్ద గూర్చుని వార్తాపత్రికకొక వ్యాసము వ్రాసి యంపెను. 'గౌరవనీయులగు డాక్టరు రోలో మహాశయుని యాకస్మికమరణము' అను నంశము ట్రేసీ ప్రచురించినదే! బ్లాకీ యీ విషయము పత్రికలో గమనించి, నమ్మికొని, క్రొత్త పన్నాగముల బన్నుచు, పూర్వమంత జాగ్రత్త వహించక మసలదొడగెను. రోలో గతించిన వెనుక దన్నింక నెదుర్కొనువారు లేరని బ్లాకీ దృఢముగ నమ్మియుండెను. బ్లాకీ, యొక్క రోలోకే భయపడుచుండెడివాడు. రోలో యొక వీలు వ్రాసి, కెన్నీ, మేయో, జూలియా, షేకీల

సంతకముల దీసికొని, లేబొరేటరీనంతయు క్రేసీ యధీనము జే సెను. రోలో వక్కీళ్లకు గూడ, నిరూపకుడు జీవించియున్నట్లు తె లియదు. పెర్కీ సహితము తన యజమానుని గుట్టు నతి భద్ర ముగ గాపాడుచుండెను. అనుదినమును మేరీ, జూలియాను దోడ్కొని రోలోదరికి వచ్చుచుండెను. శతృవు నడవడికల నెల్ల క్రేసీ గనిపెట్టుచు, రోలోతో జెప్పుచుండెను. తెరవెను క నిల్చుని నిరూపకుడు ఈ నాటకము నాడించుచుండెను.

నాటి యుదయము మేయో కెర్సీ లింకను రాక పూర్వమే మేరీజూలియాలు లేబొరేటరీకి వచ్చియుండిరి. రోలోతో నొం టరిగ మాటలాడ నిచ్చగించి, జూలియాను క్రేసీతో వదలి, మేరీ, వెనుకటి గది జొచ్చి, రోలోచెంత గూర్చుని, సంభా షించుచుండెను. పీటర్ త న్ననుదినమును వివాహ మాడుమని నిర్బంధించుచున్నాడని వానిపై నసూయత వెలిబుచ్చుచు, మేరీ సర్వము రోలో కెరుక జేసెను. ఆబాలిక చెప్పిన దంతయు నాలకించి, రోలో లేచి, యామె కెదురుగ నొక యీజీ కుర్చీ పై గూర్చుని, కొంతతడ వాలోచించి, తనలో మెల్లగ నవ్వు కొని, సుందరి కొక యుక్తి దెల్పెను. తొలుత మేరీ నిరూపకు డు చెప్పిన యేర్పాటున కియ్యకొనక, కొంత వాదనపై, నట్లే యని సమ్మతి నొసగెను. టామీ, పీటరు గూర్చి చెప్పిన యను మానాన విషయములు నిరూపకుడు లాలీ మందిర రాణితో సర్వము వెలిబుచ్చెను.

"నీతండ్రి వ్రాసిన వీలు గూర్చి బ్లాకీ యేమో, టామీ కేమియు నర్థము కాకుండ జెప్పెనట! ఆసందర్భమున పీటరు నా మము బేర్కొని యుండెనట. వీ రిరువురును యేకీభవిం

యేదో పన్నాగము నల్లుచున్నారు. తగిన నిదర్శనములు చూపెట్ట లేకనే పీటరును పట్టుకొన జాలము. నే జెప్పిన యేర్పాటువలన, చాల లాభ ముండునని యెంచెదను."

ఆశ్చర్యముతో వినుచు, మేరీత్రుళ్లిపడి, "రోలో, నిజముగ పీట రేదో సాహసకార్యము దలపెట్టి యున్నాడనియే తలంచెదవా?" అని ప్రశ్నించెను.

"అందుల కేమియు నభ్యంతరము లేదు. నేడు వానిని నీ వనుగ్రహించి వివాహ మాడుట కొడబడకున్నచో, నిశ్చయముగ రేపటి దినమున వాడు నిన్ను వధింప నెత్నించునని తెలియవచ్చినది!" అని రోలో జవా బొసగెను.

"నన్ను చంపిన వాని కేమి వచ్చును?" అని మేరీ గర్వరుమని యనెను.

"ఆసంగతి నా కింక దెలియవచ్చుట లేదు. కాని పీట రేదో ఘోరము దలపెట్టియున్నాడు. బహుశః బ్లాకీ ప్రేరేపణ వలన నిట్లు వర్తించుచున్నాడని నే ననుకొందును" అని రోలో యనెను.

"ఐన, మిల్లీ యనినది నిజమై యుండనోపును" అని మేరీ ఆన్యథా యోచించుచు పలికెను.

"మిల్లీ యేమి చెప్పినది?" అని యామె వైపు దృష్టి నిగిడ్చి, రోలో ప్రశ్నించెను.

"మొన్నరాత్రి పీటరు లేచి ఆఫీసు చావడిలో బ్రవేశించి నట్లు యామె యనుమానించినది" అని మేరీ యనెను.

"మేరీ, నీ కింకను సందియ మేల? నా కంతయు బోధపడి నది. రాస్ సెలవు దీసికొని యెటకో చనియున్నా డంటివి

కదా! వా డెప్పుడు మరలి వచ్చును?" అని రోలో ప్రశ్నించెను.

"మూడు దినములే సెలవుగోరెను" అని మేరీ యనెను.

"సరియే. నీతండ్రి వ్రాసియుంచిన వీలు ఆఫీసులోని క్రొత్త సేఫులో కదా యుంచితివి?" అని రోలో ప్రశ్నించెను.

"అవును" అని మేరీ యనెను.

"పీటరది దొంగిలించెను" అని యనెను రోలో.

"నే నట్లూహించలేను. సేఫు తాళము లెట్లు సంగ్రహింపగలడు? రాప్ వద్ద కదా తాళము లున్నవి?" అని మేరీ యాశ్చర్యముతో బలికెను.

"నీ కనుమాన మున్నచో, నీవద్ద గల రెండవ తాళముతో సేఫు దీసి చూడుము. అందు వీలు లేకపోవుటయే గాక, పీటరు రూపపటము కూడ నగుపడును" అని రోలో యనెను.

"అవు నవును. వాడే పెట్టె దెరచియున్నచో, వాని ఛాయాపట మందు ముద్రించబడును. ఇటనుండి గృహమున కేగగనే, సేఫు తెరచి చూచెదను" అని మేరీ యానందముతో ననెను.

"ఏ పెట్టులైనను, నేటి విందుకు మాత్రము తగిన యేర్పాటు జేయుము. పీటరు మరల నీతో సంభాషించునపుడు, తిరస్కారపు మాట లాడక, వానికి గొంత యాశ జూపెట్టుము. విందు ముగిసిన పిమ్మట నిశ్చయముగ జబాబు నిచ్చెదననుము. వాని మిత్రు లెవరైన నున్నచో, వారిని గూడ ముఖ్యముగ రప్పించుమని పీటరుతో జెప్పుము" అని రోలో సలహా చెప్పెను.

"ఆపిమ్మట కథ?" అని మేరీ ప్రశ్నించెను.

"అందుకు నన్ను విడువుము. పైవారి నెవరిని గూడ బిలువకుము. కెన్నీ, మేయో, ట్రేసీ,—సాక్షులుగా నుండుటకు వీరు చాలును. ట్రేసీతో యోచించి, తక్కిన యేర్పాటుల జేయించెదను. మధ్యాహ్నము నీ విచ్చటి కొకసారి వచ్చి, నన్ను గలిసికొనవలెను. నేటి సాయంత్రమునరికి, రాస్ మరలివచ్చిన చో, వానిని కూడ బిలువుము. నీ సంతకముతో పీటరు చేతికి గొన్ని కార్డుల నిమ్ము. వా డెవరిని పిలిచినను, కా దనకుము. పీటరు నెడ, నేడు మిక్కిలి యభిమానముతో నున్నదానివలె బ్రవర్తించవలెను. గ్రహించుకొమ్ము!" అని రోలో చెప్పెను.

"ఈ నాటక మెట్లు పరిణమించునో చూడవలయు! సరియే, నీ వనినట్లే చేసెదను" అని మేరీ చిరునవ్వుతో ననెను.

ఇంతలో కెన్నీ వచ్చుచున్నట్లు సవ్వడి వినవచ్చెను. మేరీ లేచి నిలువబడెను. లోనికి రమ్మని యనుజ్ఞగొని, కెన్నీ, ట్రేసీ మేయో, జూలియా—అందరును రోలో యుండిన గది బ్రవేశించి, కూర్చునిరి.

* * * * * *

మేరీ నిజగృహమున కేగి, సేఫు తెరచి చూడ, సంచు వీలు లే కుంటయే గాక, పీటరు ఛాయాపట మొకటి యగుపడెను. కాని, బొమ్మ స్ఫుటముగ ముద్రింపబడ లేదు. పటము గాంచి, పీట రని పోల్చుకొనవచ్చును. ఆఫీసునుండి మరలివచ్చి, గదిలో గూర్చుని, మేరీ యాపటము దిలకించుచు, తనలో ననిధరీతుల నాలోచింపదొడగెను. పీటరుపై భరింపనలవికాని యసూయతయు, కోపమును జనించెను. పటమును వెంటనే జూలియా చేతి కొసగి, యామెను లేబొరేటరి కంపెను.

పీటరు మధ్యాహ్న భోజనమునకు మరలి వచ్చినప్పటికి చాల యాలస్యమాయెను. వాడువచ్చునని మేరీ వేచియుండి, భుజించునప్పుడు వాని ప్రక్కనే గూర్చుని, మాటికిచీటికి నుప్పెనగా నవ్వుచు, పీటరుతో నేమేమో మాటలాడుచు, మెల మెల్లగ వానిని రంజింపజేసెను. మేరీకి తనపై నిట్టి యపూర్వ యభిమాన మేల కలిగినదో యని పీట రేమియు ననుమానింపలేదు. జవ్వని నడవడిక వానిని పరవశునిచేసి, బుద్ధిని హరించెను.

భోజనానంతరము మేరీ నొంటరిగా గని, పీట రామెను తదేకధ్యానముతో జూచుచు, చిరునవ్వు నవ్వెను. మేరీ కూడ, వానివైపు దిరిగి మెల్లగ నవ్వెను!

"మేరీ, ఐన నన్ను నిరాశ జేసికొనమందువా యేమి? నా బ్రతుకు భ్రష్టుజేయుటే, నీ యభీష్టమా?" అని పీటరనెను.

"పీటర్, ఓరిమి లాభకారి కాదా? నీ విట్లు తొందరపడిన నే నేమనగలను? ఆలోచించుటకు నాకు వ్యవధి నీయవా? నేటిరాత్రి విందు ముగిసినపిమ్మట, నీ కేదో నిశ్చయముగ దెల్పెదను. ఇప్పుడు న న్నేమియు నడుగకుము. నిజముగ నన్ను ప్రేమించుచున్నావని కదా యంటివి? నీ మాటల నమ్ముచున్నాను. నేడు నా దొక చిన్నకోరిక గలదు. నెరవేర్చెదవా?" అని చిరునవ్వుతో ప్రశ్నించెను.

"నీ వేమి చెప్పిన, నది చేసెదను. నీయాజ్ఞను మీరుటకు నాకు శక్యమా?—"

"అదిగో, మరల నట్టిమాట లాడవలదు; ఓరిమి లేనివాడ వైనచో—"

"మేరీ, క్షమింపుము. నీకోరిక యేమో చెప్పుము. తప్పక దీర్చెదను."

"ఏమియు లేదు నేటిరాత్రి భోజనపంక్తికి నీవు దగ్గర స్నేహితు లెవ్వరైన నున్నచో బిలువుము."

(అని కొన్ని కార్డుల దీసి మేరీ వాని కొసగుచు),

"అత్త వాలీన్, సోఫియా, నీవు, నేను, జూలియా, మిల్లీ, ట్రెసీ, కెన్నీ—ఇంక నిద్దరి నెవరినైన నీవు బిలువుము."

"సరియే, నేటిరాత్రి నాకు తప్పక జబాబు నొసగెదవు కదా?" అని పీట రానందముతో బలికెను.

"మాట యిచ్చి తప్పుదునా? నిశ్చయముగ నేనో యొకటి చెప్పితీరుదును. నమ్ముము. నే నిప్పుడు బజారుకు బోవలసియున్నది. మరచిపోవలదు సుమీ! నీకు మిత్రు లగువారు నాకును మిత్రులే కదా!" అని క్రీగంట జూచుచు, నవ్వి, మేరీ లేచెను.

* * * * * *

"రోజా, ఇంక టామీ మన కడ్డముగ నిలువడు. దయ్యమై మన రహస్యము వెలిబుచ్చగల డేమో కాని, జీవములతో జేయకుండ కాపాడుకొంటిని. అన్నా, వీ డెంత ద్రోహిగా మారెను?"

"శిక్షనుండి కాచెదనని ట్రెసీ యభయ మిచ్చియుండును. లేనిచో వా డంతసాహసముజేయలేడు. అదిగాక రోలో మరణమొకటి వానికిష్టములేదు. అందుచే మనసు మరల్చుకొని—"

"రోజా, పోనిమ్ము. ఇం కేల వానిగూర్చి జర్చించుకొనవలెను? ఇటుపై వాడు మన కేహానియు జేయలేడు కదా? ఈసరికి జచ్చియేయుండును" అని బ్లాకీ విరసముగా నవ్వెను.

"ఎవరి నిందుకు నియమించితివి?"

"డెసీమా'ను. ఆమె నిపుణురాలని నమ్మెదము."

ఇట్లు వారిరువురును సంభాషించుకొనుచున్నసమయమున వాకిట గంట మ్రోగెను. లేచి బ్లాకీ ద్వారముదరి కేగి, చూచెను. పీటరు చిరునవ్వుతో బ్లాకీ నెదుర్కొని, లోనికి వచ్చెను. లేఖల నంపినచో, బ్లాకీ విందుకు విచ్చేయునో లేదో యని, స్వయముగ దానే వచ్చి, భార్యాభర్తల నిరువురను రమ్మని ప్రార్థించెను. కొంతదనుక బ్లాకీ విందునుగూర్చి చర్చించెను. 'పీటరు కేమైన యాశ యున్నదా?' యనియు, 'నిజముగ మేరీ మనసు వానిపై మరల్చుకొనినదా?' యనియు, నింక ననేకవిధము లగు సంశయముల నడిగి, దీర్చుకొని, తప్పక మేరీ దివ్యభవనమునకు వచ్చుట కొడంబడి సమ్మతి నొసగెను. రోజా కూడ, 'నటులనే చూత' మనియెను, కాని నిశ్చయముగ 'వత్తు'నని వాగ్దానము నీయలేదు. బ్లాకీ వారు వేసమున వచ్చుటకు నిశ్చయించి, పీటరుతో నట్లు జెప్పెను. పిమ్మట పీటరు సెలవు దీసికొని, లాలీ మందిర గృహోన్ముఖుడై యరిగెను.

* * * * *

సాయంకాలము లేబొరేటరీలో సుఖాసీనులై, నాటి రాత్రి జరుగబోవు విందు గూర్చి రోలో మేరీ లనేక విధముల జర్చించుకొనుచు, జేయుబోవు యేర్పాటుల నాలోచించుకొనుచుండిరి. రోలో ఫ్రిసీని పనిపై పోలీసు ఠాణాకు మేమోవద్దకు బంపియుండెను. నాడు తన యింటికి విందునకు రాబోవు యతిథుల నత్కరించుటకు వలయు గొంత సామగ్రిని కొని తెచ్చుటకై